క. పరహితము సేయు నెవ్వఁడు, పరమహితుం డగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము, పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ. 236

క. హరి మది నానందించిన, హరిణాక్షీ జగంబు లెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ, గరళము వారించు టొప్పుఁ గమలదళాక్షీ.

క. శిక్షింతు హాలహలమును, భక్షింతును మధురసూక్ష్మఫల[1]రసము క్రియన్
రక్షింతుఁ బ్రాణికోట్లను, వీక్షింపుము నీవు నేఁడు వికచాబ్జముఖీ. 238

వ. అని పలికిన ప్రాణవల్లభునకు వల్లభ దేవా దేవరచిత్తంబుకొలంది నవధరింతు గాక యని పలికె ననిన నరేంద్రుం డిట్లనియె. 239

మ. అమరన్ లోకహితార్థ మంచు నభవుం డౌఁ గాక యం చాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి వో యంభోజగర్భాదులుం
[2]దమ కేమీ హర లెమ్ము లెమ్మనిరి వో తాఁ జూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగు మనె నయ్యుగ్రానలజ్వాలలన్. 240

వ. అనిన శుకుం డిట్లనియె. 241

క. మ్రింగెడువాఁడు విభుం డని, మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ, మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో. 242

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బిడన్
ఘనగంభీరరవంబుతో శివుఁడు లోకద్రోహి హుం పోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్. 243

వ. అయ్యవిరళ(మహా)గరళదహనపానసమయంబున. 244

మ. కదలం బాఱవు పాఁపపేరు లొడలన్ ఘర్మాంబుజాలంబు పు
ట్టదు నేత్రంబుల కెంజ రాదు నిజజూటార్ధేందుఁడుం గందఁడున్
వదనాంభోజము వాడ దావిషము నాహ్వానించుచో డాయుచోఁ
బదిలుం డై కడి సేయుచోఁ దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్. 245

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి శివుఁడు చఱుల విషాగ్నిం
గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫల[3]రసము క్రియన్.

క. మెచ్చిన మచ్చిక గలిగిన, నిచ్చిన నీ వచ్చుఁ గాక యిచ్చ నొరులకుం
జిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె, చిచ్చఱచూ పచ్చుపడిన శివునకుఁ దక్కన్. 247

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ, గప్పుగలిగి తొడవు కరణి నొప్పె
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న, భూషణంబు గాదె భూవరేంద్ర. 248

వ. తదనంతరంబ. 249

---

1 ముక్కియన్ శే గక్షింతు. 2 'దమ గావన్' అ. ప్ర. 3 గతి నధిపా.

క. గరళంబుఁ గంఠబిలమున, హరుఁడు ధరించుటకు మెచ్చి ♦ యా నా ననుచున్
హరియు విరించియు నుమయును,సురనాథుఁడుఁ బొగడి రంత ♦ సుస్థిరమతితోన్.
క. హాలాహలభక్షణకథ, హేలాగతి నైన విన్న ♦ నెలమిఁ బఠింపన్
వ్యాళానలవృశ్చికముల, పా లై చెడ రెట్టిజనులు ♦ భయవిరహితు లై. 251
వ. మఱియు నారత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ. 252

—✿ పాలకడలిం దరుచునెడ నైరావతాదులు జనించుట. ✿—

క. తెల్లనిమేనును నమృతము, జిల్లున జల్లించుపొదుఁగు ♦ శితశృంగములుం
బెల్లుగ నర్థులకోర్కులు, వెల్లిగొలుపు మొదవు పాల ♦ వెల్లిం బుట్టెన్. 253
ఆ. అగ్నిహోత్రి యనుచు ♦ నాసురభిని దేవ,మునులు పుచ్చికొనిరి ♦ మున్న యడిగి
విబుధసంఘములకు ♦ వెరవుతో నధ్వర, హవులు వెట్టుకొఱకు ♦ నవనినాథ. 254
వ. మఱియు నాజలరాశియందు. 255
క. సచ్చంద్రపాండురం బై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురగ ♦ మొగి జనియించెం
బుచ్చికొనియె బలిదైత్యుం, డిచ్చగొనం డయ్యె నింద్రుఁ ♦ డీశ్వరశిక్షన్. 256
క. ఒఱ పగునురమును బిఱుఁదును, నెఱేఁదోఁక యుముఖము సిరియు ♦ నిర్మలఖురముల్
కుఱుచచెవులుఁ దెలిగన్నులుఁ, దఱ చగుకందంబుఁ జూడఁ ♦ దగు నాహరికిన్.
వ. అంత నప్పాలకుప్పయందు. 258
క. దంతచతుష్టాహతి శై, లాంతంబులు విఱిగి పడఁగ ♦ నవదాతరుచి
త్కాంతం బగునైరావణ, దంతావళి ముద్భవించె ♦ ధరణీనాథా. 259
క. తెడ లేనినడపువడి గల, యొడలును బెనునిడుదకరము ♦ నురుకుంభముల్
బెడఁ గై యునతులమురిపపు, నడపులకున్ మూలగురువ ♦ నన్ గజ మొప్పెన్.
వ. మఱియు న త్తరంగిణీవల్లభు మథించునయ్యెడ. 261
ఆ. ఎల్లఋతువులందు ♦ నెలరారి పరువ మై, యింద్రువిరులతోఁట ♦ కేపు దెచ్చి
కోరి వచ్చువారి ♦ కోర్కుల నీనెడు, వేల్పుమ్రాను పాల ♦ వెల్లిఁ బుట్టె. 262
వ. మఱియునుం గొండకవ్వంబునం గడలి గిలకరింప నప్సరోజనంబు జనించె నంత.
క. క్రొక్కారుమెఱుఁగుమేనులుఁ, గ్రిక్కిఱిసినచన్నుఁగవలుఁ ♦ గ్రిస్సినసడుముల్
పిక్కటిలి యున్నతుఱుములుఁ, జక్కనిచూపులును దివిజ ♦ సతులకు నొప్పెన్.
వ. వెండియు నారత్నాకరంబునందు (సుధాకరుం డుద్భవించి విరించియనుమతం
బునఁ దనయథాస్థానంబునం బ్రవర్తించుచుండె నంత.) 265
క. తొలుకారుమెఱుఁగుకై వడిఁ, దళతళ మని మేను మెఱవ ♦ ధగధగ మనుచుం
గలుముల నీనెడుచూపులఁ, జెలువంబుల మొదలిటెంకి ♦ సిరి పుట్టె నృపా. 266
సీ. పాలమున్నీటిలో ♦ పలిమీఁదిమీఁగడ,మిసిమి[1]జిడ్డునఁ జేసి ♦ మేను వడసి
క్రొక్కారుమెఱుఁగుల ♦ కొనలక్రొత్తళుకుల,మేనిచే గలనిగ్గు ♦ మెఱుఁగు సేసి

1 జిడ్డుఱసేసి,

నాఁటినాఁటికి బోఁద § నవకంపుఁదీవల, నునుఁబోఁద నెయ్యంబు § నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి § కొలఁకునఁ బ్రొద్దునఁ, బొలసినవలపులఁ § బోరిది వెట్టి
తే. పసిఁడిచంపకదామంబు § బాగుఁ గూర్చి, వాలుక్రొన్నెల[1] చెలువున § వాఁడి దీర్చి
జాణతనమునఁ జేతుల § జడ్డు విడిచి, నలువ యీకొమ్మ నొగిఁ జేసి § నాఁడు నేఁడు.
క. కెం పారెడునధరంబును, జం పారెడినడుము సతికి § శంపారుచులన్
సొం పారుమోముఁ గన్నులుఁ, బెం పారుచు నొప్పు గొప్ప § పిఱుఁదును గుచముల్.
వ. అని జనులు పొగడు చుండ. 269

సీ. తరుణికి మంగళ § స్నానంబు సేయింత, మని పెట్టె నింద్రుఁ డ § నర్ఘ మైన
మణిమయపీఠంబు § మంగళవతు లైన, వేలుపుగరితలు § విమలతోయ
పూర్ణంబు లై యున్న § పుణ్యాహకలశంబు, లిడిరి పల్లవముల § నిచ్చె భూమి
గడిమి గోవులు పంచ § గవ్యంబులను నిచ్చె, మలసి వసంతుండు § మధు వొసంగె
తే. మునులు గల్పంబుఁ జెప్పిరి § మొగిలుగములు, పణవగోముఖకాహళ § పటహమురజ
శంఖవల్లకీవేణుని § స్స్వనము లిచ్చెఁ, గాడి రాడిరి గంధర్వ § పతులు సతులు. 270
క. పండితసూక్తులతోడుతఁ, దుండంబులు సాఁచి తీర్థ § తోయము లెల్లం
గుండముల ముంచి దిగ్వే, దండంబులు జలక మార్చెఁ § దరుణీమణికిన్. 271
సీ. కట్టంగఁ బచ్చని § పట్టుఁబుట్టపుదోయి, ముదితకుఁ దెచ్చి స § ముద్రుఁ డిచ్చెఁ
మత్తాళినికరంబు § మధు వాన మూఁగిన, వైజయంతీమాల § వరుణుఁ డిచ్చెఁ
గాంచనకేయూర § కంకణకింకిణీ, కటకాదులను విశ్వ § కర్మ యిచ్చె
భారతి యొకమంచి § తారహారము నిచ్చెఁ, బాణిపద్మము నిచ్చెఁ § బద్మభవుఁడు
ఆ. కుండలివ్రజంబు § గుండలముల నిచ్చె, శ్రుతులు భద్ర మైన § నుతులు సేసె
నెల్లలోకములకు § నేలికసాని వై, బ్రదికె దనుచు దిశలు § పలికె నధిప. 272
వ. మఱియును. 273

సీ. పలుకుల నమృతంబు § సిలుక నెవ్వానితో, భాషించె వాఁడెపో § బ్రహ్మ యనఁగ
నెలయించి కెంగేల § నెవ్వాని వరియించె, వాఁడె లోకములకు § వల్లభుండు
మెయిదీఁగె నెవ్వాని § మేనితోఁ గదియించె, వాఁడె పో పరమస § ర్వజ్ఞమూర్తి
నెలఁతుక యెప్పుడు § నివసించె నేయింట, నాయిల్లు పరమగు § నమృతపదము
ఆ. నింతిచూపు వాఱె § నెచ్చోటి కచ్చోటు, జిష్ణుధనదధర్మ § జీవితంబు
గొమ్మపిన్నసగవు § గురుతరదుఃఖని, వారణంబు సృష్టి § కారణంబు. 274
వ. మఱియు నక్కొమ్మ నెమ్మనంబున. 275

సీ. భావించి యొకమాటు § బ్రహ్మాండ మంతయు, నాటలబొమ్మరి § ల్లని తలంచుఁ
బోలించి యొకమాటు § భువనంబు లన్నియుఁ, దనయింటిలోఁదొంతు § లని తలంచుఁ

---

1 చెన్నువ.

పాటించి యొకమాటు బ్రహ్మాది[1]సురులను, దనయింటిలో బొమ్మ లని తలంచు
గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు, నలవడ బొమ్మపీఁట యని తలంచు
అ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల, నచటిదీపకళిక లని తలంచు
భామ యొక్కమాటు భారతీదుర్గల, నాత్మసఖు లటంచు నాదరించు. 276

వ. తదనంతరంబ. 277

ఆ. చంచరీకనికర ఝుంకారనినదంబు, దనరునుత్పలముల దండఁ బట్టి
మేఘకోటినడిమి మెఱుఁగుఁబుత్తడిమాడ్కి, సురలనడుమ నిల్చె సుందరాంగి.
క. ఆకన్నులు నాచన్నులు, నాకురు లాపిఱుఁదు నడుము నాముఖ మానన
వ్యాకారముఁ గని వేల్పులు, సీకాకునఁ బడిరి కలఁగి శ్రీహరి దక్కన్. 279
వ. అట్లు నిలిచి దశదిశలం బరివేష్టించి యున్నయక్షరక్షస్సిద్ధసాధ్యదివిజగరుడగం
ధర్వచారణప్రముఖనిఖిలయూథంబులం గనుంగొని యప్పురాణప్రౌఢకన్య
కారత్నంబు దనమనంబున నిట్లని వితర్కించె. 280

సీ. ఐదువ నై యుండ నలవడ దొకచోట, నొకచోట సవతితో నోర్వరాదు
తగ నొకచోట సంతతవైభవంబు గా, దొకచోట వేడిమి నుండఁ బోల
దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన, నొకచోట డగ్గఱి యుంట బెట్ట
నెఱయంగ నొకచోట నిలుకడ సాలదు, చర్చింప నొకచోట జడత గలదు
ఆ. కొన్నిచోట్లు కామగుణగరిష్ఠంబులు, క్రోధసంయుతములు గొన్ని యెడలు
గొన్ని మోహలోభకుంఠితంబులు గొన్ని, ప్రమదమత్సరానుభావకములు.
వ. అని సకలసత్పురుషజనవర్తనంబులు మానసించి పరిహరించి. 282

సీ. అమర ముత్తైదువ నై యుండవచ్చును, వరుసకు సవతు లెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంతవిభవ మీతనియిల్లు, శృంగారచందనశీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి, విమలుండు గదిసి సేవింప వచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు, సకలకార్యములందు జడత లేదు
ఆ. సాధురక్షకుండు షడ్వర్గరహితుండు. నాథుఁ డయ్యె నేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ, బుష్పదామకమునఁ బూజ సేసె.
క. ఇందీవరదామమున ముకుందునిఁ బూజించి తనకుఁ గూడి వసింపన్
మందిరముగఁ దద్వక్షము, నందంద సలజ్జదృష్టి నాలోకించెన్. 284
ఆ. మోహరుచులవలన ముద్దియ దల యెత్తు, సిగ్గువలన బాల శిరము వంచు
నింతి వెఱఁగువలన నెత్తదు వంపదు, తనదుముఖము ప్రాణదయితుఁ జూచి.
క. హరి సూచిన సిరి సూడదు, సిరి సూచిన హరియుఁ జూడ సిగ్గునఁ బొందున్
హరియును సిరియును దమలో, సరిఁ జూపులఁ జూడ మరుఁడు సందడి వెట్టెన్.

---

1 జంతువు లనువందులో బొమ్మ.

చ. జగములతండ్రి యై తనరు శౌరి జగంబులతల్లి నిందిరం
దగ నురమందుఁ దాల్చె నటఁ దత్కరుణారసదృష్టిచేఁ బ్రజల్
మగుడఁగఁ దొంటిభంగి నతిమంగళసాధ్విపతిత్వసంపదన్
నెగడినలోకముల్ గని రనేకశుభంబులఁ బొంది రత్తఱిన్. 287

వ. (అట మున్న యబ్ధిరాజు తనయందు నున్నయమూల్యం బయినకౌస్తుభంబు పేరిటి యనర్ఘమణిరాజంబు నయ్యంబుజాక్షునకు సమర్పించిన దానిం దనవక్షస్స్థలం బున ధరియించె నప్పు డయ్యాదిలక్ష్మియు శ్రీవత్సకౌస్తుభవైజయంతీవనమాలి కాతారహారాద్యలంకృతం బైనపుండరీకాక్షువక్షస్స్థలంబున వసియించె నయ్యవ సరంబున.) 288

శా. మ్రోసెన్ శంఖమృదంగవేణువిపముల్ మున్నాడి పంజీకటుల్
వాసెన్ నర్తనగానలీలల సురల్ భాసిల్లి రాయ్యల్ జగ
ద్వ్యాసుల్ విష్ణుని బ్రహ్మరుద్రముఖరుల్ దల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసితపుష్పశ్రేణి వర్షించుచున్. 289

క. ఆపాలవెల్లికూఁతురు, గీపులచూపులను నోఁగి తిలకించి ప్రజల్
చేపట్టిరి సంపదలను, శాపించెను మేలు జగము బ్రదికె నరేంద్రా. 290

క. పాలేటిరాచకన్నియ, మేలారెడుచూపు లేక [1]మిడుమిడు కంచుం
జాలిం బురపురఁ బొక్కుచుఁ, దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా. 291

క. వారిధిఁ దరువఁగ నంతట, వారుణి యన నొక్క కన్య వచ్చిన నసురుల్
వారిజలోచనుసమ్మతి, వారై కైకొనిరి దాని వారిజనేత్రన్. 292

వ. మఱియుఁ దరువం దరువ నప్పయోరాశియందు. 293

సీ. తరుణుండు దీర్ఘదోర్దండుండు కంబుకం,ధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాసితభూషణాలంకృతుం డరుణాక్షుఁ, డున్నతోరస్కుఁ డత్యుత్తముండు
నిలకుంచితకేశనివహుండు జలధర,శ్యాముండు మృగరాజసత్త్వశాలి
మణికుండలుఁడు రత్నమంజీరుఁ డచ్యుతు,నంశాంశసంభవుం డమలమూర్తి

ఆ. భూరియాగభాగభోక్త ధన్వంతరి, యనఁగ నమృతకలశహస్తుఁ డగుచు
నిఖిలవైద్యశాస్త్రనిపుణుఁ డాయుర్వేది, వేల్పువెజ్జు గడలి వెడలి వచ్చె. 294

వ. తదనంతరంబ. 295

ఆ. అతనిచేత నున్నయమృతకుంభము సూచి, కెరలు వొడిచి సురలఁ గికురువెట్టి
పుచ్చికొనిరి యసురపుంగవు లెల్లను, మాఱు లేనిబలిమి మానవేంద్ర. 296

వ. వెండియు. 297

ఆ. చావు లేనిమందు చక్కఁగ మన కబ్బె, ననుచుఁ గడవ నసురు లాఁచికొనిన
వెఱచిసురలుహరికి మొఱలువెట్టిరి సుధా,పూర్ణఘటమువోయెఁ బోయె ననుచు.

---

1. మిడుక మిడుకుచుం.

—✽ శ్రీవిష్ణుమూర్తి మోహినీస్వరూపంబు నొందుట. ✽—

వ. ఇట్లు శరణాగతులైన వేల్పుల దైన్యంబు వొడగని భృత్యజనకామదుం డగు నప్పరమేశ్వరుండు మీరలు దుఃఖింపవలవ దేను నామాయాబలంబునం జేసి మీయర్థంబు మరల సాధించెద నని పలికెం దత్సమయంబున నయ్యమృతపూర్ణంబు నేమ త్రాఁపుదు మని తమకించు దైత్యదానవజనంబులలోపల నమంగళం బగు కలి సంభవించినకతంబునఁ బ్రబలు లగు రక్కసులు విలోకించి సత్త్రయాగంబు(నందు నడచు)చందంబునఁ దుల్యప్రయాసహేతువు లగు సురలును సుధాభాగంబున కర్హు లగుదురు గావునఁ బంచి కుడుచుట కర్తవ్యం బిది సనాతనం బగు ధర్మం బగుటం జేసి యియ్యమృతకుంభంబు విడువుం డని దుర్బలు లగు నిశాచరుల(జాతమత్సరులై తమవారల) వారించుచున్న సమయంబున. 299

ఆ. ఒకనిచేత నుండ ✽ నొకఁడు బలిష్ఠుఁడై, పుచ్చికొనిన వాని ✽ బోదుగఁ బట్టి
యంతకంటె నధికుఁ ✽ డమృతకుంభము నెత్తి, కొంచుఁ బాఱెఁ బరులు ✽ గుయ్యిడంగ.

వ. అంత. 300

సీ. మెత్తనియడుగులు ✽ మెఱుఁ గారుజానువు, లరఁటికంబములఁ బో ✽ లైనతొడలు
ఘన మగుజఘనంబుఁ ✽ గడు లేఁతనడుమును, బల్లవారుణకాంతి ✽ పాణియుగముఁ
గడుఁ గ్రొవ్వుఁ బాలిండ్లుఁ ✽ గంబుకంఠంబును, బింబాధరముఁ జంద్ర ✽ బింబముఖముఁ
దెలిగన్నుఁగవయును ✽ నలికుంతలంబులు, బాలేందుసన్నిభ ✽ ఫాలతలము

తే. నమరఁ గుండలకేయూర ✽ హారకంక, ణాదు లేపార మంజీర ✽ నాద మొప్ప
[1]నల్లనవ్వులఁ బద్మద ✽ ళాక్షుఁ డసుర, పతుల నడఁగింప నాఁడురూ ✽ పంబు దాల్చె.

వ. అయ్యవసరంబున జగన్మోహనాకారంబున. 303

సీ. పాలిండ్లపై నున్న ✽ పయ్యెద జాఱించు, జాఱించి మెల్లనఁ ✽ జక్క నొత్తుఁ
[2]దళ్కుదళ్కనుగండ ✽ ఫలకంబు లోలయించు, నోలయించి కెంగేల ✽ నుజ్జగించుఁ
గడు మెఱుంగులు [3]వాఱు ✽ కడకన్ను లల్లార్చు, నల్లార్చి ఱెప్పల ✽ నండగొలుపు
నవరనిదరహాస ✽ చంద్రికఁ జిలికించుఁ, జిలికించి కెమ్మోవిఁ ✽ జిక్కుపఱచు

తే. దళితధమ్మిల్లకుసుమగం ✽ ధమ్ము నెఱపుఁ, గంకణాదిఝణంకృతుల్ ✽ గడలుకొలుపు
నొడలికాంతులు పట్టులే ✽ కులుకఁ బాఱు, [4]సన్నవలిపెంపుఁ బయ్యెద ✽ సౌకళింప.

వ. ఇవ్విధంబున నక్కపటయువతీరత్నంబు జగన్మోహనదేవతయునుం బోలె నెమ్మొగంబు తావికి మత్తిల్లిన తేఁటిమొత్తంబులఁ గెలిచి చిగురుజొంపంబుల నెడగలుగ జడియుచు మురియుచుండ రాక్షసవరులు గనుంగొని. 305

సీ. ఔఁ గదే లావణ్య ✽ మాఁ గదే మాధుర్య, మాఁ గదే సతి నవ ✽ యౌవనాంగి
యెటనుండి వచ్చితి ✽ వే మిచ్చగించెదు, నీనామ మెయ్యది ✽ నీరజాక్షి

1 నల్ల నగుచుఁ. 2 దళు దళుక్కన గండ. 3 వాఱఁ గడ. 4 సన్నవలిపెంబు వెలువడి.

యమరగంధర్వవి§ద్యాధరచారణ,మనుజకన్యలకు నీ§మహిమ గలదె
ప్రాణచిత్తేంద్రియ§పరిణామదాయి వై, నిర్మించె బో విధి § నిన్నుఁ గరుణ
తే. వనిత కశ్యపసంతతి§వార మేము, భ్రాతలము [1]కృతసమయత్న§పౌరుషులము
జ్ఞాతులకు మాకు నేకార్థ§సంగతులకుఁ, బాలు దేఱనియర్థంబు§పంచియిమ్ము. 306
క. సభ వై యుండెద మిందఱ, మభయంబున వచ్చు కొలఁది § నమృతంబునుని
విభరాజగమన తప్పక, విభజింపు విపక్షపక్ష§విరహితమతి వై. 307
వ. అని నిమంత్రించుదైత్యులం గని మాయాయువతీరూపుం డగుహరి తనవాఁడి వాలుఁజూపుటంపఱవలన వారలతాలుముల నగలించి చిఱునగవు లెగయ మొగ మెత్తి యి ట్లనియె. 308
క. సుందరు లగుపురుషులఁ గని, పొందెదునాయందు [2]నిజము § వుట్టునె మీకున్
బృందారకరిపులారా, చెందరు కామినుల విశ్వ§సింపరు పెద్దల్. 309
క. పలుకులు మధురసధారలు, దలఁపులు నానాప్రకార§దావానలముల్
చెలుములు సాలావృకములు, చెలువల సమ్మోటలు వేద§సిద్ధాంతము లే. 310
క. నా నేర్చుకొలఁది మీకును, మానుగ విభజించి యిత్తు § మానుఁడు శంకం
గా నిం డనవుడు నిచ్చిరి, దానవు లమృతంపుఁగడవఁ § దరుణీమణికిన్. 311
క. ఆశాంతాలోకనములు, నాశీతలభాషణములు § నాలాలితముల్
రాశిపరంపర లగుచుం, బాశము లై వారినోళ్లు § బంధించె నృపా. 312
వ. ఇట్లు సుధాకలశంబు కేల నందికొని మందస్మితభాషణంబుల సుందరీరూపుం డగుముకుందుండు మేలు గీడనక యేను బంచి(యిచ్చి)న తెఱంగున నంగీకరించుట కర్తవ్యం బనవుడు నగుం గాక యని సురాసురదైత్యదానవసమూహం బుపవసించి కృతస్నాను లై హోమంబు లాచరించి విప్రులకు గోభూహిరణ్యాది దానంబులు సేసి తదాశీఃప్రవచనంబులు గైకొని ధవళపరిధాను లై గంధమాల్యధూపదీపాలంకృతం బగుకనకరత్నశాలామధ్యంబునఁ బ్రాగగ్రకుశపీఠంబులం బూర్వదిశాభిముఖు లై పంక్తులు గొని యున్నసమయంబున. 313
క. శ్రోణీభరకుచయుగభర, వేణీభరములను డస్సి § వివిధాభరణ
శ్రేణి యయి యువిద వచ్చెను, పాణిసరోజమున నమృత§భాండముఁ గొంచున్.
క. భాసురకుండలభాసిత, నాసాముఖకర్ణగండ§నయనాంచల యై
శ్రీసతి యగుసతిఁ గని దే, వాసురయూథంబు మోహ § మందె నరేంద్రా. 315
వ. అప్పుడు. 316
క. అసురుల కమృతము వోయుట, పొసఁగదు పాములకుఁ బాలు§వోసినమాడ్కిన్
దొసఁ గగు నంచును వేఱొక, దెసఁ గూర్చుండంగఁ బెట్టె § దేవాహితులన్. 317
వ. ఇట్లు రెండుపంక్తులుగా నేర్పరించి. 318

---

1 'సురలకు నిర్థపౌరు' అ. ప్ర. 2 బుద్ధి.

సీ. వెగిరపడకుఁడీ వినుఁడు దానవులార, తడవుసేయక వత్తు దైత్యులార
యటు సక్కఁ గూర్చుండుఁడని కన్ను లల్లార్చి, చనుఁగవపయ్యెద జాఱుఁదిగిచి
[1]వదినెమఱందుల వావులు కల్పించి, మర్మంబు లెడలించి మఱుఁగు సేసి
మెల్లనినగవుల మేనులు మఱపించి, కడుజాణమాటలఁ గాకుపఱిచి
ఆ. యసురవరుల నెల్ల నడకించి సురలను, దడవు సేయ వలదు దాఁవుఁ డనుచు
వచ్చుకొలఁది నమృతవారి విభాగించెఁ, దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ.

వ. అయ్యవసరంబున. 320

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ, బంచి పెట్టెద నని పడఁతి పూనెఁ
దా నేల తప్పును దప్పదు తరళాక్షి, గాక రమ్మనుచు వేగంబ చీర
మఱుమాట లాడదో మఱి చూడకుండునో, చనుఁగవఁ గప్పునో చాలు ననుచు
నొండెడ కేఁగునో యొక్కింత సొలయునో, మనయెడఁ గందునో మగువ యనుచు
ఆ. నెలఁతచూడ్కిగముల నీరై కరంగుచుఁ
బ్రణయభంగభీతి బద్ధు లగుచు
నూరకుండ్రి గాని యువిద తే తెమ్మని
యడుగఁ జాలరైరి యసురవరులు. 321

వ. అప్పుడు. 322

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజుండై రాహు పీయూషపా
నము సేయం గని చంద్రభాస్కరులు సన్నల్ సేయ నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధము దదీయాంగంబు నేలం బడెన్. 323

ఆ. అజుఁడు వానిశిరము నంబరవీథిని, గ్రహము సేసి పెట్టి గారవించె
వాఁడు పర్వములను వైరంబు దప్పక, భానుచంద్రములను బట్టు చుండు.

క. ఒకబొట్టుఁ జిక్కకుండఁగ, సకలసుధారసము నమర[2]సంఘంబులకుం
బ్రకటించి పోసి హరి దన, సుకరాకృతిఁ దాల్చె నసురసుభటులు బెగడన్.

మ. అమరుల్ రక్కసులుం బ్రయాసబలసత్త్వార్థాభిమానంబులన్
సము లై లబ్ధవికల్పు లైరి యమరుల్ సంశ్రేయముం బొంది ర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తా మత్యంతదోర్గర్వులై
కమలాక్షున్ శరణంబు వేఁడనిజనుల్ గల్యాణసంయుక్తులే. 326

—దేవాసురయుద్ధము—

క. దానవు లమృతము ద్రావం, బూని పయోరాశిఁ ద్రచ్చి పొగిలినమాడ్కిన్
శ్రీనాథపరాఙ్ముఖు లగు, హీనులు పొందంగఁ జాల రిష్టార్థంబుల్. 327

క. శోధించి జలధి నమృతము, సాధించి నిలింపవైరిచక్షుర్గతులన్

---

1 'వదినెమఱందలి' అ. ప్ర. 2 సంఘము కల్లం.

రోధించి సురల కిడి హరి, బోధించి ఖగేంద్రు నెక్కి పోయె నరేంద్రా, 328

క. శుద్ధముగ సురల కమృతము, సిద్ధించిన నసురవరులు సిడిముడిపడుచుం
గ్రుద్ధులు నానాయుధస,న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిన్. 329

క. ధన్యులు వైరోచనిశత,మన్యుప్రముఖులు మదాభిమానులు దమలో
నన్యోన్యరణము బాహా, సిన్యాసంబులను జేర్చి చేసిరి కడిమిన్. 330

మ. అరుదై కామగమై మయాసురకృతంబై లోకితాలోక్యమై
వరశస్త్రాస్త్రసమేతమై తరళమై వైహాయసంబై మహా
సురయోధాన్వితమైనయానమున సంక్షోభిల్లెఁ బూర్ణేందుసు
స్థిరకాంతిన్ బలి చామరధ్వజచమూసందీప్తస్థితిన్ ముందటన్. 331

వ. మఱియు నముచి శంబర బాణ ద్విమూర్ధ కాలనాభ శకుని జంభాయోముఖ ప్రహేతి హేతి భూతసంత్రాస హయగ్రీవ కపి లేల్వలోత్కల మేఘదుందుభి మయ త్రిపురాధిప విప్రచిత్తి విరోచన వజ్రదంష్ట్ర తారకారిష్టారిష్టనేమి శుంభ నిశుంభ శంకుశిరః ప్రముఖులును పౌలోమ కాలేయులును నివాతకవచప్రభృతులును దక్కనదండయోధులునుం గూడికొని యరదంబులం దురగంబుల మాతంగంబుల హరిణంబుల హరి కిరి శరభ మహిష గవయ ఖడ్గ గండభేరుండ చమరీ జంబుక శార్దూల గో వృషాదిమృగంబులను గంక గృధ్ర కాక కుక్కుట బక శ్యేన హంసాదివిహంగంబులను దిమి తిమింగిలాదిజలచరంబులను నరులను నసురసురనికరవికృతవిగ్రహరూపంబు లగుజంతువులను నారోహించి తమకు నడియాలంబు లగుగొడుగులు పడగలు జోడుఁగైదువులు పక్కెరలు బొమిడికంబులు మొద లగుపోటుము ట్లాయితంబుగఁ గైకొని వేఱువేఱ మొనలై విరోచననందనుం డగుబలిముందట నిలువంబడిరి దేవేంద్రుండును నైరావతారూఢుండై వైశ్వానరవరుణవాయుదండధరాద్యనేకనిర్జరవాహినీసందోహంబును దాను నెదురుపడి పిఱుతివియక మోహరించె నట్లు సంరంభసన్నాహసముత్సాహంబుల రెండుదెఱంగులవారునుం బోరాడువేడుకల మీఁ టగుమాటల సందడించుచున్నసమయంబున. 332

సీ. వజ్రదంష్ట్రాంచితవ్యజనంబులును బర్హ,చామరంబులు సితచ్ఛత్రములును
చిత్రవర్ణధ్వజచేలంబులును వాత,చలితోత్తరోష్ణీషజాలములును
జప్పళ్ల నెసఁగుభూషణకంకణంబులుఁ, జండాంశురోచులశస్త్రములును
వివిధఖేటకములు వీరమాలికలును, బాణపూర్ణములైనతూణములును

ఆ. నిండి పెచ్చు రేఁగి నిర్జరాసురవీర, సైన్యయుగ్మకంబు సాల నొప్పె
గ్రాహతతులతోడఁ గలహంబునకు వచ్చు, సాగరములభంగి జనవరేణ్య.

క. భేరీభాంకారంబులు, వారణఘీంకారములును వరహరిహేషల్
భూరిరథనేమిరవములు, ఘోరములై పెల్లగించెఁ గులశైలములన్. 334

వ. ఇవ్విధంబున నుభయబలంబులును మోహరించి బలియు నింద్రుండును దారకుండును గుహుండును హేతియు వరుణుండును బ్రహేతియు మిత్రుండును గాలనాభుండును యముండును మయుండును విశ్వకర్మయు శంబరుండును ద్వష్టయు విరోచనుండును సవితయు నముచియుఁ బరాజితుండును వృషపర్వుండును నశ్వి దేవతలును బలిసుతబాణాదిపుత్రశతంబును సూర్యుండును రాహువును సోముండును బులోముండును ననిలుండును శుంభనిశుంభులును భద్రకాళీదేవియు జంభుండును వృషాకపియును మహిషుండు విభావసుండును నిల్వలవాతాపులును బ్రహ్మపుత్రులును దుర్మర్షణుండునుఁ గామదేవుండును నుత్కలుండును మాతృకాగణంబును శుక్రుండును బృహస్పతియు నరకుండును శనైశ్చరుండును నివాతకవచులు మరుత్తులును గాలేయులును వసువులు నమరులును బౌలోములును [1]విశ్వేదేవగణంబును గ్రోధవశులును రుద్రులును నివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వయుద్ధంబు సేయుచు మఱియు రథికులు రథికులను పదాతులు పదాతులను (వాహనారూఢులు వాహనారూఢులనుం) దాఁకి సింహనాదంబులు సేయుచు నట్టహాసంబు లిచ్చుచు నాహ్వానంబు లొసంగుచు నన్యోన్యతిరస్కారంబులు సేయుచు బాహునాదంబుల విజృంభించుచుఁ బెనుబొబ్బల నుబ్బి రేఁగుచు హుంకరించుచు నహంకరించుచు ధనుర్గుణంబులఁ డంకరించుచు శరంబుల నాటించుచుఁ బరశువుల నఱకుచుఁ జక్రంబులం జెక్కుచు శక్తులం దునుముచుఁ గశలం బెట్టుచుఁ గుఠారంబులఁ బొడుచుచు గదల నడుచుచుఁ(గరంబులఁ బొడుచుచుఁ) గరవాలంబుల వ్రేయుచుఁ బట్టిసంబుల నొంచుచుఁ బ్రాసంబులం ద్రెంచుచుఁ బాశంబులం గట్టుచుఁ బరిఘంబుల మొత్తుచు ముసలంబుల మోఁదుచు ముద్గరంబులఁ జళిపించుచు ముష్టివలయంబుల ఘట్టించుచుఁ దోమరంబుల నుఱుముచు శూలంబులఁ జిమ్ముచు నఖంబులం జీరుచుఁ దరుశైలంబుల నువ్వుచు నుల్ముకంబులం జూఁడుచు నిట్లు బహువిధంబులం గలహవిహారంబులు సలుపు నవసరంబున భిన్నంబు లైనశిరంబులును విచ్ఛిన్నంబు లైనకపాలంబులును వికలంబు లైనకపోలంబులును జిక్కువడినకేశబంధంబులును భగ్నంబు లైనదంతంబులును గృత్తంబు లైనభుజంబులును ఖండితంబు లైనకరంబులును విదళితంబు లైనమధ్యంబులును వివృతంబు లైనవదనబింబంబులును వికలంబు లైన నయనంబులును వికీర్ణంబు లయినకర్ణంబులును విశీర్ణంబు లైననాసికలును విఱిగిపడినయూరుదేశంబులును విసంధు లయినపదంబులును జిరిఁగినకంకటంబులును రాలినభూషణంబులును వ్రాలినకేతనంబులును గూలినఛత్త్రంబులును మ్రొగ్గినగజంబులును నుగ్గయినరథంబులును నుఱుమైనహయంబులును జింద

---

1 సక్రోధవశు లైన రుద్రవిశ్వేదేవతలును గ్రోధవశు లై తక్కినరక్కసులను దక్కినసురలను దాఁకి

అవందఱైనభటసమూహంబులును నోరలెడుకొఱప్రాణంబులును నుబ్బి యూ
డెడుభూతంబులును బాఱెడురక్తప్రవాహంబులును గట్టలు గొన్నమాంసంబు
లును నెగసి తిరిగెడికబంధంబులును గలకలంబులు సేయుకంకగృధ్రాదివిహంగం
బులు నయి యొప్పనప్పో రతిఘోరం బయ్యె నప్పుడు. 335

శా. నాకాధీశుఁ బదింట మూఁట గజమున్ నాల్గింట గుఱ్ఱంబులన్
ఏకాస్త్రంబున సారథిం జొనిపె దైత్యేంద్రుండు దా నావియ
ల్లోకాధీశుఁడు ద్రుంచి యన్నిటిని దోర్దో నన్నిభల్లంబులన్
రా కుండన్ [1]రిపువర్గముం దునిమె గీర్వాణారి యగ్గింపఁగన్. 336

సీ. తనతూపు లన్నియుఁ దర మిడి శక్రుండు, నఱకిన జోదువిన్ననువు మెఱసి
బలి మహాశక్తి చేఁ బట్టిన నదియును, నతఁడు ఖండించె నత్యద్భుతముగ
మఱి ప్రాసశూలతోమరములు గైకొన్నఁ, దోర్దోడ నవియును దునిమి వైచె
నంతటఁ బోక యొయ్యది వాఁడు సారించెఁ, దొడరి తా నదియును దుమురు సేసె

ఆ. నసురభర్త విరథుఁ డై పోయి పగఱకుఁ, గానఁబడక వివిధకపటవృత్తి
నేర్పు మెఱసి మాయ నిర్మించె మింటను, వేల్పుగములు గూడి వెఱఁగుపడఁగ.

వ. ఇట్లు దానవేంద్రునిమాయావిశేషవిధానంబున సురానీకంబుపైఁ బర్వతంబులు
వడియె దావాగ్నిదందహ్యమానతరువర్గంబులు గురిసె సటంకశిఖరనికరశిలా
సారంబులు గప్పె మహోరగదందశూకంబులు గఱచె వృశ్చికంబులు నిగ్గా
లె వరాహవ్యాఘ్రసింహంబులు గదిసి విదళింపన్ దొరఁకొనియె వనగజంబులు
మట్టి మల్లాడం జొచ్చె శూలహస్తులు దిగంబరులు నై రండు రండని బలురక్క
సులు శతసహస్రసంఖ్యలు ఛేదనచ్ఛేదనభాషణంబు లాడం దొడంగిరి వికృత
వదనులు గదాదండధారులు నాలంబితకేశభారులు విహాసులు నై యనేకరా
క్షసవీరులు పోనీకు పోనీకుఁడు తునుము తునుముం డని వెనుతగిలిరి పరుషగం
భీరనిర్ఘాతసమేతంబు లయినజీమూతసంఘాతంబులు (వాతాహతంబు లై)
యుప్పతిల్లిన నిప్పులకుప్పలు మంటలప్రోవులుం గురిసె మహాపవనవిజృంభితం
బైనకార్చిచ్చు ప్రళయానలంబుచందంబునం దరికొనియెఁ బ్రచండఝంఝానిల
ప్రేరితసముత్తుంగతరంగావర్తభీషణం బయినమహార్ణవంబు సెలియలికట్ట దాఁటి
వెల్లివిరిసిన ట్లయి యుండె నాసమయంబునం బ్రళయకాలంబునుంబోలె మిన్ను
మన్నును రేయుం బగలు నెఱుంగ రా దయ్యె నయ్యవసరంబున. 338

క. ఆయసురేంద్రునిబహుతర,మాయాజాలంబులకును మా ఱెఱుఁగక వ
జ్రాయుధముఖరాదిత్యు, లపాయంబునఁ బొంది చిక్కువడిరి నరేంద్రా. 339

వ. అప్పుడు. 340

క. ఇయ్యసురులచేఁ జిక్కితి, మెయ్యది వెర వెందుఁ జొత్తు మిటు వొలయఁ గదే

1 రిపుసర్వముం దునుము నిర్వాణార్థభంగిన్ వేసన్.

యయ్యో దేవ జనార్దన, కుయ్యో కుయ్యో యటంచుఁ గూయిడి రమరుల్.

వ. అయ్యెడ. 342

మ. విహగేంద్రాశ్వనిరూఢుఁ డై మణిరమావిభ్రాజితోరస్కుఁ డై
బహుశస్త్రాస్త్రమహాభుజాకలితుఁ డై భాస్వత్కిరీటాదిదు
స్సహుఁ డై నవ్యపిశంగవస్త్రధరుఁ డై సంఫుల్లపద్మాక్షుఁ డై
విహితాలంకృతితోడ మాధవుఁడు దా వేంచేసె నచ్చోటికిన్. 343

చ. అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిస లై నిరర్థమయి గ్రక్కునఁ బోయెను నిద్ర నొంది సం
తసమున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పు లందఱుం
బస సెడ కేల యుండు హరిపాదపరిష్కృతి సేయ నాపదల్. 344

వ. అయ్యెడ. 345

ఆ. కాలనేమిఘోరకంఠీరవము నెక్కి, తార్క్ష్యశిరము శూలధారఁ బొడువ
నతనిపోటుముట్టు హరి గేల నంకించి, దానఁ జావఁ బొడిచె దానవునిని. 346

క. పదపడి మాలిసుమాలులు, బెదరించినఁ దలలు ద్రుంచెఁ బృథుచక్రహతిన్
గదఁ గొని గరుడుని ఱెక్కలు, సెదరించినమాల్యవంతుశిరమున్ ద్రెసెన్. 347

వ. ఇట్లు పరమపురుషుం డగుహరికరుణాపరత్వంబునం బ్రత్యుపలబ్ధమనస్కు లై వరుణవాయువాసవప్రముఖులు పూర్వంబున నెవ్వ రెవ్వరితోఁ గయ్యంబు సేయుదురు వారు వారలం దలపడి నొప్పించి రయ్యవసరంబున. 348

క. బాహుబలంబున నింద్రుఁడు, సాహసమున బలిని గెలువ సమకట్టి సము
త్సాహమున వజ్ర మెత్తిన, హాహానినదంబు సేసి రఖిలజనములున్. 349

వ. ఇట్లు సముద్యతభిదురహస్తుం డై యింద్రుండు దనపురోభాగంబునం బరాక్రమించు చున్నవిరోచననందను నుపలక్షించి యి ట్లనియె. 350

మ. జగతిన్ వైరి మొఱంగి గెల్చుట యిసీ శౌర్యంబె ధైర్యంబె తా
మగవాఁ డయ్యును దన్నుఁ దా నెఱిఁగి సామర్థ్యంబునుం గల్గియున్
బగవానిం గని డాఁగెనేని మెయి సూపం జాలఁడేనిం గటా
నగరే బంధులు దిట్టరే బుధులు గన్యల్ గూర్తురే దానవా. 351

శా. మాయల్ సేయఁగ రాదు పో నగవులే మాతోడిపోరాటముల్
దాయా చిక్కితి వ్రక్కలించెద వడిన్ దంభోళిధారాహతిన్
నీయిష్టార్థము లెల్లఁ జూడుము వెసన్ నీవారలం గూడుకో
నీయాటోపము నిర్జరేంద్రుఁ డడఁచున్ నేఁ డాజిలో దుర్మతీ. 352

వ. అని యుపాలంభించిన విని విరోచననందనుం డి ట్లనియె. 353

శా. నీవే పోటరివే సురేంద్ర జగతిన్ నీ కేల గెల్పోటముల్
లేవే యెవ్వరిపాలఁ బోయినవి మే లీడుల్ విరించాదులుం

ద్రోవం జాలుదు రెవ్విధానమున సం‡తోషింప శోకింప నా
దైవం బేమి కరస్థలామలకమే ‡ దర్పోక్తులుం బాడియే. 354

ఆ. జయము లపజయములు ‡ సంపద లాపద, లనిలచలితదీపి‡కాంచలములు
చంద్రకళలు మేఘ‡చయములు దరఁగలు, మెఱుఁగు లమరవర్య ‡ మిట్టిపడకు.

వ. అని యిట్లాక్షేపించి. 356

క. వీరుఁడు దానవనాథుఁడు, నారసముల నింద్రు మేన ‡ నాటించి మహా
ఘోరాయుధకల్పము లగు, శూరాలాపములు సెవులఁ ‡ జొనిపెన్ మఱియున్.

వ. ఇట్లు తథ్యవాది యైనబలిచే నిరాకృతుం డై. 358

క. శత్రువునాక్షేపంబునఁ, దోత్త్రాహతగజముభంగిఁ ‡ ద్రుళ్లుచు బలి నా
వృత్రారి వీచి వైచిన, గోత్రాకృతి యతఁడు నేలఁ ‡ గూలె నరేంద్రా. 359

వ. అప్పుడు. 360

క. చెలికానిపాటు గనుఁగొని, బలిసఖుఁ డగుజంభుఁ డతుల‡గాహోశక్తిం
జెలితనము సాల నెఱపుచు, నిలు నిలు మని వీఁకఁ దాఁకె ‡ నిర్జరనాథున్. 361

క. పంచాననవాహనుఁ డై, చంచద్గద జంభుఁ డెత్తి ‡ శైలారిని దాఁ
కించి సురేభంబును నో, ప్పించి విజృంభించి యార్చి ‡ పేర్చెం గడిమిన్. 362

క. వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గదలింప లేక ‡ దుస్సహపీడన్
మోఁకరిలఁ బడియె నేలను, సోఁకోర్వక దిగ్గజంబు ‡ సుడిసుడిగొంచున్. 363

వ. అయ్యెడ. 364

క. సారథి వేయుహయంబుల, తేరాయితపఱిచి తేర ‡ దేవేంద్రుఁడు దా
నారోహించెను దైత్యుఁడు,దారత మాతలిని శూల‡ధారం బొడిచెన్. 365

ఆ. శూలనిహతి నొంది ‡ స్రుక్కక యార్చిన, సూతు వెఱకు మంచు ‡ సురవిభుండు
వానిశిరముఁ దునిమె ‡ వజ్రఘాతంబున, దైత్యసేన లెల్లఁ ‡ దల్లడిల్ల. 366

చ. చని సురనాథుచేఁ గలన ‡ జంభుఁడు సచ్చుట నారదుండు సె
ప్పిన విని వానిభ్రాతలు గ‡భీరబలాధికుఁ డాబలుండు పా
కనముచు లాపురందరునిఁ ‡ గాంచి ఖరోక్తులఁ దూల నాడుచున్
ఘనజలధారలన్ నగముఁ ‡ గప్పినచాడ్పునఁ గప్పి రమ్ములన్. 367

సీ. విబుధలోకేంద్రుని ‡ వేయుగుఱ్ఱంబుల, నన్నికోలల బలుఁ ‡ డదర నేసె
నిన్నూట మాతలి ‡ నిన్నూట రథమును, నారీతి నింద్రుప్ర‡త్యంగకమును
వేధించెఁ బాకుండు ‡ వింట వాఁడస్త్రంబు, లేయుట దొడుగుట ‡ యెఱుఁగరాదు
కనకపుంఖంబుల‡కాండంబు లొక పది, నేనింట నముచియు ‡ నేసి యార్చె

ఆ. బలిమి నిట్లు ముగురు ‡ పగవాని రథసూత, సహితు ముంచి రస్త్ర‡జాలములను
వనజలోకసఖుని ‡ వానకాలంబున, మొగిలుగములు ముసుఁగ ‡ ముంచునట్లు.

వ. అయ్యవసరంబున. 369

మ. అమరారాతులబాణజాలములపా § లై పోయితే చెల్లరే
యమరాధీశ్వర యంచు ఖిన్నతరు లై § యంభోధిలోఁ జంచల
త్వమునం గ్రుంకువణిగ్జనంబుల క్రియన్ § దైత్యాధిపవ్యూహమ
ధ్యమునం జిక్కిరి వేల్పు లందఱు విప § ద్ధ్వానంబులం జేయుచున్. 370

వ. అంత. 371

శా. ఓహో దేవతలార కు య్యిడకుఁ డే § నున్నాఁడ నం[1]చంబుభృ
ద్వాహుం డాశరబద్ధపంజరము సం § తం జించి తేజంబునన్
వాహోపేతరథంబుతోడ వెలికిన్ § వచ్చెన్ నిశాంతోల్లస
న్మాహాత్మ్యంబునఁ దూర్పునం బొడుచునా § మార్తాండుచందంబునన్. 372

వ. ఇట్లు వెలువడి. 373

చ. విఱిగినసేనఁ గాంచి సుర § వీరుఁ డోహో యని బిట్టు చీరి క్ర
మ్మఱఁ బురికొల్పి పాకబల § మస్తకముల్ నిశితాస్త్రధారలన్
నెఱసినతీక్ష్ణవజ్రమున § నేలకు వ్రాల్చెను వానిచుట్టముల్
వెఱచిరితిచ్చమూపతులు § విహ్వలు లై చెడి పాఱి రార్తితోన్. 374

వ. అప్పుడు నముచి నిలువంబడి. 375

మ. తనచుట్టంబులఁ జంపె వీఁ డనుచు నుద్య § త్క్రోధశోకాత్ముఁ డై
కనకాంతంబును నశ్మసారమయమున్ § ఘంటాసమేతంబు నై
జనదృగ్దుస్సహ మైనశూలము నొగిన్ § సారించి వైచెన్ సురేం
ద్రునిపై దీఁ హతుండ వౌ దని మృగేం § ద్రుం బోలి గర్జించుచున్. 376

శా. ఆకాశంబున వచ్చుశూలమును జం § భారాతి ఖండించి నా
నాకాండంబుల వానికంఠము దెగ § న్దంభోళియున్ వైచె న
స్తోకేంద్రాయుధమున్ సురారిగళముం § ద్రుంపంగ లే దయ్యె వాఁ
డాకంపింపక నిల్చె దేవవిభుఁ డ § త్యాశ్చర్యముం బొందఁగన్. 377

వ. ఇట్లు నిలిచి యున్ననముచిం గనుంగొని వజ్రంబు ప్రతిహతం బగుటకు శంకించి బలభేది దనమనంబున. 378

సీ. కొండలఱెక్కలు § ఖండించి వైచుచో, వజ్ర మెన్నఁడు నింత § వాఁడి సెడదు
వృత్రాసురాదుల § విదళించుచో నిది, దిరుగ దెన్నఁడు పనిఁ § దీర్చి కాని
యింద్రుండఁ గానొకో § యేను దంభోళియుఁ, గాదొకో యిది ప్రయో § గంబు సెడెనొ
దనుజాధముఁడు మొన § తాఁకుఁ దప్పించెనో, భిదురంబు నేఁ డేల § బెండుపడియె

ఆ. ననుచు వజ్రి వగవ § నార్ద్రశుష్కంబులఁ, జావ కుండఁ దపము § సలిపె నీతఁ
డితర మెద్ది యైన § నింద్ర ప్రయోగింపు, వైళ మనుచు దివ్య § వాణి వలికె. 379

వ. ఇట్లాదేశించినదివ్యవాణిపలుకు లాకర్ణించి (పురందరుండు) 380

---

1 చుం బృహద్బాహుం.

ఆ. ఆత్మబుద్ధిఁ దలఁచి ~ యార్ద్రంబు శుష్కంబు, గానిసాధనంబు ~ ఫేన మనుచు
నది యమర్చి దాన ~ నమరులు మెచ్చంగ, నముచిశిరముఁ ద్రుంచె ~ నాకవిభుఁడు.

వ. అయ్యవసరంబున. 382

సీ. పురుహూతు నగ్గించి ~ పుష్పాంజలులు సేసి, మునులు దీవించిరి ~ ముదముతోడ
గంధర్వముఖ్యులు ~ ఘనుఁడు విశ్వావసుఁ, డును బరావసుఁడు నిం ~ పెనయఁ బాడి
రమరాంగనాజను ~ లాడిరి దేవతా, దుందుభులును మ్రోసె ~ దురములోన
వాయ్వగ్నిసమవర్తి ~ వరుణాదులులును బ్రతి, ద్వంద్వుల గెల్చి రు ~ గ్రదండవృత్తి

తే. నల్పమృగముల సింహంబు ~ లట్ల తోలి, రమరవర్యులు దనుజుల ~ నదఁటు వాయ
నజుఁడు పుత్తేర నారదుఁ ~ డరుగుదెంచె, దైత్యహరణంబు వారింప ~ ధరణినాథ.

వ. వచ్చి సురలకు నారదుం డిట్లనియె. 384

శా. సిద్ధించెన్ సురలార మీ కమృతమున్ ~ శ్రీనాథసంప్రాప్తులై
వృద్ధిం బొందితి రెల్లవారలును వి ~ ద్వేషుల్ మృతిం బొంది రీ
యుద్ధం బేటికి నింకఁ జాలుఁ బని లే ~ దోహో పురే యంచు నం
బద్ధాలాపము లాడి మాన్చె సురలం ~ బాండవ్యవంశాగ్రణీ. 385

వ. ఇట్లు నారదవచననియుక్తులై రాక్షసులతోడిసంగ్రామంబు సాలించి సకలదేవముఖ్యులును ద్రివిష్టపంబునకుం జనిరి హతశేషులైన దైత్యదానవులు విషణ్ణుండైనబలిం దోడ్కొని పశ్చిమశిఖరిశిఖరంబుఁ జేరిరి విధ్వంసమానకంధరులై వినష్టదేహు లగుయామినీచరుల నెల్లను శుక్రుండు మృతసంజీవని యైనతనవిద్యపెంపునం జేసి బ్రదికించె బలియును భార్గవానుగ్రహంబున విగతశరీరవేదనుండై పరాజితుం డయ్యును లోకకాలవిచక్షణుం డగుటం జేసి దుఃఖపడక యుండె నన్ని చెప్పి రాజునకు శుకుం డిట్లనియె. 386

సీ. కైలాసగిరిమీఁద ~ ఖండేందుభూషణుం, డొకనాడు గొలువున ~ నున్న వేళ
నంగనయై విష్ణుఁ ~ డసురుల వంచించి, సురలకు నమృతంబు ~ సూఱలిడుట
విని దేవియును దాను ~ వృషభేంద్రగమనుఁడై. కడువేడ్క భూతసం ~ ఘములు గొలువ
మధుసూదనుం డున్న ~ మందిరంబున కేఁగి, పురుషోత్తమునిచేతఁ ~ బూజ వడసి

తే. తానుగూర్చుండిపూజించె ~ దనుజవైరిఁ, గుశలమే మీకు మాకును ~ గుశలమనుచు
మధురభాషలహరిమీఁద ~ మైత్రి నెఱపి, హరుఁడు పద్మాక్షుఁ జూచి యి ~ ట్లనియెఁ బ్రీతి.

సీ. దేవ జగన్మయ ~ దేవేశ జగదీశ, కాలజగద్వ్యాప ~ కస్వరూప
యఖిలభావములకు ~ నాత్మయు హేతువు, నైనయీశ్వరుఁడ వా ~ ద్యంతములకు
మధ్యంబు బహియును ~ మఱి లోపలయు లేక, పూర్ణమై యమృతమై ~ భూరిసత్య
మానందచిన్మాత్ర ~ మవికార మాద్య మ, నన్య మశోకంబు ~ నగుణ మఖిల

తే. సంభవస్థితిలయమూల ~ దంభకంబు, నైనబ్రహ్మంబు నీవ నీ ~ యంఘ్రియుగము
నుభయసంగవిసృష్టులై ~ యున్న మునులు, గోరి కైవల్యకాములై ~ కొల్తు రెపుడు.

సీ. భావించి కొందఱు బ్రహ్మంబు నీ వని, తలపోసి కొందఱు ధర్మ మనియుఁ
జర్చించి కొందఱు సదసదీశ్వరుఁ డని, సరవిఁ గొందఱు శక్తిసహితుఁ డనియుఁ
జింతించి కొందఱు చిరతరుం డవ్యయుఁ, డాత్మతంత్రుఁడు పరుం డధికుఁ డనియుఁ
దొడరి యూహింతురు తుది నద్వయద్వయ, సదసద్విశిష్టసంశ్రయుఁడ వీవ
తే. తలఁప నొక్కింతవస్తుభేదంబు గలదె, కంకణాదులుఁ బసిఁడి యొక్కటియ కాదె
కడలు పెక్కైన వార్ధి యొక్కటియ కాదె, భేద మంచును నినువికల్పింపవలను.
సీ. యద్విలాసము మరీచ్యాదు లెఱుంగరు, నెన్నఁడుఁ జెడకుండు నేను నెఱుఁగ
యన్నాయ నంధులై యమరాసురాదులు, వనరెద రఁట యున్నవార లెంత
యేరూపమునఁ బొంద కేపారుదువు నీవు, రూపివై సకలంబు రూపు సేయ
రక్షింపఁ జెఱుపఁ గారణ మైన సచరాచ, రాఖ్యమై విలసిల్లు దంబరమున
తే. ననిలుఁ డేరీతి విహరించు నట్ల నీవు, గలసి వర్తింతు సర్వాత్మకత్వ మొప్ప
జగములకు నెల్ల బంధమోక్షములు నీవ, నీవ సర్వంబు దలపోయ నీరజాక్ష.
మ. ఘనతన్ నీమగపోఁడుముల్ పలుమఱుం గన్నారమున్ వేమఱున్
నిను విన్నారముఁ జూడ మెన్నఁడును మున్ నీయాఁడుఁజందంబు మో
హిని వై దైత్యులఁ గన్నుఁబ్రామి యమృతం బింద్రాదిదేవాళి కి
చ్చిన నీరూపముఁ జూపుమా కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్. 391
క. మగవాఁడ వయ్యు జగములఁ, దగులం జిక్కులను బెట్టుదంటవు నీవున్
మగువతనంబున జగములఁ, దగులము బొందింప [1]నెంతదడవు ముకుందా. 392
వ. అని పలుకుచున్న శూలపాణిచే నపేక్షితుం డై విష్ణుండు భావగంభీరం బగు నవ్వు నివ్వటిల్ల నవ్వామదేవున కిట్లనియె. 393
శా. శ్రీకంఠా నిను నీవ నేమఱకుమీ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము నీ కై వై చూచెదేఁ జూపెదం
గైకో నర్హము లంద్రు కాముకులు సంకల్పప్రభూతాత్ములే. 394

హరి దన మోహినీరూపంబుచే నీశ్వరుని మోహింపఁ జేయుట.

వ. అని పలికి కమలలోచనుం డంతర్హితుం డయ్యె; నయ్యుమాసహితుం డయిన భవుండు విష్ణుం డెట్టు వోయెనో యెందుఁ జొచ్చెనో యని దశదిశలం గలయ నవలోకించుచుండం దనపురోభాగంబున. 395
సీ. ఒకయెలదోఁటలో నొకవీథి నొకనీడఁ, గుచకుంభములమీఁది కొంగు దలఁగఁ
గబరికాబంధంబు గంపింప నుదుటిపైఁ, జికురజాలంబులు సిక్కువడఁగ
ననుమానమైన మధ్య మల్లాడఁ జెక్కులఁ, గర్ణకుండలకాంతి గంతులిడఁగ
నారోహభరమున నడుగులు దడఁబడ, దృగ్దీప్తిసంఘంబు దిశలఁ గప్ప

1 గొంతదడవె.

తే. వామకరమున జాఱినవలువఁ బట్టి, కనకనూపురయుగళంబు ఘల్లనంగఁ
గంకణంబులఝుణఝుణత్కార మెసఁగ, బంతిచే నాడుప్రాయంపుఁబడఁతిఁ గనియె.

వ. కని మున్ను మగువ మరగి సగ మయినమగవాఁ డమ్మగువవయోరూపగుణ విలాసంబులు దన్ను నూరింపం గనుఱెప్ప వ్రేయక తప్పక చూచి మెత్తనయిన చిత్తంబున. 397

శా. ఈకాంతాజనరత్న మెవ్వరిదొకో యీయీడురూపంబు ము
న్నేకల్పంబులయందుఁ గాన మజుఁ డీయింతిన్ సృజింపంగఁ దా
లేకుం డెల్ల నిజంబు వల్లభత నీలీలావతిం జేరఁగా
నేకాంతుండు గలండొ క్రీడలకు నాకీయింతి సిద్ధించునే. 398

వ. అని మఱియుం జెఱకువిలుతుని మెఱవడిఁ దరపిన నెఱబిరుదు వెలుంగుపడం దెఱవ దుఱిమికొనినతుఱుముబిగిముడి వదలి కదలి భుజముల మొదల నొడల నదిరి చెదరి నకురులు నొసలిమృగమదతిలకంపుటసలు మసలిన విసవిస నగుమొగము మెఱుంగులు దశదిశలం బసలుకొలుపఁ జఱునగవు మెఱయ నునుఁజెమటం దడంబడి పులకరములు కులకరములు గొన హృదయానందకందం బగుకందుకంబు గరారవిందంబునం దమర్చి యక్కునం జేర్చి చెక్కున హత్తించి చుబుకంబు మోపి చూచుకంబులం గదియించి నఖంబుల మీటుచు మెల్ల(మెల్లన)గెల్లాడుకర(కమలంబుల) కనకమణివలయంబులు ఝణఝణ యనం గుచకలశంబు లొండొంటి నొరయ నెడమఁ గుడిం దడంబడఁ గ్రమమ్మున నెగురఁ జిమ్ముచు నెగురఁజిమ్మి తనకుఁ దానె కొన్నిచిన్నిపన్నిదంబులు సేసికొని బడుగునడుము బెడఁకి వడవడ వడంక నఱితిసరులు గలయంబడఁ దిరుగుచు (తిరుగునెడఁ) బెనఁకువలుగొనఁ జెవులతొడవులరుచులు [1]గటముల నటనములు సలుపఁ బవిరితిరిగియొడియుచు నొడిసి కెలంకులకున్ జడియుచు జడిసి జడనుపడక వలువ నెలవెడలి దిగంబడం [2]గటిస్థలంబునఁ గాంచీకనకమణికింకిణులు మొరయఁ జరణకటకమ్ములు గల్లుగల్లుమనం గరకంకణమణిగణములు మెఱయ వెనుకొని యుఱికి పట్టుచుఁ బట్టి పుడమిం బడనైచి పాటువెంటన మింటికెగసి కెంటక కరంబునం గరంబు దిరం బయి పలుమఱు మఱల నడుచుచు నెగయునెడం దిగంబడుతఱిని నీలంపుమెఱుంగునిగ్గుసోగపగ్గంబుల వలలు వైచి రాఁ దిగిచినపగిది వెనుకొనంగ విలోకనజాలంబులు నిగిడించుచు మగిడించుచుఁ గరలాఘవంబున నొకటి పది నూఱు వేయి సేసి నేర్పు వాటించుచు నరుణచరణకమలరుచుల నుదయశిఖరిశిఖరతరణికరణి సేయుచు ముఖచంద్రచంద్రికలం జంద్రమండలంబులు గావించుచు నెడనెడ నురోజదుర్గనిర్గతచేలాంచలంబుఁ జక్కనొత్తుచుఁ గపోలపాలికాలోలఘర్మజలబిందుబృందంబుల నఖాంకురంబుల నోసరించుచు నధరబింబఫలభ్రాంతిసమాగతరాజకీరంబులం జోపుచు

1 గటీరముల. 2 గటిగుణంబు మొరయ.

ముఖసరోజపరిమళాసక్తమత్తమధుకరంబుల నివారించుచు మందగమనాభ్యాస కుతూహలాయత్తమరాళయుగళంబులకుం దలంగుచు విలాసవీక్షణానందితమయూరమిథునంబులకు నెడగలుగుచుఁ బొదరిండ్ల[1]యిఱ్ఱుములకుం బోక మలంగుచు సరసకిసలయాస్వాదకాముకకలకంఠదంపతులకు దూరించుచుఁ దీఁగయుయ్యెలల నూఁగుచు మాధవీమండపంబు లెక్కుచుఁ గుసుమరేణుపటలంబులగుబ్బళ్లు ప్రాఁకుచు మకరందస్యందబిందుబృందంబు నుత్తరించుచుఁ గృతకశైలంబులఁ బొడసూపుచు నున్నతకేతకీస్తంభంబుల నొరగుచుఁ బుష్పశిఖచితవాతాయనంబులందొంగిచూచుచుఁ గమలకాండపాలికల నాలంబించుచుఁ జంపకదేహళీమధ్యంబుల నిలువంబడుచుఁ గదళికాపత్రికవాటంబుల నుద్ఘాటించుచుఁ బరాగనిర్మితసాలభంజికానివహంబుల నాదరించుచు మణికుట్టిమంబుల మురియుచుఁ జంద్రకాంతవేదికల నొలయుచు రత్నపంజరశారికానివహంబులకుం జదువులు సెప్పుచుఁ గోరినక్రియం జూచుచుఁ జూచినక్రియ మెచ్చుచు మెచ్చినక్రియ వెఱఁగుపడుచు వెఱఁగుపడినక్రియ మఱచుచు మఱవక యేకాంతం బగునవ్వనాంతంబున ననంతవిభ్రమంబుల జగన్మోహిని యై విహరించుచు నున్నసమయంబున.

ఆ. వాలుఁగంటివాఁడి । వాలారుఁజూపుల, శూలి ధైర్య మెల్లఁ । గొలుపోయి
తఱలి మెఱుక లేక । మఱచె గుణంబుల, నాలి మఱచె నిజగ । ణాలి మఱచె.

వ. అప్పుడు. 401

ఆ. ఎగురవైచి పట్టు । నెడలేమిఁ జే దప్పి, ప్రాలుబంతిఁ గొనఁగ । వచ్చునెడను
బడఁతివలువ వీడి । పడియె మారుతహతిఁ, జంద్రధరునిమనము । సంచలింప.

మ. రుచిరాపాంగిని వస్త్రబంధనపరన్ । రోమాంచవిభ్రాజితం
గుచభారానమితం గరద్వయపుటీ । గూఢీకృతాంగిం జల
త్కచబంధం గని మన్మథాతురత నా । కంపించి శంభుండు ల
జ్జ చలింపం దనకాంత సూడఁ గదిసెం । జంద్రాస్యకేలిమ్మికిన్. 403

ఆ. పదము సేర వచ్చు । ఫాలాక్షుఁ బొడగని, చీర వీడి పడిన । సిగ్గుతోడ
మగువ నగుచుఁ దరుల । మాటున డాఁగెను, వేల్పుఱేఁడు నబల । వెంటఁ బడియె.

మ. ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు రమింపన్ వచ్చులీలన్ శివుం
డబలా పోకుము పోకవే యనుచు డా । యం బాటి కెంగేలఁ ద
త్కబరీబంధము వట్టి సంభ్రమముతోఁ । గౌఁగిళ్ల నోలార్చె సం
త[2]బహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం । దద్బాహునిర్ముక్త యై. 405

సీ. వీడి వెన్నున నాడు । వేణీభరంబుతో, జఘనభారాగత । శ్రాంతితోడ
మాయావధూటియై । మరలిచూచుచుఁ బాఱు, విష్ణు నద్భుతకర్ము । వెంటఁ దగిలి
యీశాను మరల జ । యించె మరుం డనఁ, గరిణి వెన్నుకరి । కరణిఁ దాల్చి

---

1 యిఱుములకుం. 2 బహుప్రక్రియ.

కొండలు నేఱులుఁ గొలఁకులు వనములు, హరుఁడు దాఁటి చనంగ నమ్మహాత్ము

తే. నిర్మలామోఘరేతంబు నేలమీఁదఁ, బడినచో నెల్ల వెండియుఁ బసిఁడియయ్యె
ధరణీవీర్యంబువడఁ దన్నుఁ దానెఱింగి, దేవమాయాజడత్వంబు దెలిసె హరుఁడు.

క. జగదాత్మకుఁ డగుశంభుఁడు, మగిడెను హరి నెఱిఁగి తనదు మాహాత్మ్యమునన్
విగతత్రపుఁడై నిలిచెను, మగువతనం బుడిగి హరియు మగవాఁడయ్యెన్. 407

ఆ. కాముగెలువవచ్చుఁ గాలారి గావచ్చు, మృత్యుజయముగలిగి మెఱయవచ్చు
నాఁడువారిచూపు లంపఱ గెలువంగ, వశము గాదు త్రిపురవైరి కైన. 408

వ. ఇట్లు పురుషాకారంబు వహించినహరి హరున కిట్లనియె. 409

సీ. నిఖిలదేవోత్తమ నీవొక్కరుఁడు దక్క, నెవ్వఁడు నామాయ నెఱుఁగ నేర్చు
మానిని యైననామాయచే మునుఁగక, ధృతిమోహితుండ వై తెలిసి తీవు
కాలరూపంబునఁ గాలంబుతోడ నా, యందును నీమాయ యధివసించు
నీమాయ నన్ను జయింప నేరదు నిజ, మకృతాత్ములకు నెల్ల ననుపలభ్య

తే. నేఁడు నీనిష్ఠపెంపున నిలిచి తనుచు, సత్కరించిన సఖ్యంబు సాల నెఱపి
దక్షసుతయునుగణములుఁ దన్నుఁ గొలువ, భవుఁడువిచ్చేసెఁ దగనిజభవనమునకు.

శా. పారావారము దచ్చుచో గిరిసముద్ధారార్థమై కచ్ఛపా
కారుండై నరమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగక జనుల్ సంశ్రేయముం బొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్ భూవరా. 411

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని
ర్మలరేఖల్ విలసిల్లుశ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతున్ మ్రొక్కుదు నాత్మలోన దురితధ్వాంతప్రదీపంబుగన్. 412

వ. అని చెప్పి శుకుం డి ట్లనియె. 413

తే. నరవరాధీశ యిప్పుడు నడచుచున్న, వాఁడు సప్తమనువు వైవస్వతుండు
శ్రాద్ధదేవుండు నందురు జనులు వానిఁ, బదురు నందను లతనికిఁ బ్రకటబలులు.

వ. వార లిక్ష్వాకుండును నభగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యంతుండును నాభాగుండును దిష్టుండును గరూశకుండును బృషధ్రుండును వసుమంతుండు ను నను వారు పదుగురురాజులు పురందరుం డనువాఁ డింద్రుం డాదిత్యమరుదశ్వి వసురుద్రసంజ్ఞులు గలవారు దేవతలు గౌతమకశ్యపాత్రివిశ్వామిత్రజమదగ్నిభరద్వాజవసిష్ఠు లనువారు సప్తర్షు లయి యున్నవా రందుఁ గశ్యపున కదితిగర్భంబున విష్ణుండు వామనరూపుం డై జనియించి యింద్రావరజుం డయ్యె నిప్పు డేడుమన్వంతరంబులు సెప్పంబడియె రాఁ గలమన్వంతరంబులును (శ్రీహరిపరాక్రమంబునుం) జెప్పంబడియెడు(దత్తావధానుండ వై) విను మని శుకుం డిట్లనియె.

సీ. జననాథ సంజ్ఞయుఁ ✽ ఛాయయు ననువారు, గల రర్కునకు విశ్వ ✽ కర్మతనయ
లిరువురు వల్లభ ✽ లిట మున్న చెప్పితిఁ, బరఁగుఁ దృతీయయు ✽ బడబ యనఁగ
సంజ్ఞకు యముఁడును ✽ శ్రాద్ధదేవుండును, యమునయుఁ బుట్టిరి ✽ హర్ష మెసఁగ
ఛాయకుఁ దపతియు ✽ సావర్ణియును శనై,శ్చరుఁడును గలిగిరి ✽ సంవరణుఁడు
తే. దపతి నాలిఁగఁ గైకొనెఁ ✽ దా వరించి, యశ్వియుగళంబు బడబకు ✽ నవతరించె
వచ్చునష్టమవసువు సావర్ణి వాఁడు, తపము సేయుచు నున్నాఁడు ✽ ధరణినాథ.
క. ఒకపరి సూచిన నుండియు, నొకపరి సూడంగ లేక ✽ యుండుసిరులకై
యొకనొకని చేటువేళకు, నొకఁ డొక్కఁడు మనువుఁ గాచి ✽ యుండు నరేంద్రా.
వ. సూర్యసావర్ణిమన్వంతరంబున నతనితనయులు నిర్మోహవిరజస్కాద్యులు రాజులును సుతపోవిరజోమృతప్రభు లనువారు దేవతలును గాఁ గలరు గాలవుండును దీప్తిమంతుండును పరశురాముండును ద్రోణపుత్త్రుం డగునశ్వత్థామయుఁ గృపుండును మజ్జనకుం డగు బాదరాయణుండును ఋశ్యశృంగుండును సప్తఋషు లయ్యెదరు వార లిప్పుడు గమతమయోగబలంబుల నిజాశ్రమమండలంబులం జరియించు చున్నవారు విరోచననందనుం డగు బలి యిందుఁ డయ్యెడు నని చెప్పి శుకుం డిట్లనియె. 418
సీ. బలి మున్న నాకంబు ✽ బలిమిమైఁ జేకొన్న, వామనుం డై హరి ✽ వచ్చి వేఁడఁ
బాదత్రయం బిచ్చి ✽ భగవన్నిబద్ధుఁ డై, సురమందిరముకంటె ✽ సుభగ మైన
సుతలలోకంబున ✽ సుస్థితి నున్నాఁడు, [1]వెత లేక యటమీఁద ✽ వేదగుహికి
నానరస్వతికిఁ దా ✽ నట సార్వభౌముండు, నాఁ బ్రభు వయి హరి ✽ నాకవిభునిఁ
ఆ. బదవిహీనుఁ జేసి ✽ బలిఁ దెచ్చి నిలుపును, బలియు నిర్జరేంద్ర ✽ పదము నొందు
నింద్రపదము హరికి ✽ నిచ్చినకతమున, దానఫలము సెడదు ✽ ధరణినాథ. 419
వ. అట మీఁదటి కాలంబున వరుణనందనుం డగుదక్షసావర్ణి తొమ్మిదవమను వయ్యెడు నతనికొడుకులు ధృతకేతుదీప్తకేతుప్రముఖులు రాజులును బరమరీచిగర్గాదులు నిర్జరులును నద్భుతుం డనువాఁ డింద్రుండును ద్యుతిమత్ప్రభృతు లగు వారలు ఋషులును నయ్యెద రందు. 420
ఆ. దనుజహరణుఁ డంబు ✽ ధారకాయుష్మంతు, నకు జనించి రక్ష ✽ ణంబు సేయ
మూఁడులోకములను ✽ మోదంబుతో నేలు, నద్భుతాఖ్యునొప్పు ✽ నమరవిభుఁడు.
వ. మఱియు నుపశ్లోకసుతుం డగు బ్రహ్మసావర్ణి దశమమను వయ్యెడిఁ దత్పుత్త్రులు భూరిషేణాదులు భూపతులును హవిష్మత్ప్రముఖులు మునులును శంభుం డనువాఁ డిందుండును విబుద్ధాద్యులు నిర్జరులును నయ్యెద రందు. 422
ఆ. విశ్వసృజునియింట ✽ విభుఁడు విషూచికి, సంభవించు నంశ ✽ సహితుఁ డగుచుఁ
జెలిమి శంభుతోడఁ ✽ జేయువిష్వక్సేనుఁ, డనఁగ జగముఁ గాచు ✽ నవనినాథ.

---

1 తెలుఁ గొప్పనటమీఁద దేవగుహికి.

వ. మఱియుం దదాగమిష్యత్కాలంబున ధర్మసావర్ణి పదునొకండవమను వయ్యెడి మనుతనూజులు సత్యధర్మాదులు పదుండ్రుధరణిపతులును విహంగమకామగమన నిర్వాణరుచు లనువారు సురలును వైధృతుం డనువాఁ డింద్రుండును నరుణాదులు ఋషులును నయ్యెద రందు. 424

ఆ. అంబుజాతనేత్రుఁ డార్యసూనుఁ డై, ధర్మసేతు వనఁగఁ దగ జనించి
వైభవాఢ్యుఁడగుచు వైధృతుఁ [1]డలరంగఁ, గరుణఁ ద్రిజగములను గావఁగలఁడు.

వ. మఱియుఁ దద్భవిష్యత్సమయంబున భద్రసావర్ణి పండ్రెండవమను వయ్యెడి నతనినందనులు దేవవదుపదేవదేవశ్రేష్ఠాదులు వసుధాధిపతులును ఋతుధాముం డనువాఁ డిందు్రిండును హరితాదులు వేల్పులును దపోమూర్తితపాగ్నీధ్రిగాదులు ఋషులును నయ్యెద రందు. 426

ఆ. జలజలోచనుండు సత్యతపసూనృ, తలకు సంభవించుఁ దనయుఁ డగుచు
ధరణిఁ గాచు నంచితస్వధామాఖ్యుఁ డై, మనువు సంతసింప మానవేంద్ర.

వ. మఱియుం దదేష్యత్కాలంబున నాత్మవంతుం డగుదేవసావర్ణి పదుమూఁడవ మను వయ్యెడి మనుకుమారకులు చిత్రసేనవిచిత్రాదులు జగతీనాయకులును సుకర్మసుత్రామసంజ్ఞలు గలవారు బృందారకులును దివస్పతి యనువాఁ డింద్రుండును నిర్మోహతత్త్వదర్శాద్యులు ఋషులును నయ్యెద రందు. 428

ఆ. ధరణి దేవహోత దయితకు బృహతికి, యోగవిభుఁడు నాఁగ నుద్భవించి
వనజనేత్రుఁ డాదివస్పతి కెంతయు, సౌఖ్య మాచరించు జగతినాథ. 429

వ. మఱియు నట వచ్చుకాలంబున నింద్రసావర్ణి పదునాలవమను వయ్యెడి మనునందనులు గంభీరవస్వాదులు రాజులును బవిత్రచాక్షుష లనువారు దేవగణంబులును శుచి యనువాఁ డింద్రుండును నగ్నిబాహుశుచిశుక్రమాగధాదులు ఋషులును నయ్యెద రందు. 430

తే. తనర సత్త్రాయణునకు వితానయందు, భవమునొందెడిహరిబృహద్భానుఁడనగఁ
విస్తరించుఁ గ్రియాతంతువిసరములును, నాకవాసులు ముద మంద నరవరేణ్య.

క. జగతీశ త్రికాలములను, బొగ డొందుమను ప్రకారములు సెప్పఁబడెం
దగఁ బదునలువురుమనువులుఁ, దెగ యుగములు వేయి నడవదివ మజునకగుఁ.

వ. అనినఁ బరీక్షిన్న రేంద్రుండు శుకయోగీంద్రున కి ట్లనియె. 433

ఆ. ఈపదంబు లందు నీమనుప్రముఖుల, నెవ్వ రనుచు వార లేమికతన
నధికవిభవు లైరి హరి యేల జనియించె, నెఱుఁగఁ బలుక

వ. అనినం బారాశర్యకుమారుం డి ట్లనియె.

సీ. మనువులుమునులును మనుసుతు లింద్రులు, నమరుఁ
యాజ్ఞాదు లందఱు హరిపౌరుషాకృతు, లామనువులు

1 తేలంగ.

జగముల నడపుచు రోగి నాల్గుయుగముల, కడపటఁ గాలసంగ్రస్త మైన
నిగమచయంబును నిజతపోబలముల, మరలఁ గాంతురు ఋషివరులు దొంటి
తే. పగిది ధర్మంబు నాలుగుపాదములును, గలిగి వర్తిల్లు మనువులు కమలనేత్రు
నాజ్ఞఁదిరుగుదు రేలుదురవనిపతులు, జగతి భాగించి తమతమసమయములను.

వ. మఱియుం బ్రాప్తు లయినవారల నింద్రపదంబులను (బహుప్రకారంబుల దేవ పదంబులను) హరి ప్రతిష్ఠించు చుండు వారలు విహితకర్మంబుల జగత్త్రయం బునుం బరిపాలింతురు లోకంబులు సువృష్టు లై యుండు. M. App. 437

సీ. యోగీశరూపుఁ డై యోగంబుఁ జూపుచు, మౌనిరూపమునఁ గర్మంబు దాల్చు
సర్గంబు సేయుఁ బ్రజాపతిరూపుఁ డై, యింద్రుఁ డై దైత్యుల నే పడంచు
జ్ఞానంబు నెఱిఁగించుఁ జతురసిద్ధాకృతిఁ, గాలరూపమునఁ బాకంబు సేయు
నానావిధాకారనామగుణంబులఁ, గర్మలోచనులకుఁ గలఁడు లేఁడు
ఆ. చనినరూపములను జనురూపముల నింకఁ, జనఁగ నున్నరూపచయము నతఁడు
వివిధుఁ డై యనేకవృత్తుల వెలిఁగించు, విష్ణుఁ డవ్యయుండు విమలచరిత.

—✤ వామనచరిత్రకథాప్రారంభము. ✤

వ. అనిన భూవరుం డి ట్లనియె. 439

మ. బలి నంభోరుహనేత్రుఁ డేమికొఱకై పాదత్రయిన్ వేఁడె ని
శ్చలుఁడున్ బూర్ణుఁడు లబ్ధకాముఁడు రమాసంపన్నుఁ [1]డై తాఁ బర
స్థలికిన్ దీనునిమాడ్కి నేల చనియెం ద ప్పేమియున్ లేక ని
ష్కలుషున్ బంధన మేల చేసెను వినం గౌతూహలం బయ్యెడిన్. 440

వ. అనిన మునినందనుం డి ట్లనియె. 441

సీ. పురుహూతుచే నొచ్చి పోయి భార్గవులచే, బలి యెట్టకేలకు బ్రదికి వారి
చిత్తంబు రాఁ గొల్చి శిష్యుఁ డై వర్తింప, వారు నాతనిభక్తివలన మెచ్చి
విశ్వజిద్యాగంబు విధితోడఁ జేయింప, భవ్యకాంచనపట్టబద్ధరథము
నర్కవాజులఁ బోలుహరులుఁ గంఠీరవ,ధ్వజము మహాదివ్యధనువుఁ బూర్ణ
తే. తూణయుగళంబుఁ గవచంబుఁ దొలుతహోమ, పావకుం డిచ్చె నమ్లానపద్మమాలఁ
[2]గలుషహరుఁ డగుతనతాతకరుణ నొసఁగె, సోమసంకాశశంఖంబుశుక్రుఁ డిచ్చె.

వ. ఇవ్విధంబున. 443

...యుఁ గృపాణియుఁ, దూణియు ధన్వియును స్రగ్వి తురగియు దేహ
...విమత, ప్రాణియు మణికనకవలయపాణియు నగుచున్. 444

...ం దనిపి తద్భద్రోక్తులం బొంది పె
...దేవతల నంతర్భక్తిఁ బూజించి ని
...రి నమ్రశిరుఁ డై రాజద్రథారూఢుఁ డై.

---

...మలజుం డిచ్చె నతనికిఁ గరుణతోడ.

వెలిఁగెన్ దానవభర్త శైలశిఖరోద్వేల్లద్దవాగ్నిప్రభన్. 445

క. దండితమృత్యుకృతాంతులు, ఖండితసురసిద్ధసాధ్యగంధర్వాదుల్
పిండితదిశు లమరాహిత, దండాధీశ్వరులు సములు దన్నుం గొలువన్. 446

క. చూపుల గగనము మ్రింగుచు, నేపున దివి భువియు నాతలీతల సేయన్
రూపించుచు దనుజేంద్రుఁడు, ప్రాపించెను దివిజనగరపథము నరేంద్రా. 447

వ. ఇట్లు బలవంతుం డగుబలి సురేంద్రుని సాధింప సమకట్టి దండగమనంబు సేసి నిడుదపయనంబులం జని చని. 448

మ. కనియెం బుణ్యజనాకమున్ విగతరోగస్వప్నపీడాన్నఖా
దనసంశోకముఁ బుష్పపల్లవఫలోద్దామద్రుమానీకమున్
స్వనితోద్ధూతపతాకముం బ్రవిచరద్దైవ్యమానికానీకమున్
ఘనగంగాసలిలైకమున్ మఘవయుక్తశ్రీకమున్ నాకమున్. 449

వ. కని రక్కసులఱేఁడు వెక్కసంబై చాల్పు గలవేల్పులనెలవులం దఱియం జొచ్చి చెచ్చెర ముందటికిం జనిచని ముందట నెడపడక మొనమోసి యిగురుచు చిగురు తలిరాకుజొంపంబు నన మొగుడుమొగ్గ యరవిరి నెఱవిరి గుత్తి పిందె పూఁప దోరగాయ పండు గెలకతండంబులవ్రేఁగు లాఁగ లేక మూఁగి వీఁగి వ్రేఁక లగు మాఁకులప్రోకలకుఁ జేట లగు పెంపోఁటలును దోఁటల గాటంబులై నివ్వటిల్లుమవ్వంపుఁ గ్రొవ్విరులకుఁ గవలు విచ్చక కసిమసలు గలిగి ముసరి కొసరి పూని పోని తేనియలాని విసరు గొని మసకు కవిసి క్రొవ్వి [1]రిమ్మగొని జుమ్ము జుమ్మనుచు జంజాటించు తేఁటిదాఁటులును దాఁటువడక నాటుకొని పూవిడుచుకూడి జోడువీడకక్రొమ్మావులకమ్మనికొమ్మ. నిమ్ములముసరి మిసిమి గలకిసలయమ్ములువొసంగ మెసంగి కిసరువడక కసరుపెడి బిట్టురట్టడితనంబు లలమి మింగి కరాళించుకో... లలమొత్తంబులును మొత్తంబులై చిత్తంబుల న... లగుత న... నొయ్యనఁ దియ్యనిపండ్లకుఁ గయ్యంబడి చయ... బులుఁగాఁ గొని వాసి కెక్కి పలుబాస గాఢ... లును గీరంబులకు సరి గడచి మింట నంట నెగసి ఒట్టు... నెట్టుకొని నెలవుల నాఁకలుచు నింపు గలరవమ్ములు గ... రవమ్ము[2]లలరం దొలంకులకొలంకుల కెలంకులఁ గడంక... దొమ్మిసేసి యెలదమ్మితూఁడుల వాఁడులగుచంచువుల... లికలఁకలం బడుచు నలబలంబులు సేయుకలహంస... నముల వికవిక నగుచుం బస గలిగి మిసమిస మెఱ... దిరమ్ములచందమ్ములు గ... నందమ్ము లగుకొలఁ... వడవడ వడంకుచు నల్లిబిల్లులు గొని సాఁగినతీఁ...

---

1 రిమ్మలుగొని. 2 లమరం దలఁకొని కొలంకుల,

ములు సెడి వలువిరులకమ్మవలపుల వేడ్కనం దూఁగలేక యీడిగిలంబడుగాడ్పు
లును గాడ్పులవలన నెగసి గగనమున విరిసి పలువన్నెలం జెన్నగుమేలుకట్టుఁబు
ట్టంబుల తెఱంగున దట్టంబు లగుచునకుసుమపరాగంబులును బరాగంబుల సరా
గంబు లగువాఁగు వ్రంతల చెంతలగుంపులుగొనిగఱికిజొంపంబులలంపులు దిని మం
పులుగొని పెల్లునెమ్మగ్లు వెట్టుచు నొదుఁగులపొదుగులు గదల వాడలవాడలజాడ
లం బరుగులిడుదూడల క్రీడల వేడుకలం గూడుకొని యిండ్లవాకిండ్లకుం జేరి పౌరు
లకోరికల కనుసారిక లగుచు నమృతంబు గురియుకామధేనువులును గామధేనువు
లకు నిలువనీడ లగుచు నడిగినజనమ్ములకు ధనమ్ములు ఘనమ్ముగఁ బుడుకుకల్ప
తరువులును గల్పతరువులపల్లవమంజరులఁ గుంజరులకు విఱిచి యిచ్చుచు మచ్చిక
లకలిమి నిచ్చమెచ్చుచుఁ గృతకగిరులచఱుల సిరులనడరుపడఁతులనడలకుగురువు
లగుచుమెఱయుమురువుల నొత్తరించుమత్తేభంబులును నిభంబుల సరస నొరసి
కొని వరుసఁ బరుసఁదనము వెడలి సుకరము లగుమకరతోరణస్తంభంబులు
ను దోరణస్తంభంబులచేరువ నిలిచి చెఱకువిలుతుం డొఱవెఱకిన బెడిదములగు
నవకంపుమెఱుఁగుంజిగురుటడిదముల తెఱంగున నిలుకడసంపదలు గలుగుశంపల
సొంపునం గరచరణాదిశాఖలు గలచంద్రరేఖలపోఁడిమిని వాహిని గలమోహినీ
విద్యల గ్రద్దనఁ జూపులకుం దీపు లొదవించుచు మర్మకర్మంబులవశంబు లరయు
యశంబులు గలిగి యసమానంబు లగువిమానంబు లెక్కి చచ్చివచ్చినసచ్చరితు
లకుం జెచ్చెర నెమరుచని తూకొని తోకొనిపోవురంభాదికుంభికుంభకుచలకల
కలంబులును గలహంసకారండవకోకసారసబృందసుందరసుందరియు నిందీవ
రారవిందనందదిందిందిరయు నభంగయు సభంగయు నగుగంగ నింగికిం బొంగె
నో యని మిగ దిగులుపడఁ బొగడ్తల కెక్కినయగడ్తలును నగడ్తల మిన్నేటి
నూటిచల్లులాటల ...టువలు గొనుచు నేచిన
నారవనితాసుస్రాజితవిరాజితదేహాళిపాటవంబు లగు
...టవేదికాఘటితమణిగణకిరణోదారంబు లగునిం
...ను గంభీరవిమలకమలరాగపాలికావాలికావారంబులగు
ద్వారదేశంబులచావిళ్లం గావ ళ్లుండి పొడ్డు వోక
...వ్యాంబులు నెయ్యాంబులం జెప్పికొను చున్నయస్త్ర
నయినమహాద్వారపాలకవీరులును వీరరసజలధి
శుద్ధస్ఫటికబద్ధమహోత్తాలసోపానసుకుమారంబులును
ప్రంబులు నగువప్రంబులును వపోపరివజ్రకుడ్య
...మకరకిరణముఖరంబు లగుసాలశిఖరంబులును
...బులును ధారకారమణిశిలాకతోరంబు లగు

ఆ. ఏదురాత్మకునకు నెవ్వఁడు దోడయ్యె, నింక వీని గెల్వ నేది త్రోవ
యేమి సేయువార మెక్కుడుమగఁటిమి, నెదురు మోహరింప నెవ్వఁడోపు.

క. మ్రింగెడు నాకాశంబును, బొంగెడు నమరాద్రికంటెఁ బొడవై వీఁడున్
మ్రింగెడుఁ గాలాంతకుక్రియ, భంగించును మరలఁబడ్డఁ బంకజగర్భున్. 456

క. ఈ రాదు రాజ్య మెల్లను, బో రాదు రణంబు సేయఁ బోయితి మేనిన్
రా రాదు దనుజుచేతను, జారా దిట మీఁద నేమి జాడ మహాత్మా. 457

వ. అనినసురరాజునకు సురాచార్యుం డిట్లనియె. 458

సీ. వినవయ్య దేవేంద్ర వీనికి సంపద, బ్రహ్మవాదులు భృగుప్రవరు లర్థి
నిచ్చిరి రాక్షసు నెదుర సంచారింప, హరి యీశ్వరుఁడు దక్క నన్యజనులు
నీవును నీసముల్ నీకంటె ఘనులును, జాలరు రాజ్యంబు సాలు నీకు
విడిచి పోవుట నీతి విబుధనివాసంబు, విమతులు నలఁగెడు వేళ సూచి

తే. మరలి మఱునాఁడు వచ్చుట మామతంబు, విప్రబలమున వీనికి వృద్ధి వచ్చె
వారిఁగైకొన కిటమీఁద వాఁడిసెడును, దలఁగుమందాఁక రిపుపేరు దడవవలదు.

క. పరు గెలువ వలయు నొండెను, సరిఁ బోరఁగ వలయు నొండెఁ జావలె నొండెన్
సరిగెలుపు మృతియు దొరకమి, సరసంబుగ మున్న తొలఁగి చనవలె నొండెన్.

వ. అనినఁ గార్యకాలప్రదర్శి యగుబృహస్పతివచనంబులు విని కామరూపులై దివి
జులు త్రివిష్టపంబు విడిచి తమతమపొందుపట్లకుం జనిరి బలియునుం బ్రతిభట
వివర్జిత యగుదేవధాని [1]నధిష్ఠించి జగత్త్రయంబునుం దనవశంబు సేసికొని విశ్వ
విజయుం డై పెద్దకాలంబు రాజ్యంబు సేయు చుండె శిష్యవత్సలు లగుభృగ్వా
దు లతనిచేత శతాశ్వమేధంబులు సేయించిరి తత్కాలంబున. 461

శా. అర్థుల్ వేఁడరు దాతలుం జెడరు సత్కార్యారంభముల్ పండుఁ బ్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చుఁ బూ
ర్ణార్థుల్ విప్రులు వర్షముల్ గురియుఁ గాలార్హంబులై ధాత్రికిన్
సార్థం బయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశురాజ్యంబునన్. 462

వ. అంత. 463

సీ. తనతనూజులప్రోలు దనుజులు గొనుటయు, వేల్పులెల్లను డాఁగ వెడలుటయును
భావించి సురమాత పరితాపమునఁ బొంది, వగ ననాథాకృతి వనరు చుండ
నాయమ్మపెనిమిటి యగుకశ్యపబ్రహ్మ, మఱి యొకనాఁడు సమాధి మాని
తనకుటుంబిని యున్నధామంబునకు నేఁగి, నాతిచే విహితార్చనములు వడసి

ఆ. వంది వ్రాలి కుంది వాడినయిల్లాలి, వదనవారిజంబు వడువుఁ జూచి
చేరఁ దిగిచి మగువచిబుకంబు వుడుకుచు, వారిజాక్షి యేల వగచె దనుచు.

వ. అమ్మహాత్ముం డిట్లనియె. 465

---

1 ప్రతిష్ఠించి.

మ. తెలవా విప్రులు పూర్ణులే జరగునే దేవార్చనాచారముల్
తతితో వేలుతురే గృహస్థులు సుతుల్ ధర్మానుసంధానులే
నెఱి నభ్యాగతకోటి కన్న మిడుదే నీరంబునుం బోయుదే
మఱి లేకర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే పైదలీ. 466

ఆ. అన్న మైనఁ దక్ర మైనఁ దోయం బైన, శాక మైనఁ దనకు జరగుకొలఁది
నతిథిజనుల కడ్డ మాడక యిడరేని, లేమ వారు కలిగి లేనివారు. 467

వ. మఱియు. 468

ఆ. నెలఁత విష్ణునకును నిఖిలదేవాత్మున, కాననంబు శిఖియు నవనిసురులు
వారు దనియఁ దనియు వనజాతలోచనుఁ, డతఁడు దనియ జగము లన్ని దనియు.

క. బిడ్డలు వెఱతురె నీ కొఱ, గొడ్డంబులు సేయ కెల్లకోడండ్రును మా
ఱొడ్డారింపక నడతురె, యెడ్డము గా కున్నదే మృగేక్షణ యింటన్. 470

వ. అని పలికినం బతికి సతి యిట్లనియె. 471

ఉ. ప్రేమ యొకింత లేక దితిబిడ్డలు బిడ్డలబిడ్డలున్ మహా
భీమబలాఢ్యులై తిసము బిడ్డల నందఱఁ దోలి సాహసా
క్రామితవైరు లయ్యు నమరావతి నేలుచు నున్నవారు నీ
కేమని విన్నవింతు హృదయేశ్వర మేలు దలంచి చూడవే. 472

క. అక్కాచెల్లెం డ్రయ్యును, దక్కదు నాతోడిపోరు దానును దితియున్
రక్కసులు సురల మొత్తఁగ, నక్కట వల దనదు చూచు నానాననుచున్.

సీ. ఎండక న్నెఱుఁగని యింద్రుని యిల్లాలు, పలుపంచలును జాలిఁబడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్యవిభవంబుఁ గోల్పోయి, దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు, శబరార్భకులవెంటఁ జనిరి నేఁడు
నమరుల కాధార మగు నమరావతి, యసురుల కాటప ట్టయ్యె నేఁడు

ఆ. బలి జగముల నెల్ల బలియుచు నున్నాఁడు, వాని గెలువ రాదు వాసవునకు
యాగభాగ మెల్ల నతఁ డాహరించును, గడఁగి సురల కొక్కకడియు నీఁడు.

క. ప్రజలకు నెల్లను సముఁడవు, ప్రజలను గడు పారఁ గన్నబ్రహ్మవు నయ్యాం
బ్రజలందు దుష్టమతులను, నిజముగ శిక్షింప వలదె నీవు మహాత్మా. 475

మ. సురలన్ సభ్యుల నార్తులన్ [1]విరథులన్ శోకంబు వారించి ని
ర్జరధానిన్ నిలువంగ రాత్రిచరులన్ శాసింప సత్కార్య మీ
వెర బవేరీతి ఘటిల్లు నట్టిక్రమమున్ వేగంబ చింతింపవే
కరుణాలోక[2]సుధార్ఝరిం దనుపవే కల్యాణసంధాయకా. 476

వ. అనిన మనోవల్లభపలుకు లాకర్ణించి ముహూర్తమాత్రంబు చింతించి విజ్ఞానదృష్టి నవలంబించి భావికాలకార్యంబు విచారించి కశ్యపబ్రహ్మ యిట్లనియె.

1 విరతులన్. 2 'సుధాంబుధిం' వ్రా. ప్ర.

జనకుం డెవ్వఁడు జాతుఁ డెవ్వఁడు జనిస్థానంబు లెచ్చోటు సం
జననం బెయ్యది మేను లేకోలఁది సంసారంబు లేరూపముల్
వినుమా యింతయు విష్ణుమాయ దలఁపన్ వే తేమియున్ లేదు మో
హనిబంధంబు నిధాన మింతటికి జాయా విన్నఁబో నేటికిన్. 478

వ. అగు నయిననుం గాలోచితకార్యంబు సెప్పెద. 479

మ. భగవంతుం బరముం జనార్దనుఁ గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవ సేయు మతఁడున్ సాంగత్యముం బొంది నీ
కగునిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవలఁ బొంద రాదె బహుసౌభాగ్యంబులం బ్రేయసీ. 480

వ. అనిన గృహస్థునకు గృహిణి యి ట్లనియె. 481

క. నారాయణుఁ బరమేశ్వరు, నేరీతిఁ దలంతు మంత్ర మెయ్యది విహితా
చారంబు లే ప్రకారము, లారాధనకాల మెద్ది యానతి యీవే. 482

వ. అనినం (గశ్యప) ప్రజాపతి సతికిఁ బయోభక్షణం బను వ్రతం బుపదేశించి తత్కా
లంబును దన్మంత్రంబును దద్విధానంబును దదుపవాసదానభోజన ప్రకారంబు
లును నెఱింగించిన నదితియును ఫాల్గునమాసంబున శుక్లపక్షంబునఁ బ్రథమదివ
సంబునన్ దొరఁకొని పండ్రెండుదినంబులు హరిసమర్పణంబుగా వ్రతంబు సేసి
వ్రతాంతంబున నియత మై యున్నయెడఁ జతుర్బాహుండును బీతవాసుండును
శంఖచక్రగదాధరుండును నై నేత్ర(ంబులక)గోచరుం డై నారాయణదేవుం(డు
ప్రత్యక్షం బై నం) గనుంగొని. 483

క. కన్నులసంతోషాశ్రులు, చన్నులపైఁ బఱవఁ బులకజాలము లెసఁగన్
సన్నతులును సన్నుతులును, నున్నతకుచఁ జేసె నిటలయుక్తాంజలి యై. 484

క. చూపుల శ్రీపతిరూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్గత యై
వాపుచ్చి మందమధురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్. 485

సీ. యజ్ఞేశ విశ్వంభ రాచ్యుత శ్రవణమం,గళనామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తివిఖండన, దీనలోకాధార తీర్థపాద
విశ్వోద్భవస్థితివిలయకారణభూత, [1]సంతతానంద శశ్వద్విలాస
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు, వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞానమును ముక్తివైరిజయము, నిన్నుఁ గొలువనినరులకు నెఱయఁ గలదె
వినుతమందార గుణహార వేదసార, ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష.

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి, నాక మేలు చున్ననాఁటనుండి
కన్నకడుపు గాన కంటఁ గూరుకురాదు, కడుపుఁబొక్కు మాన్పి కావవయ్య.

వ. అనిన విని దరహసితవదనుం డయి యాశ్రితకామధేను వయినయప్పరమేశ్వరుం

---

[1] సంతతైశ్వర్య.

డి ట్లనియె. 488

శా. నీకోడండ్రును నీకుమారవరులున్ నీనాథుఁడున్ నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయగర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుక పుట్టు నీసుతుఁడ నై నర్తించి వర్తింపఁగాన్. 489

మ. బలిమిన్ దైత్యులఁ జంప రాదు వినయోపాయంబునం గాని సం
చలనం బొందకు నేను నీనియతికిన్ సద్భక్తికిన్ మెచ్చితిన్
బలివిద్వేషణుఁడున్ నిలింపగణముం బౌలోమియున్ మెచ్చ దై
త్యులరాజ్యంబు హరింతు నింద్రునికి నిత్తున్ దుఃఖ మిం కేటికిన్. 490

క. నీరమణుని సేవింపుము, నారూపము మానసించి నలి నీగర్భా
గారంబు వచ్చి చొచ్చెద, గారామునఁ బెంప వమ్మ కరుణన్ నన్నున్. 491

క. ఏలింతు దివము సురలను, బాలింతు మహేంద్రయువతిభాగ్యశ్రీలం
దూలింతు దానవుల ని, ర్మూలింతు రిపుప్రియాంగములభూషణముల్. 492

వ. అని యిట్లు భక్తజనపరతంత్రుం డగుపురాణపురుషుం డాన తిచ్చి తిరోహితుం
డయ్యె నయ్యదితియుఁ గృతకృత్య యై సంతోషంబునఁ దనమనోవల్లభుం డగు
కశ్యపు నాశ్రయించి సేవించు చుండె నంత నొక్కదినంబున. 493

ఆ. ఘనసమాధినుండి కశ్యపుఁ డచ్యుతు, నంశ మాత్మ నొలయ నదితియందుఁ
దనదువీర్య మధికతరము సేర్చెను గాలి, శిఖిని దారువందుఁ జేర్చినట్లు. 494

వ. ఇట్లు కశ్యపచిరతరతపస్సంభృతవీర్యప్రతిష్ఠగర్భ యై సురలతల్లి యుల్లంబున
నుల్లసిల్లుచు నుండె నంత. 495

క. చలచల నై పిదపిద నై, [1]గలలం బై కరుడు గట్టి గళనాళముతోఁ
దల యేర్పడ గర్భం బై, నెలమసలం జీరచిక్కె నెలఁతకు నధిపా. 496

క. నెలఁతకుఁ జూ లై నెల రె, న్నెల లై మఱి మూఁడు నాల్గునెల లై వరుసన్
నెల లంత కఠత కెక్కఁగ, నెలలును డగ్గఱియె నసురనిర్మూలతకున్. 497

క. మహితతరమేఘమాలా, పిహితాయుతచండభానుబింబప్రభతో
విహితాంగంబులఁ గశ్యపు, గృహిణీగర్భమున శిశువు గ్రీడించె నృపా. 498

క. తనకడుపున నొకయిఱుమునఁ, గొనకొని జగములును నిముడుకొను పెనుముదుకం
డనిమిషులజననికడుపునఁ, దనుగతిఁ గడు నడఁగి ముడిఁగి తనరెడు బెడఁ గై.

వ. అంత సత్కాంతాతిలకంబు క్రమక్రమంబున. 500

మ. నిలిపెన్ రెప్పల బృందిమన్ విశదిమన్ నేత్రంబులం జూచుకం
బుల నాకాళిమ మేఖలం [2]ద్రఢిమ నెమ్మో మారఁగాఁ బాండిమ
న్వలిమిం జన్నుల శ్రోణిపాళిఁ [3]బ్రథిమన్ మధ్యంబునన్ బృంహిమ

---

1 కలకల మై. 2 గ్రశిమన్ 3 గరిమన్,

న్లలితాత్మకలక్షిమన్ మహామహిమ మేరన్ గర్భదుర్వార మై. 501

క. పెట్టుదురు నుదుట భూతిని, బొట్టిడుదురు మేనఁ బొట్టుఁ బుట్టపుదోయిం
బెట్టుదురు వేల్పులమ్మకుఁ, గట్టుదురు సురక్ష పడఁతి గర్భంబునకున్. 502

వ. ఇవ్విధంబున. 503

తే. విశ్వగర్భుఁడు దనగర్భ వివరమందుఁ, బూఁటపూఁటకుఁ బూర్ణుఁడై పొటకరింప
వ్రేకమూలాలితనమున వేల్పుఁబెద్ద, పొలఁతి మెల్లన నీళ్లాడఁ బ్రొద్దు లయ్యె.

వ. తదనంతరంబునం జతురాననుం డరుగుదెంచి యదితిగర్భపరిభ్రమవిభ్రముం డగునప్పరమేశ్వరు నుద్దేశించి యిట్లని స్తుతియించె. 505

సీ. త్రిజగజ్జయోన్నత దేవ యురుక్రమ, పృథులాత్మ శిపివిష్ట పృశ్నిగర్భ
ప్రీత త్రిణాభ త్రిపృష్ఠ జగంబుల, కాద్యంతమధ్యంబు లరయ నీవ
జంగమస్థావరజననాదిహేతువు, నీవ కాలంబ వై నిఖిల మాత్మ
లోపల ధరియింతు లోనిజంతుల నెల్ల, స్రోతంబులోఁ గొని సుందరతను

తే. బ్రహ్మలకు నెల్ల సంభవభవన మీవ, దివమునకుఁ బాసి దుర్దశ దిక్కులేక
శోకవార్ధి మునింగినసురల కెల్లఁ, దేల నాధార మగు చున్న తెప్ప నీవ.

క. విచ్చేయు మదితిగర్భము, చెచ్చెర వెలువడి మహాత్మ చిరకాలంబుల్
విచ్చలవిడి లే కమరులు, ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్. 507

### వామనమూర్త్యావిర్భావఘట్టము.

వ. అని యిట్లు కమలసంభవుండు వినుతి సేయునయ్యవసరంబున. 508

మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభ
శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్
భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతకున్
దివిజాధీశ్వరుమాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్. 509

వ. మఱియు నద్దేవుండు శంఖచక్రగదాకమలకలితచతుర్భుజుండ[illegible]శంగవర్ణవస్త్రుండును మకరకుండలమండితగండభాగుండును శ్రీవత్సవ[illegible]ను నలినచక్షుండును నిరంతరశ్రీవిరాజితరోలంబకదంబవిలంబితవన[illegible]పరిష్కృతుండును కనకకంకణకాంచీకిరీటవలయాంగదనూపురాలంకృతు[illegible]మనీయ కంఠకౌస్తుభాభరణుండును నిఖిలజనమనోహరుండును నై య[illegible]సమయంబున. 510

శా. చింతం బాసిరి యక్షతార్క్ష్యసుమనస్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్యచారణమునీశబ్రహ్మవిద్యాధరుల్
గాంతిం జెందిరి భానుచంద్రములు రంగద్గీతవాద్యంబులన్
గంతుల్ వైచిరి మింటఁ గింపురుషులున్ గంధర్[illegible] 511

క. దిక్కులకావిరి వాసెను, నెక్కుడునిర్మలత నొందె [illegible]ఘుల్

విదుఁ డజ్ఞాతుఁడు సూక్ష్మరూపమున నా వేశించె నిశ్శ్వాసరం
ధ్రదిశన్ దైత్యహృదంతరాళమునఁ బ్రత్యక్షక్రియాభీరుఁ డై. 561

వ. అంత నద్దైత్యవల్లభుండు వైష్ణవాలయంబు సొచ్చి వెదకి హరిం గానక కోపంబు
మానక మిన్ను మన్ను నన్వేషించి త్రిదివంబున నరసి దిశలం బరికించి భూవివ
బులు వీక్షించి సముద్రంబులు వెదకి పురంబులు శోధించి వనంబులు విమర్శిం
పాతాళంబు పరికించి జగంబున నదృష్టశత్రుండై మార్గణంబు సాలించి
ఇ ట్లనియె. 562

డియ నోపును, దగఁ డేనియు నెదురుపడఁడె దేహధరులకుం
గలమిఁదను, బగ గొనఁ దగ దనుచు నుడిగెఁ బ్రాభవశక్తిన్.

మహుం డతనిగుణంబు లనేకంబులు గల వవి యట్లుండనిమ్ము.
,హూతాదులు దన్ను వేఁడ నొగిఁ గొనుఁ డనుచున్
పు, నేతన్మాత్రుఁడవె నీవు నీలోకమునన్. 565

కొలితి వింద్రాదిసురలఁ దొల్లిటివారిం
పిశాచరాక్షసుల రక్షింపన్. 566

567

లకును యాచకులకు భూమిసురులకున్
బుల [illegible] ధన గేహంబుల్. 568

[illegible] త్రిభువనేశుం డనుచు
ఁ బెట్టు మనుచు [1]నిం[illegible]ము సేయన్.

మేర యిమ్ము సొమ్ము మేర యొల్లఁ
నకుతుకసాంద్ర దానవేంద్ర. 570

ట్లనియె. 571

త్యాగతులు వృద్ధసమ్మతంబు
, దాతపెంపుసొంపుఁ దలఁప వలదె.

573

వాంఛించితో వాజులన్
[2]వీక్షించి కాంక్షించితో
ంబు లీపాటి గా
ల్పంబు నీ నేర్చునే. 574

కలొత్త గృహమేధికి మేధావి యిట్లనియె.
నాకున్ ముంజియో దండమో

వడుగం డెక్కడ భూము లెక్కడ కరుల్ § వామాత్ము లక్ష్యంబు లె
క్కడ నిత్యోచితకర్మ మెక్కడ మదా§కాంక్షామితం బైనమూఁ
డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్ర§హ్మాండంబు నాపాలికిన్. 576

వ. అదియునుం గాక. 577

క. వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తం బగులేశ మైనఁ § బదివే లనుచుం
దృప్తిం జెందనిమనుజుఁడు, సప్తద్వీపముల నయినఁ § జక్కం బడునే. 578

శా. ఆశాపాశము దాఁ గడున్ నిడుపు లే § దంతంబు రాజేంద్రవా
రాశిప్రావృతమేదినీవలయసా § మ్రాజ్యంబు సేకూరియున్
గాసిం బొందిరి గాక వైన్యగయభూ § కాంతాదులు న్నర్థకా
మాశన్ బాయఁగ నేర్చిరే మును నిజా § శాంతంబులం జూచిరే. 579

సీ. సంతుష్టుఁ డీమూఁడు§జగములఁ బూజ్యుండు, సంతోషి కెప్పుడు § జరగుసుఖము
సంతోషి గాకుంట § సంసారహేతువు, సంతసంబున ముక్తి § సతియు దొరకుఁ
బూఁటపూఁటకు జగం§బుల యదృచ్ఛాలాభ, తుష్టిని దేజంబు § దోన పెరుఁగుఁ
బరితోషహీనతఁ § బ్రభ సెడిపోవును, జలధార ననలంబు § సమయునట్లు

ఆ. నీవు రాజ వనుచు § నిఖిలంబు నడుగుట, దగవు గాదు నాకుఁ § దగినకొలఁది
యేను వేఁడికొనిన§యీపదత్రయమును, జాల దనక యిమ్ము § చాలుఁ జాలు.

వ. అని యిట్లు పలుకుచున్నఖర్వునకు నుర్వీదానంబు సేయం దలంచి కరకలిత సలిలకలశుం డైనయవ్వితరణగుణముఖరునిం గని నిజవిచారయుక్తదనుజరాజ్య చక్రుం డగుశుక్రుం డి ట్లనియె. 581

సీ. దనుజేంద్ర యీతఁడు § ధరణీసురుఁడు గాఁడు, దేవకార్యంబు సా§ధించుకొఱకు
హరి విష్ణుఁ డవ్యయుం § డదితిగర్భంబునఁ, గశ్యపసూనుఁ డై § కలిగినాఁడు
ఎఱుఁగ వీతనికోర్కి § నిచ్చెద నంటివి, దైత్యసంతతి కుప§ద్రవము వచ్చె
నీలక్ష్మిఁ దేజంబు § నీవు నైశ్వర్యంబు, వంచించి యిచ్చుఁ దా § వాసవునకు

ఆ. మొనసి జగము లెల్ల § మూఁడుపాదంబుల,నఖిలకాయుఁ డగుచు § నాక్రమించు
సర్వధనము విష్ణు§సంసర్జనము సేసి, బడుగుపగిది నెట్లు § బ్రదికె దీవు. 582

క. ఒక్కపదంబున భూమియు, నొక్కటఁ ద్రిదివంబుఁ ద్రొక్కి § యున్నతమూర్తిన్
దిక్కులు గగనముఁ దా నై, వెక్కస మై యున్న నెందు § వెడలెదు చెపుమా.

సీ. ఇచ్చెద నని పల్కి § యీకున్న నరకంబుఁ, ద్రోవ నీవును సమ§ర్థుఁడవు గావ
యేదానమున నాశ § మే తెంచు నదియును, దానంబు గా దండ్రు § తత్త్వవిదులు
దానంబుయజ్ఞంబుఁ § దపముఁ గర్మంబును, దా విత్తవంతుఁ డై § తలఁపవలయుఁ
దనయింటఁ గలసర్వ§ధనమును నైదుభా,గములుగా విభజించి § కామమునకు

ఆ. నర్థమునకు ధర్మ§యశముల కాశ్రిత, బృందములకు సమతఁ § బెట్టునట్టి
పుణ్యుఁడిందు నందుఁ § బూజ్యుఁడై మోదించుఁ,దన్ను మాని చేత § దగవు గాదు,

వ. అదియునుం గాక యీయర్థంబునందు బహ్వృచగీతార్థంబు గల దొక్కటి సావధానుండవై యాకర్ణింపుము. 585

సీ. [1]అంగీకరించిన నఖిలంబుఁ బోవుచో, ననృతంబు గాదు లేదనిన నధిప
యాత్మవృక్షము మూల మనృతంబు నిశ్చయ మనృతమూలము గల్గ నాత్మ సెడదు
పుష్పఫలములాత్మభూజంబునకు సత్య, మాత్మ మ్రాను బ్రదుకమి నదియుఁ జెడును
ఫలపుష్పములు లేక పస సెడి వృక్షంబు, మూలంబుతో వృద్ధిఁ బొందుఁ గాదె

తే. చేటుఁ గొఱఁతయు లఘిమయుఁ జెందకుండ
నిచ్చుపురుషుండు సెడకుండు నిద్ధచరిత
కాక యంచితసత్యసంగతి నటంచు
నిజధనం బర్థి కిచ్చిన నీకు లేదు. 586

ఆ. సర్వ మయినచోట సర్వధనంబులు, నడుగ లేదటంచు ననృత మాడఁ
జెనఁటిపంద నేమి సెప్పఁ బ్రాణముతోడి శవము వాఁడు వానిజన్మ మేల. 587

వ. మఱియు నిం దొక్క విశేషంబు గలదు వివరించెద. 588

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ, బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము వొందదధిప. 589

మ. కులముం రాజ్యముఁ దేజమున్ నిలుపు మీకుబ్జుండు విశ్వంభరుం
డలఁతిం బోఁడు త్రివిక్రమస్ఫురణవాఁ డై నిండు బ్రహ్మాండముం
గలఁడే మాన్ప నొకండు నా పలుకు లాకర్ణింపు కర్ణంబులన్
వల దీదానము గీనముం బనుపుమా వర్ణిన్ వదాన్యోత్తమా. 590

వ. అని యిట్లు హితంబు వలుకుచున్న కులాచార్యునకు క్షణమాత్రనిమీలితలోచనుండయి యశస్వి యిట్లనియె. 591

సీ. నిజ మానతిచ్చితి నీవు మహాత్మక, మహితగృహస్థధర్మంబు నిదియ
యర్థంబుఁ గామంబు యశమును వృత్తియు, నెయ్యది ప్రార్థింప నిత్తు ననియు
నర్థలోభంబున నర్థిఁ బొమ్మను టెట్లు, పలికి లే దనుకంటెఁ బాప మెద్ది
యెట్టిదుష్కర్ముని నే భరించెదఁ గాని, సత్యహీనుని మోవఁ జాల ననుచుఁ

తే. బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ; సమరమం దడ్డు తిరుగక చచ్చుకంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె, మానధనులకు భద్రంబు మఱియుఁ గలదె.

క. ధాత్రిని హలికునకును సు,క్షేత్రము బీజము[2]లు నొకటఁ జేకుఱుభంగిం
[3]జిత్రముగ దాత కీవియుఁ, బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే. 593

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరి మూటఁ గట్టికొని పోవం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై

---

1 అంగీకరించెద నన్న సత్యం బైన. 2 ల నలుకఁ. 3 జిత్రంబుగ రాజునకును.

యీరే కోర్కులు వారలన్ మఱచి రే ♦ యిక్కాలమున్ భార్గవా. 594

క. ఉడుగని క్రతువులఁ దపములఁ, బొడగనఁ జననట్టిపాడవు ♦ పాడవునఁ గుఱుచై
యడిగెడి నటఁ ననుబోఁటికి, నిడ రాదె మహానుభావ ♦ యిష్టార్థంబుల్. 595

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై ♦ నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ ♦ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు గ్రింద గుట మీఁ ♦ దై నాకరం బుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే ♦ కాయంబు నాపాయమే. 596

మ. నిరయం బైన నిబంధ మైన ధరణీ♦నిర్మూలనం బైనదు
ర్మరణం బైనఁ గులాంత మైన నిజమున్ ♦ రానిమ్ము కా నిమ్ము పో
హరి యైనన్ హరుఁ డైన నీరజభవుం ♦ డభ్యాగతుం డైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ♦ ధీవర్య వే యేటికిన్. 597

ఆ. నొడివినంతవట్టు ♦ నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ ♦ డేటిమాట
గట్టె నేనిఁ దాన ♦ కరుణించి విడుచును, విడువ కుండనిమ్ము ♦ విమలచరిత. 598

క. మేరువు దలక్రిందై నను, బారావారంబు లింకఁ ♦ బాఱిన లోలో
ధారుణి రజ మై పోయినఁ, దారాధ్వము [1]బద్ధ మైనఁ ♦ దప్పక యిత్తున్. 599

మ. త్రైలోకిలము ఎన్నఁడుం బరు వేఁడఁ బోఁ డట ♦ [2]యేకలం బఁట కన్నవా
రన్నదమ్ములు నైన లే రఁట ♦ యన్నివిద్యలమూలగో
ష్ఠి న్నెఱింగినప్రోడగు జ్జఁట ♦ చేతు లొగ్గి వసింప నీ
చిన్నిపాపనిఁ ద్రోసి పుచ్చఁగఁ ♦ జిత్త మొత్తదు సత్తమా. 600

వ. అని యిట్లు సత్యపదవీప్రమాణతత్పరుండును । వితరణకుతూహలసత్వరుండును విమలయశస్కుండును దృఢమనస్కుండును నియతసత్యసంధుండును నర్థిజనకమలబంధుండును నైనబలిం జూచి శుక్రుండు గోపించి మదీయశాసనం బతిక్రమించుటం జేసి శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్మని శాపం బిచ్చె బలియును గురుశాపతప్తుం డయ్యు [3]నన్నృతమార్గంబున కభిముఖుండు గాకుండె నప్పుడు. 601

ఆ. బ్రదుక వచ్చుఁ గాక ♦ బహుబంధనము లైన, వచ్చుఁ గాక లేమి ♦ వచ్చుఁ గాక
జీవధనము లైనఁ ♦ జెడుఁగాక పడుఁ గాక, మాటఁ దిరుగ లేరు ♦ మానధనులు.

వ. (అయ్యవసరంబున.) 603

ఆ. దనుజలోకనాథు♦దయిత వింధ్యావళి, రాజవదన మదమ♦రాళగమన
వటునికాళ్లు గడుగ ♦ వరహేమఘటమున, జలము దెచ్చె భర్త♦కంబు♦మేరగాదె

వ. అయ్యవసరంబునఁ గపటవటునకు నర్ఘ్యదానవేంద్రుం డిట్లనియె. వారి♦నేఁడువలదు.

క. రమ్మా! నుతావర్ణోత్తమ, లెమ్మా నీవాంఛితంబు ♦ లే దః 640

[1] బద్ధవిం. [2] యేకతం బఁట. [3] నూనృత...కభిము

దెమ్మా యడుగుల నీఁ రా, నిమ్మా కడుగంగవలయు నేటికిఁ దడయన్. 606

వ. అనిన విని. 607

మ. బలిదైత్యేంద్రకరద్వయీకృతజల ప్రక్షాళనవ్యాప్తికిన్
జలజాతాక్షుఁడు సాఁచె యోగిసుమన స్సంప్రార్థితశ్రీదముం
గలితానమ్రరమాలలాటపదవీ కస్తూరికాశాదమున్
నలినామోదము రత్ననూపురితనా నావేదముం బాదమున్. 608

క. సురలోకసముద్ధరణము, నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము, హరిచరణము నీటఁ గడిగె నసురోత్తముఁడున్.

వ. ఇట్లు ధరణీసురదక్షిణచరణ ప్రక్షాళనంబు సేసి వామపాదంబు గడిగి తత్పావన
జలంబు శిరంబునం జల్లుకొని వార్చి దేశకాలాదిపరిగణనంబు సేసి. 610

శా. విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్య[1]విదే త్రిపాదధరణిం దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జే సాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధార వోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్. 611

(వ. తత్కాలంబున. 612

ఆ. నీరధారఁ బడఁగ నీక యడ్డంబుగాఁ, గలశరంధ్రి మాఁపఁ గాను దెలిసి
హరియుఁ గావ్యు నేత్ర మటఁ గుశాగ్రంబున, నడువ నేక నేత్రుఁ డయ్యె నతఁడు.

వ. అంత.) 614

మ. అమరారాతికరాక్షతోజ్ఝితపవిత్రాంభఃకణశ్రేణికిం
గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండితదివౌకస్స్వామిజిష్ణుత్వముం
గమలాకర్షణసుప్రశస్తము రమాకాంతాకుచోపాస్తమున్
విమలశ్రీకుచశాతమూచుకతటీవిన్యస్తమున్ హస్తమున్. 615

క. మునిజననియమాధారను, జనితాసురయువతినేత్రజలకణధారన్
దనుజేంద్రనిరాధారను, వనజాక్షుఁడు గొనియె బలివివర్జితధారన్. 616

ఆ. కమలనాభు నెఱిఁగి కాలంబు [illegible]ంబు
నెఱిఁగి శుక్రుమాట లెఱిఁగి నాశ
మెఱిఁగి పాత్ర మనుచు నిచ్చె దానము బలి
మహి వదాన్యుఁ డొరుఁడు మఱియుఁ గలఁడె. 617

క. బలి సేసినదానమునకు, నలినాక్షుఁడు నిఖిలభూతనాయకుఁ డగుటం
దని దశదిక్కులు, బళిబళి యని పొగడె భూతపంచక మనఘా. 618

యిచ్చునతఁడును, నతికాంతుఁ బరిగ్రహించునతఁడును దురిత
సంవత్సరములు, శతమఖలోకమునఁ గ్రీడ సలుపుదు రెలమిన్.

వ. అట్లు గావున నేదానంబును భూదానంబునకు సదృశంబు గానేరదు గావున వసుంధరాదానం బిచ్చితి వుభయలోకంబులం గీర్తిసుకృతంబులు పడయు మని పలికి యమ్మాయావటుం డిట్లనియె. 620

క. ఇది యేమి వేఁడి తని నీ, మది వగవక ధార వోయుమా సత్యము పెం
పొదవఁగఁ గోరినయర్థం, బిది యిచ్చుట ముజ్జగంబు లిచ్చుట మాకున్. 621

వ. అని పలికినవటునిపలుకులకు హర్షనిర్భరచేతస్కుం డై వైరోచనుండు. 622

ఆ. పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో, చిట్టిబుద్ధు లిట్టిపొట్టివడుగు
పొట్ట నున్నవెల్ల బూమెలు నని నవ్వి, యెలమి ధరణిదాన మిచ్చె నపుడు.

—✿వామనమూర్తి విశ్వరూపము నొంది విజృంభించుట.✿—

ఆ. గ్రహమునీంద్రసిద్ధగంధర్వకిన్నర, యక్షపక్షిదేవతాహిపతులు
పొగడి రతనిపెంపుఁ బుష్పవర్షంబులు, గురిసె దేవతూర్యకోటి మొరసె.

వ. ఇట్లు ధారాప్రతిగ్రహంబు సేసి. 625

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై. 626

మ. రవిబింబం బుపమింపఁ బాత్ర మగుఛత్రంబై శిరోరత్న మై
శ్రవణాలంకృతి యై గళాభరణ మై సౌవర్ణ కేయూర మై
ఛ[illegible]ంకణ మై కటిస్థలి నుదంచద్ఘంట యై నూపుర
ప్ర[illegible] దా బ్రహ్మాండమున్ నిండుచోన్. 627

వ. ఇట్లు [illegible]ండ[illegible]యాంత[illegible]విశ్వరూపంబు ధరియించిన భువియును
నభంబును దివంబును దిశలును [illegible]ంబులును సముద్రంబులు[illegible]
ఖిలభూతనివహంబులుం దాన [illegible]
నకుం బాడ.వై భువర్లోకంబు[illegible]
ర్లోకంబు దాఁటి జనోలోక[illegible]
కంబుకంటె నౌన్నత్యంబు[illegible]
కుండ నిండి (మహాదేహము[illegible]
మహియును జంఘల మ[illegible]
నూరువుల నింద్రసేన[illegible]

బురందరాదిదేవతలును గర్ణంబుల దిశలును శిరంబున నాకంబును శిరోజంబుల మేఘంబులును నాసాపుటంబున వాయువును నయనంబుల సూర్యుండును వదనంబున వహ్నియు వాణి నఖిలచ్ఛందస్సముదయంబును రసజ్ఞను జలేశుండును భ్రూయుగళంబున విధినిషేధంబులును ఱెప్పల నహోరాత్రంబులును లలాటంబున మన్యువును నధరంబున లోభంబును స్పర్శంబునఁ గామంబును రేతంబున జలంబును బృష్ఠంబున నధర్మంబును గ్రమణంబుల యజ్ఞంబులును ఛాయల మృత్యువును నగవులవలన ననేకమాయావిశేషంబులును రోమంబుల నోషధులును నాడీప్రదేశంబుల నదులును నఖంబుల శిలలును బుద్ధి నజుండును బ్రాణంబుల దేవర్షిగణంబులును గాత్రంబున జంగమస్థావరజంతుసంఘంబులును గలవాఁ డయ్యె జలధరనినదశంఖశార్ఙ్గసుదర్శనగదాదండఖడ్గాక్షయబాణతూణీరవిభ్రాజితుండును మకరకుండలకిరీటకేయూరహారకటకకంకణకౌస్తుభమణిమేఖలాంబరవనమాలికావిరాజితుండును సునంద నంద జయ విజయప్రముఖ పరిచరవాహినీసందోహపరివృతుండును నమేయతేజోవిలసితుండును నై బ్రహ్మాండంబు దనమేనికప్పు రెఱంగున నుండ విజృంభించి. 628

మ. ఒకపాదంబున భూమిఁ గప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం
డొకటన్ మీఁదిజగంబు లెల్లఁ దొడి నొండొంటన్ విలంఘించి ప
ట్టక బ్రహ్మాండకటాహముం [1]బెటిలి [2]వేంఱద్రం బై పగుల్ గాన రా
నొకఁ డై వాగ్ద్రగలభ్యుఁ డై హరివిభుం డొప్పారె విశ్వాకృతిన్. 629

ఆ. ఒకపదంబు క్రింద నుర్వి పద్మము నంటి, కొన [illegible]
నొకటిమీఁదఁ దమ్మికొదిఁగిన తేఁటి నా[illegible]మున. [illegible]

తత్సమయంబున. 631

[illegible]నఖరచంద్రచంద్రికలను
దివసకరునిరుచుల దివియభంగి.
[illegible]రంబులు సేయుఘనులు రాజు
[illegible]ంద్రు లచట నెపుడు
[illegible]న్నయనియమేతిహాసధర్మ
[illegible]యును గలుగునట్టి
[illegible] మొక్కి రధికభక్తిఁ
[illegible]నేఁడు[illegible]చు.

[1] [illegible]

వినువీధిం [1]బ్రవహించె దేవనది నా విశ్వాత్ముకీర్తిప్రభన్. 634

వ. తత్సమయంబున. 635

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ, పుష్పదామంబులఁ బూజ సేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి, ధూపదీపములఁ దోడ్తోడ నిచ్చి
భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములు, గానిక లిచ్చి రాగమునఁ బొంది
శంఖాదిరవములు జయఘోషములుఁ జేసి, కరుణాంబునిధి త్రివిక్రమ యటంచు

ఆ. బ్రహ్మ మొదలు లోకపాలురు గొనియాడి, రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ డరిగి చాటె భేరిధ్వని, వెలయఁ జేసి విష్ణువిజయ మనుచు. 636

క. అన్నిజగంబులఁ దా నై, యున్నజగన్నాథుఁ జూడ నొగి భావింపం
గ న్నందక మన మందక, సన్నుతులం జేసి రపుడు సభ్యులు బలియున్. 637

వ. అంత నయ్యన పూర్వాకారంబున నున్నవామనునిం గని పదత్రయవ్యాజంబున నితండు సకలమహీమండలంబు నాక్రమించెఁ గపటవటురూపతిరోహితుం (డగు విష్ణుం) డని యెఱుంగక మనదానవేంద్రుండు సత్యసంధుండు గావున మాట దిరుగక యిచ్చెనతనివలన నేరంబు లేదీకుబ్జుం (డప్రతిహత తేజఃప్రభావంబున) [2]సజ్జకంబుగా నిజ్జగంబులం బరిగ్రహించి పర్జన్యాదులకు విసర్జనంబు సేయం దలంచి యున్నవాఁడీపాపునిం దూఱి పాఱనీక నిర్జించుట కర్జం బని తర్జనంబులును గర్జనంబులును జేయుచు వజ్రాయుధాదిమరుజ్జేత లగు హేతిప్రహేతివిప్రచిత్తి ముఖ్యు లయినరక్కసులు పెక్కండ్రు క్రుక్కి మిగిలి యుద్ధంబునకు సన్నద్ధులై పరశుపట్టిసభల్లాదిసాధనంబులు ధరియించి కసిమసంగి మొసరికొని దశదిశలం బ్రసరించిన[illegible] జూచి హరి[illegible]రిచరులు సునంద నంద జయ జయంతవిజయ ప్రబలోద్బల కుముద కుముదాక్ష తార్క్ష్య పుష్పదంత విష్వక్సేన శ్రుతదేవ సాత్వత ప్రముఖు లగుదండనాథు లయుతవేదండసముద్దండబలులు దమతమయూథంబుల నాయుధంబులతోడం గూర్చుకొని దానవానీకంబులఁ బరలోకంబున కనుచువార లై వారల నెదుర్కొని కదనంబునకుఁ బరవసంబు సేయుచున్నం గనుంగొని శుక్రశాపంబుఁ దలంచి దనుజవల్లభుం డిట్లనియె. 638

సీ. రాక్షసోత్తములార రండు పోరాడక, కాలంబు గా దిది కలహమునకు
సర్వభూతములకు సంపదాపదలకుఁ, బ్రభు వైనదైవంబుఁ బరిభవింప
మన మోపుదుమె తొల్లి మనకు రాజ్యంబును, సురలకు నాశంబు సొరిది నిచ్చి
వి[illegible]రీతముగఁ జేయు వేల్పు నే మందము, మనపాలిభాగ్యంబు మహిమ కాక

తే. వె[illegible] పలుమాఱుఁ బాఱెడి విష్ణుభటులు, మిమ్ము నెగచుట దైవంబు మేర గాదె
మనకు[illegible]దైవంబు మంచి దగును, నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు.

వ. అదియు[illegible] 640

---

1 ప్రభవించె [illegible]జ్జంబుగా' వ్రా. ప్ర.

క. బలుదుర్గంబులు సచివులు, బలములు మంత్రౌషధములు ‡ బహుశేముషియుం
గలిగియు సామోపాయం, బులఁ గాల మెఱింగి నృపుఁడు ‡ పోరుట యొప్పున్.

వ. అట్లు గావున రణంబున శత్రులకిప్పు డెదురు మోహరించుట కార్యంబు గాదుమ
నకు నుఱ వగుకాలంబున జయింతము నలంగక తొలంగుం డనినఁ గలంగి భాగ
వతభటపలాయితులై చిక్కి రక్కసులు రసాతలంబునకుం జని రంత హృదయం
బెఱింగి తార్క్ష్యనందనుండు యాగసుత్యాహంబున వారుణపాశంబుల నసుర
వల్లభుని బంధించెనంత. 642

క. బాహులుఁ బదములుఁ గట్టిన, శ్రీహరికృప గాక యేమి ‡ సేయుదు నని సం
దేహింపక బలి నిలిచెను, హాహారవ మెసఁగె దశది‡గంతములందున్. 643

క. సంపద సెడియును దైన్యముఁ, గంపంబును లేక తొంటి‡కంటెను బెంపుం
దెంపును నెఱుకయు ధైర్యము, వంపని సురవైరిఁ జూచి ‡ వటుఁ డిట్లనియెన్.

సీ. దానము త్రిపదభూ‡తల మిత్తు నంటివి, [1]తరుణచంద్రార్కు లెం‡దాఁక నుందు
రంతభూమియు నొక్క‡యడుగయ్యె నాకును, స్వర్లోకమును నొక్క‡చరణమయ్యె
నన్న నీసొమ్ము రెం‡డడుగులఁ గలసెను, గడమపాదమునకుఁ ‡ గలదె చోటు
నిచ్చెద నన్నర్థ ‡ మీనిమరాత్ముండు, నిరయంబుఁ బొందుట ‡ నిజముగాదె

తే. కాన దుర్గతికిని గొంత‡కాల మరుగు, కాక యిచ్చెద వేని వే‡గంబ నాకు
నిపుడు మూఁడవపదమున‡కిమ్ముఁ జూపు, బ్రాహ్మణాధీనములు దోర్వ‡బ్రహ్మవశము.

వ. అని యిట్లు వామనుండు వలుక సత్యభంగసందేహవిషదిగ్ధశల్యనికృత్తహృద
యుం డయ్యును విషణ్ణుండు గాక వైరోచని ప్రసన్నవదనంబుతోడఁ జిన్నిపొట్ట
వడుగున కిట్లనియె. 646

ఆ. సూనృతంబు గాని ‡ సుడియదు నాజిహ్వ, బొంకఁ జాల నాకు ‡ బొంకు లేదు
నీతృతీయపదము ‡ నిజము నాశిరమున, నెలవు సేసి పెట్టు ‡ నిర్మలాత్మ. 647

ఆ. నిరయమునకుఁ బ్రాప్త‡నిగ్రహంబునకును, బదవిహీనతకును ‡ బంధనమున
కర్థభంగమునకు ‡ నావ్యసనమునకు, వెఱవ దేవ బొంక ‡ వెఱచినట్లు. 648

వ. అదియునుం గాక. 649

సీ. తల్లిదండ్రులు నన్న‡దమ్ములుఁ జెలికాండ్రు, గురువులు శిక్షింపఁ ‡ గొఱఁతవడునె
పిదప మేలగుఁగాక ‡ పృథుమదాంధులకును, దానవులకు మాకుఁ ‡ దఱి యెఱింగి
విభ్రంశచక్షువు ‡ వెలయ నిచ్చుటఁ జేసి, గురువులలో నాది‡గురువ వీవ
నీవు బంధించిన ‡ నిగ్రహమో లజ్జయో నష్టియో బాధ‡యో తలంప

తే. నిన్ను నెదిరించి పోరాడి ‡ నిర్జరారు
లాదియోగీంద్రు లందెదు‡నట్టి కెంకి
నందరే తొల్లి పెక్కండ్రు ‡ హర్షమూర్తి

1 'ధరణిఁ జంద్రా. 2 నీసొమ్ము సకలంబు నేఁడు రెండడుగులు.' అ. ప్ర[illegible] చిత్తుం డయ్యు.

త్రిదశగణముఁ గన్న యదితి గానుపు దీఱఁ, జిన్ని మేటివడుగుఁ గ[illegible]ల్లి.

వ. ఇట్లు దేవేంద్రుండు వామనభుజపాలితం బగు త్రిభువనసామ్రాజ్యవిభవ[illegible]రల నంగీకరించె నప్పుడు బ్రహ్మయు శర్వుండును గుమారుండును భృగ[illegible] లయినమునులును బితృదేవతలును దక్షాదిప్రజాపతులును సిద్ధులును వై[illegible] కులును మఱియుం దక్కినవారలు నద్భుతప్రకారుం డైనవిష్ణుని ప్రచారంబుల కాశ్చర్యంబు నొందుచుఁ బ్రశంసించుచు నాడుచుం బాడుచుఁ దమతమనివాసంబులకుం జని రని చెప్పి శుకుం డిట్లనియె. 690

తే. మనుజనాథ త్రివిక్రముమహిమ కొలఁది, యెఱుఁగఁ దర్కింప లెక్కింప నెవ్వఁ డోపుఁ
గుంభినీరేణుకణములు గుఱుతువెట్టు, వాఁడు నేరఁడు దక్కినవారివశమె.

క. అద్భుతవర్తనుఁ డగుహరి, సద్భావిత మైనవిమలచరితము వినువాఁ
డుద్భటవిక్రముఁ డై తుది, నుద్భాసితలీలఁ బొందు నుత్తమగతులన్. 692

తే. తగిలి మానుషపైతృకదైవకర్మ, వేళలందుఁ ద్రివిక్రమువిక్రమంబు
లెక్కడెక్కడఁ గీర్తింతు రెవ్వరేనిఁ, బొందుదురు నిత్యసౌఖ్యంబు భూవరేంద్ర.

మ. [1]జడు లై నాకము గోలుపోవుసురలం జంభారినిం బ్రోవఁగా
వడు గై భూమిఁ బదత్రయం బిడుట కై వైరోచనిన్ వేఁడి రెం
డడుగుల్ సాఁచి త్రివిక్రమస్ఫురణ బ్రహ్మాండంబుఁ దా నిండుచుం
గడు మోదంబున నుండువామనున కేకాలంబునన్ మ్రొక్కెదన్. 694

—మత్స్యావతారకథాప్రారంభము.—

వ. అని యిట్లు శుకుండు రాజునకు వామనావతారచరితంబు సెప్పె నని సూతుండు మునులకుం జెప్పిన విని వార లతని కిట్లనిరి. 695

సీ. విమలాత్మ వినమాకు వేడ్క యయ్యెడి మున్ను, హరిమత్స్య మైనవృత్తాంత మెల్లఁ
గర్మబద్ధునిభంగి ఘనుఁ డీశ్వరుఁడు లోక, నిందితం బై తమో[2]నిలయ మైన
మీనరూపము నేల మే లని ధరియించె, నెక్కడ వర్తించె నేమి సేసె
నాద్యమై వెలయున య్యవతారమునకు నె, య్యది కారణంబు గా ర్యాంశ మెట్లు

ఆ. నీవు దగుదు మాకు నిఖిలంబు నెఱిఁగింపఁ, దెలియఁ జెప్పవయ్య దేవదేవు
చరిత మఖిలలోకసౌభాగ్యకరణంబు, గాదె విస్తరింపు క్రమముతోడ. 696

వ. అని మునిజనంబులు సూతు నడిగిన నతం (డిట్లనియె) మీర లడిగినయీయర్థంబుఁ బరీక్షిన్నరేంద్రుం డడిగిన భగవంతుం డగు బాదరాయణి యిట్లనియె. 697

సీ. విభుఁ డీశ్వరుఁడు వేదవిప్రగోసురసాధు, ధర్మార్థములఁ గావఁ దనువుఁ దాల్చి
గాలిచందంబున ఘనరూపములయందుఁ, దనురూపములయందుఁ దగిలియుండు
నెక్కువ దక్కువ యెన్నఁడు నొందక, నిర్గుణత్వంబున నెఱయుఘనుఁడు
గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు, మనుజేశ చోద్యమే మత్స్య మగుట

1. ఈపద్య మొకానొక ప్రతియందుఁ గనుపట్టెడి. 2. నియత మైన.

తే. విన[illegible] పోయినకల్పాంత|వేళఁ దొల్లి, ద్రవిళదేశపురాజు స|త్యవ్రతుండు
[illegible]వుచు హరిఁగూర్చి |నిష్ఠతోఁ, దపముఁగావించెనొక యేటి|తటమునందు.
[illegible]యు నొక్కనాఁ డమ్మేదినీకాంతుండు కృతమాలిక యను నేటిపొంత హరిసమ
ర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్నసమయంబున నారాజుదోసిట నొక్కమీ
నుపిల్ల దవిలి వచ్చిన నులికిపడి మరలం దరంగిణీజలంబునందు శకులశాబకంబు
విడిచె నట్లు విడివడి నీటిలోనుండి జలచరపోతంబు భూతలేశ్వరున కిట్లనియె.

మత్తకోకిలము. పాటు వచ్చినజ్ఞాతిఘాతులు | పాపజాతిఝషంబు లీ
యేటఁ గొండొకమీనుపిల్లల | నేఁటి పట్టి హరింప ని
చ్చోట నుండక నీదుదోసిలి | సొచ్చి వచ్చిననన్ను న
ట్టేటఁ ద్రోవఁగఁ బాడిగా కృప | యింత లేక దయానిధీ. 700

ఆ. వలలు దారు నింక | వచ్చి జాలరివేఁట, కాఱు లేఱు గలఁచి | కార వెట్టి
మిడికి పోవ నీక | మెడఁ బట్టుకొనియెద, రప్పు డెందుఁ జొత్తు | ననఘచరిత.

క. భక్షించు నొండె ఝషములు, శిక్షింతురు ధూర్తు లొండెఁ | జెడ కుండఁగ నన్
రక్షింపు దీనవత్సల, ప్రక్షీణులఁ గాచుకంటె | భాగ్యము గలదే. 702

వ. అనిన విని కరుణాకరుం డగునవ్విభుండు మెల్లన యమ్మీనడింభకంబును
గమండలు(జలంబు)నం బెట్టి తననెలవునకుం గొనిపోయె నదియు నొక్కరాత్రం
బునం గుండిక నిండి తనకు నుండ నిమ్ము సాలక రాజన్యున కిట్లనియె. 703

క. ఉండ నిది గొంచె మెంతయు, నొండొకటిం దెమ్ము భూవ|రోత్తమ యనుచున్
గండకముఁ దెచ్చి విడిచెను, మండలపతి కలశసలిల|మధ్యమున నృపా. 704

వ. అదియును ముహూర్తమాత్రంబునకు మూఁడుచేతులనిడుపై యుదంచనంబు
నిండి పట్టు లేక వేఱొండు దెమ్మనవుడు నారాచపట్టి కరుణాగుణంబునకు నాట
పట్టు గావున గండకంబు నొండొక్కచిఱుతమడుఁగున నునిచె నదియు నాసరో
వర(జల)ంబునకు సగ్గలంబై తనకు సంచరింప నది గొంచెం బని పలికినం బుడమి
ఱేఁడు మంచివాఁ డగుటం జేసి యాకంచరంబు నుదంచితజలాస్పదంబైనహ్ర
దంబునందు నిడియె నదియు నాజలాశయంబునకు నధికంబై పెరుఁగ నిమ్ము
సాల దనిచెప్పికొనిన నప్పుణ్యుం డొప్పిడినడవడిం దప్పనివాఁడై నకతంబున నమ్మ
హామీనంబును మహార్ణవంబున విడిచె నదియును మకరాకరంబునం బడి రాజు
న కిట్లనుఁ బెనుమొసళ్లు ముసరికొని కసిమసంగి మ్రింగెడి నింతకాలంబు నడపి
కడపట దిగవిడువకు వెడలఁ దిగువు మని యెలుంగింప నన్నీటిపొడవునకుం
బుడమిఱేఁడు దెలిసి యిట్లనియె. 705

సీ. ఒకదినంబున శత|యోజనమాత్రము, విస్తరించెదు నీవు | వినము చూడ
మిటువంటిఝషముల | నెన్నఁడు నెఱుఁగము, మీనజాతుల కిట్టి|మేను గలదె
యేమిటి కెవ్వఁడ | వేల త్రిప్పించెదు, కరుణ నాపన్నులఁ | గావ వేఁడి

యంభశ్చరం బైన హరివి నే నెఱిఁగితి, నవ్యయ నారాయణాభిధాన
తే. జననసంస్థితిసంహారచతురచిత్త, దీనులకు భక్తులకు మాకు దిక్కు నీవ
నీదులీలావతారంబు లఖిలభూత, భూతిహేతువు లెయ్యవి పురుషవర్య.
క. ఇతరులము [1]గాము చిత్సం, గతులము మాపాల నీవు గలిగితి భక్త
స్థితుఁడ వగునిన్ను నెప్పుడు, నతి సేసినవాని కేల నాశము గలుగున్. 707
క. శ్రీలలనాకుచవీథిని, గేళీపరతంత్రబుద్ధిఁ గ్రీడించుసుఖా
లోలుఁడవు దామసాకృతి, నేలా మత్స్యంబ వైతి వెఱిఁగింపు హరీ. 708
వ. అని పలుకుసత్యవ్రతమహారాజునకు నయ్యుగంబుకడపటఁ బ్రళయసమయసము
గ్రంబున నేకాంతజనప్రియుం డయి విహరింప నిచ్ఛయించుమీనరూపధరుం
డైనహరి యిట్లనియె. 709
సీ. ఇట మీఁద నీరాత్రి కేడవదినమునఁ, బన్నగశ్వాన నొక్కపగలు నిండు
భూర్భువాదికజగంబులు మూఁడు విలయాబ్ధిలోన మునుంగు నాలోనఁ బెద్ద
నావ సేరఁగ వచ్చు నాపంపుపెంపున, దానిపై నోషధితతులు బీజ
రాసులు నిడి పయోరాశిలో విహరింపఁ, గలవు సప్తర్షులుఁ గలిసి తిరుగ
ఆ. మ్రోలఁ గాన రాక ముంచుపెంజీఁకటి, [2]మినుకుచుండు మునులమేనివెలుఁగు
దూలఁకుచుండు జలధి దోధూయమానమై, నావ దేలుచుండు నరవరేణ్య.
వ. మఱియు నన్నావ మున్నీటికరళ్లకు లోనుగాకుండ నిరుగెలంకుల వెనుక ముం
దట నేమఱకుండఁ బెన్నెఱు లగునాగులఁ జడియుచుఁ బొడువ వచ్చినజల
గ్రహంబుల నోడియుచు సంచరించెద నొక్కెనుఁబాము చేరువ (నాయను
మతిం) బొడసూపెదు దానంజేసి సుడిగాడ్పులకతంబున నావ [3]వడిందిరుగంబడ
కుండ నాకొమ్మునందిం బదిలముగా లంకించి నీకును దపసులకును నలజడి సెంద
కుండ మున్నీట నిప్పాటం దమ్మిచూలి రేయి వేగునంతకు మెలంగెద నది కారణం
బుగా జలచరరూపంబుఁ గయికొంటి మఱియునుం బ్రయోజనంబు గలదు నామ
హిమ పరబ్రహ్మం బని తెలియుము నిన్ను ననుగ్రహించితి నని సత్యవ్రతుండు
సూడ హరి దిరోహితుం డయ్యె నయ్యవసరంబున. 711
ఆ. మత్స్యరూపమైనమాధవునడుగులు, దలఁచికొనుచు రాచతపసి యొక్క
దర్భశయ్యఁ దూర్పు దలగడగాఁ బండి, కాచి యుండె నాఁటికాలమునకు.
వ. అంతఁ గల్పాంతంబు డాసిన. 713
క. ఉల్లసితమేఘపంక్తులు, జల్లించి మహోగ్రవృష్టి జడిగొని కురియన్
వెల్లి విరిసి జలరాసులు, సెల్లెలికట్టలకు దాఁటి [4]సీమల ముంచెన్. 714
వ. తదనంతరంబ. 715
తే. మున్నుపోయినకల్పాంతమున నరేంద్ర, బ్రాహ్మమనఁగ నైమిత్తికప్రళయమైన

---

1 మిడుకుచుండు. 2. కదాచిత్సంగతులము. 3 దిరుగుడు వడకుండ. 4 జీవుల.

నింగిపై [1]నిట్టతోఁ గుసుముసన్నీటిలోనఁ, గూలె భూతాళి జగములు గోలుఁ దెడలి.
వ. అంత నమ్మహారాత్రియందు. 717
మ. నెఱి నెల్లప్పుడు నిల్చి ప్రాణిచయముల్ నిర్మించి నిర్మించి వీ
పిఱియల్ నిల్గుచు సావులించుచు నజుం డేసృష్టియుల్ మాని మే
నొఱగల్ ఱెప్పలు మూసి కేల్ దలగ డైయుండంగ నిద్రించుచుల్
గుఱువెట్టం దొడఁగెం గలల్ గనుచు నిర్ఘోషించుచుల్ భూవరా. 718
ఆ. అలసి సొలసి నిదుర నందినపరమేష్ఠి, ముఖమునందు వెడలె మొదలిశ్రుతులు
నపహరించె నొకహయగ్రీవుఁడను దైత్య, భటుఁడు దొంగఁ దొడరఁ బరులవశమె.
క. చదువులు దనచేపడినం, జదువుచుఁ బెక్కు బయల నుండ శంకించి వడిం
జదువులముదుకఁడు గూరుకఁ, జదువులతస్కరుఁడు సొచ్చె జలనిధికడుపున్.
వ. ఇట్లు వేదంబులు దొంగిలి దొంగరక్కసుండు మున్నీట మునింగిన వాని
జయింప వలసియు మ్రానుదీఁగెల విత్తనంబుల [2]పొత్తరలు పెన్నీట నాని చెడ
కుండ నునుప వలసియు నెల్లకార్యంబులకుం గావలి యగునాపురుషోత్తముం
డప్పను రేయిఁ జొరఁగలయందు. 721
క. కుఱుగఱులు వలుఁద మీసలు, చిఱుదోఁకయుఁ బసిఁడియొడలు సిరి గలపొడలున్
నెఱిమొగము నొక్కకొమ్మును, మిఱుచూపులుఁ గలిగి యొక్కమీనంబయ్యెన్.
వ. అట్లు లక్షయోజనాయతం బయినపాఠీనం బై విశ్వంభరుండు జలధి సొచ్చి. 723
సీ. ఒకమాటు జలజంతుయూథంబుతోఁ గూడు
నొకమాటు దరులకు నుఱికి వచ్చు
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు
నొకమాటు లోపల నొదిఁగి యుండు
నొకమాటు వారాశి నొడలు ముంపమిఁ జూచు
నొకమాటు బ్రహ్మాండ మొరయఁ దలఁచు
నొకమాటు ఝషకోటి నొడిసి యాహారించు
నొకమాటు జలముల నుమిసివైచు
తే. గఱులు సారించు మీసల గడలు నివురుఁ
బొడలు మెఱపించుఁ గన్నులఁ బొలప మార్చు
నొడలు జళిపించుఁ దళుకున నోలయుమీన
వేషి పెన్నీట నిగమగవేషి యగుచు. 724
వ. అంతకు మున్న సత్యవ్రతుండు మహార్ణవంబులు మహీవలయంబు ముంచునవ
సరంబున భక్తపరాధీనుం డగుహరిం దలంచుచు నుండ నారాయణప్రేరిత యై
యొక్కనావ వచ్చినం గనుంగొని. 725

---

1 మెట్టి; దొట్టి. 2 పొత్తంబులు.

మ. చని సత్యవ్రతమేదినీవిభుఁడు నోజం బూని మార్న్దిఁ గవి
త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై
మునిసంఘంబులు దాను నెక్కి వెఱతో మున్నీటిలోఁ దేలుచుం
గనియెన్ ముందట భక్తలోకహృదలంకర్మీణమున్ మీనమున్. 726

వ. కని జలచరేంద్రునికొమ్మున నొక్కపెనుఁబాఁపత్రాట నన్నావఁ గట్టి సంతసించి డెందంబు నివురుకొని తపస్వులుం దాను నారాచపెద్ద మీనాకారుం డగువేల్పు తేని ని ట్లని పొగడె నపుడు. 727

మ. తమలోఁ బుట్టునవిద్య గప్పికొనుడుం దన్మూలసంసారవి
భ్రమము లై కొందఱు దేలుచుం గలఁగుచున్ బల్వెంటలన్ దైవయో
గమునం దేవరమేశుఁ గొల్చి ఘను లై కైవల్యసంప్రాప్తు లై
ప్రమదం బందుదు రట్టినీవు కరుణం బాలింపు మమ్మీశ్వరా. 728

ఉ. కన్నులు లేనివాఁడు మఱి కాననివానికిఁ ద్రోవఁ జూపఁగాఁ
జన్న తెఱంగు మూఢున కసన్మతి దా గురుఁ డౌట సూర్యుఁడే
కన్నులు గాఁగ భూతములఁ గాంచుచు నుండురమేశ మాకు ను
ద్యన్నయమూర్తి వై గురువ వై యలసద్గతిజాడఁ జూపవే. 729

క. ఇంగలముతోడిసంగతి, బంగారము వన్నెగలుగుభంగిని త్వత్సే
వాంగీకృతులయఘంబులు, భంగంబులఁ బొందు ముక్తిఁ బ్రాపించు హరీ. 730

క. హృదయేశ నీప్రసన్నత, పదివేలవపాలిలేశభాగము కతసం
ద్రిదశేంద్రత్వము గల దఁట, తుది నిను మెప్పింప నేది దొరకదు శ్రీశా. 731

క. పెఱవాఁడు గురుఁ డటంచును, గొఱగానిపదంబు సూపఁ గుజనుం డగు నీ
నెఱత్రోవ నడవ నేర్చిన, గఱగొఱ లేకున్నపదము గలుగు దయాబ్ధీ. 732

మ. చెలి వై చుట్టమ వై మనస్స్థితుఁడ వై చిన్మూర్తి వై యాత్మ వై
వల నై కోర్కులపంట వై విభుఁడ వై వర్తిల్లుని న్నొల్లకే
పలువెంటం బడి లోక మక్కట వృథాబద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశిఁ గనియున్ నిర్భాగ్యుఁ డంభశ్శయా. 733

ఆ. నీరరాశిలోన నిజకర్మబద్ధ మై, యుచితనిద్రఁ బొంది యున్నలోక
మేమహాత్ముచేత నెప్పటి మేల్కాంచు, నట్టినీవు గురుఁడ వగుట మాకు. 734

క. ఆలింపుము విన్నప మిదె, వేలుపుగమితేని నిన్ను వేఁడికొనియెదన్
నాలోనిచిక్కు మానిచి, నీలోనికిఁ గొంచుఁ బొమ్ము నిఖిలాధీశా. 735

వ. అని యిట్లు సత్యవ్రతుండు వలికిన సంతసించి మత్స్యరూపంబున మహాసముద్రం బున విహరించుహరి పురాణపురుషుం డగుటం జేసి సాంఖ్యయోగక్రియాసహిత యగుపురాణసంహిత నుపదేశించె నమ్మహారాజు మునిసమేతుం డై భగవన్నిగ దితం బై సనాతనం బగుబ్రహ్మస్వరూపంబు విని కృతాత్ముం డయ్యె నతం డిమ్మహా

కల్పంబున వివస్వంతుం డనం బరఁగిన సూర్యునకు శ్రాద్ధదేవుం డన జన్మించి శ్రీహరి కృపావశంబున నేఁడవ మను వయ్యె నంత నవ్విధంబునం బెనురేయి నిండునంతకు సంచరించి జలచరాకారుం డగు నారాయణుండు దన్నిశాంతసమయంబున. 736

మ. ఉఱ కంభోనిధి రోసి వేదములకున్ యున్కిన్ దైన్యముం జూచి వే
గఱు లల్లార్చి ముఖంబు సాఁచి బలువీఁకం దోఁక సారించి మే
న్మెఱయన్ దాడలు దీటి మీస లదరన్ మీనాకృతిన్ విష్ణుఁ డ
క్కఱటిం దాఁకి వధించె ముష్టిదళితగ్రావున్ హయగ్రీవునిన్. 737

వ. అంతం బ్రళయావసానసమయంబున. 738

సీ. ఎప్పుడు వేగునం చెదురుసూచుచునుండు, మునులడెందంబులు ముదముఁ బొందఁ
దెలివితోఁ బ్రక్కనిద్రించుభారతి లేచి, యోరపయ్యెదఁ జక్కనొత్తికొనఁగ
మలిన మై పెనురేయి మ్రక్కిన తేజంబు, దొంటిచందంబునఁ దొంగలింపఁ
బ్రాణులసంచితభాగధేయంబులు, గన్నులకొలుకులఁ గానఁబడఁగ

తే. నవయవంబులు గదలించి యావులించి
నిదురఁ దెప్పిఱి మేల్కాంచి నీల్గి మలఁగి
యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు
ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. 739

వ. అయ్యవసరంబున. 740

ఆ. వాసవారిఁ జంపి వానిచేఁ బడియున్న, వేదకోటిచిక్కు విచ్చి తెచ్చి
నిదుర మాని యున్న నీరజాసనునకు, నిచ్చెఁ గరుణ విష్ణుఁ డీశ్వరుండు. 741

క. జలగుహనాభునికొఱకై, జలతర్పణ మాచరించి సత్యవ్రతుఁ డా
జలధి బ్రదికి మను వయ్యెను, జలజాక్షునిఁ గొలువ లేని సంపద గలదే. 742

ఆ. జనవిభుండు దపస్వి సత్యవ్రతుండును, మత్స్యరూపి యైన మాధవుండు
సంచరించినట్టి సదమలాఖ్యానంబు, వినినవాఁడు బంధవిరహితుండు. 743

క. హరిజలచరావతారముఁ, బరువడిఁ బ్రతిదినము జదువఁ బరమపదంబున్
నరుఁ డొందు వానికోర్కులు, ధరణీశ్వర సిద్ధిఁ బొందుఁ దథ్యము సుమ్మీ.

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రం జెందువాణీశుమో
ములవేదంబులు గొన్నదైత్యుని మృతిం బొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మము మాటలం దెలిపి సర్వాధారుఁ డై మీన మై
జలధిం గ్రుంకుచుఁ దేలుచున్ మెలఁగురాజన్మాత్రికిన్ మ్రొక్కెదన్. 745

వ. అని చెప్పి. 746

క. రాజేంద్రదైత్యదానవ, రాజమహాగహనదహన రాజస్తుత్యా
రాజావతంస మానిత, రాజధరార్చితగుణాఢ్య [1]రాఘవరామా. 747

---

1 రాజార్కనిభా.

మాలిని. దివిజరిపువిదారీ § దేవలోకోపకారీ
భువనభరనివారీ § పుణ్యరక్షానుసారీ
ప్రవిమలశుభమూర్తీ § బంధుపోషప్రవర్తీ
ధవళబహుళకీర్తీ § ధర్మనిత్యానువర్తీ. 748

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ
పాండిత్య పోతనామాత్యప్రణీతం బయిన శ్రీమహాభాగవతపురాణం బనుమహా
ప్రబంధంబునందు స్వాయంభువ స్వారోచి షోత్తమ తామసమనువులచరిత్రం
బును గరిమకరంబులయుద్ధంబును గజేంద్రరక్షణంబును రైవతచాక్షుషమను
వులవర్తనంబును సముద్రమథనంబును గూర్మావతారంబును గరళభక్షణం
బును నమృతాదిసంభవంబును దేవాసురకలహంబును హరి గపటకామినీ
రూపంబున నసురుల వంచించి దేవతల కమృతంబు వోయుటయు రాక్షసవధం
బును హరిహరసల్లాపంబును హరికపటకామినీరూపవిభ్రమణంబును వైవస్వత
సూర్యసావర్ణి దక్షసావర్ణి బ్రహ్మసావర్ణి భద్రసావర్ణి దేవసావర్ణీంద్రసావర్ణి
మనువులవృత్తాంతంబులును బలియుద్ధయాత్రయును స్వర్గవర్ణనంబును దేవపలా
యనంబును వామనావతారంబును శుక్రబలిసంవాదంబును త్రివిక్రమవిస్ఫు
రణంబును రాక్షసులసుతలగమనంబును సత్యవ్రతోపాఖ్యానంబును మీనావ
తారంబును ననుకథలు గలయష్టమస్కంధము. 749

ఓం తత్స ద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీరస్తు.

శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్రమహాభాగవతము.

## నవమస్కంధము.

—✿—



రాజిత మునిపూజిత
వారిధిగర్వాతిరేక వారణబాణా
సూరిత్రాణమహోజ్జ్వల
సారయశస్సాంద్ర రామచంద్రనరేంద్రా. 1

వ. మహనీయగుణగరిష్ఠు లగునమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డయినసూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుం డయినపరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని. 2

సీ. మనువులనడవళ్లు మర్యాదలును వింటి, మన్వంతరంబుల మాధవుండు
దిరిగినజాడలు దెలిసె సత్యవ్రతుం, డనురాజు ద్రవిళదేశాధిపుండు
పోయినకల్పాంతమున విష్ణు సేవించి, విజ్ఞానమునఁ బొంది వెలుఁగుతేని
కతఁడు వైవస్వతుం డై పుట్టి మను వయ్యె, నతనికి నిక్ష్వాకుఁ డాది గాఁగఁ

తే. బదురు గొడుకులు గల రంటి పరఁగ వారి,వంశ మేరీతి వర్తిల్లె వారిలోనఁ
జనినవారిని జనువారిఁ, జననివారిఁ, జెప్పవే వ్యాసనందన చిత్తగించి. 3

క. చెవులార నేఁడు వినియెద, రవివంశమునందుఁ గలుగురాజులకీర్తుల్
వివరింపు వరుసతోడను, భువిఁ బుణ్యులకీర్తి వినినఁ బుణ్యము గాదే. 4

వ. అనినం బరాశరమునిమనుమం డిట్లనియె. 5

ఆ. వినుము మనువుకులము వేయినూఱేండ్లును, బరఁగ విస్తరించి పలుక రాదు
నాకుఁ దోఁచినంత నరనాథ వేగంబ, యెఱుకపడఁగ నీకు నేర్పరింతు. 6

క. ఎక్కువదక్కువపొడవుల, కెక్కటి పొడ వయినపురుషుఁ డింతయుఁ జెడఁ దా
నొక్కఁడుఁ గల్పాంతంబున, నక్కజ మై యుండి విశ్వ మంతయు నిల్పున్. 7

సీ. భూమీశ యమ్మహాపురుషునినాభిమ,ధ్యమున బంగారుఁగెందమ్మి మొలచె
నాతమ్మిపూవులో నటమీఁదఁ దనయంత, నాలుగుమోములనలువ పుట్టె

నా బ్రహ్మమనమున నట మరీచి జనించెఁ, గశ్యపుం డతనికిఁ గలిగె నంత
నా కశ్యపునికి దక్షాత్మజ యదితికిఁ, గొమరుఁడై చీఁకటిఁగొంగ వొడమె

తే. జలజబంధుని పెండ్లాము సంజ్ఞయందు
శ్రాద్ధదేవుఁడు మనువు సంజాతుఁ డయ్యె
మనువునకు శ్రద్ధ యనియెడి మగువయందుఁ
బదురు గొడుకులు గలిగిరి భద్రయశులు. 8

వ. వార లిక్ష్వాకుండును నృగుండును శర్యాతియు దిష్టుండును ధృష్టుండును గరూశకుండును నరిష్యంతుండును బృషధ్రుండును నభగుండును గవియు నన నెగడి రట మున్న మనువు గొడుకులు లేనివాఁడై మిత్రావరుణుల నుద్దేశించి.

సీ. మనువు బిడ్డలు వుట్ట మఖమాచరించుచోఁ, నతనిభార్యయు హోత నాశ్రయించి
కూఁతురు వుట్ట నాకుం జేయు మని పల్కి, వరభక్తితోఁ బయోవ్రతముసలిపె
నా సతి సెప్పిన ట్లధ్వర్యుఁడును [1]హోత, నగుఁ గాక వేలువు మనుచుఁ బలికె
హవి సందుకొని కూఁతు రయ్యెడు మని వషట్కారంబు సెప్పుచుఁ గదిసి వేల్వ

తే. హోత పెడచేఁత నిల యను నువిద పుట్టె, దానిఁ బొడగని మనువు సంతాపమంది
కొడుకు మేల్గాక యేటికిఁ గూఁతు రకట, చెప్పవే యని పోయె వసిష్ఠుకడకు.

వ. చని యి ట్లనియె. 11

క. అయ్యా కొడుకులకొఱకై, యియ్యాగము నియమనుష్ఠ నేఁ జేయంగా
నియ్యాఁడు దేల పుట్టెను, మీయంతలవారి కొండుకమేరలుఁ గలవే. 12

వ. అదియునుం గాక మీరు బ్రహ్మవాదులరు మంత్రవాదులరు వేదవాదులుఁ బాపంబు లందకుండం జేయువార లిది యేమి యనవుడు మాతాత వసిష్ఠుండు హోతృవ్యభిచారం బెఱింగి మనువున కి ట్లనియె. 13

తే. అధిప సంకల్పవైషమ్య మగుటఁ జేసి, హోతకల్లఁదనంబున నువిద గలిగె
నైనఁ గలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని, నీవు మెచ్చంగఁ జూడు నా నేర్పుబలిమి.

వ. అని పలికి (భగవంతుం డగు) వసిష్ఠుండు (కీర్తితత్పరుండు గావున) మనువుకొమరాలి మగతనంబుకొఱకు నేకచిత్తంబున నాదిపురుషుం డగు హరిం బొగడిన నప్పరమేశ్వరుండు మెచ్చి తపసి కోరిన వరం బిచ్చె నది నిమిత్తంబుగా నిలాకన్యక సుద్యుమ్నుం డను కుమారుం డయి రాజ్యంబు సేయుచు. 15

సీ. ప్రొద్దు వో కొకనాఁడు పోయి పేరడవుల, వెంట వేఁటాడెడి వేడ్కతోడఁ
గొందఱుభృత్యులు గూడ రా సైంధవ, బయిన గుఱ్ఱము నెక్కి యడవికేఁగి
బలువిల్లుఁ గ్రొవ్వాఁడి బాణంబులును దాల్చి, పెనుమెకంబుల వెంటఁ బెఱుకుతోడ
నుత్తరదిశకు మహోగ్రుఁడై చనిచని, మేరువుపొంతఁ గుమారవనముఁ

1 కూఁతు రగుఁ గాక.

తే. [1]జేరె నందు మహేశుండు శివయు నెపుడు
రతి సలుపు చుందు రందుఁ జొరంగఁ బోవ
నాఁడు దయ్యెను రాజు రాజానుచరులుఁ
బడఁతు లైరి తదశ్వంబు బడబ యయ్యె. 16

వ. ఇట్లు మగతనంబు సెడి మగువ లై యొండొరుల మొగంబులు సూచి [2]మఱుఁగు చుండి రనిన విని శుకునకు రా జిట్లనియె. 17

ఆ. రాజుఁ దోడివారు రమణు లై రంటివి, కాంత లగుట కేమి కారణంబు
[3]నిట్టిదేశ మెఱుఁగ మెన్నఁ డాకథ యెల్ల, వేడ్క దీర నాకు విస్తరింపు. 18

వ. అదియునుం గాక. 19

ఆ. మగువతనము మాని మగవాఁడు గా వచ్చుఁ, గాక పేరుఁ బెంపు గాసిగాఁగ
మగతనంబు మాని మగువ గా వచ్చునె, మానవంతుఁ డైన మానవునకు. 20

వ. అని యడిగిన నర్జునపౌత్రునకు వ్యాసపుత్రుం డి ట్లనియె. 21

సీ. పురవైరి కొకనాఁడు పొడసూపు వేడుకఁ, దద్దయు దిక్కుల తమము లెల్లఁ
దమతమ వెలుఁగులు దగిలి గొందులు సొరఁ, గొందఱుపధికులు గొలిచి రాఁగఁ
బ్రాణేశుతొడలపై భాసిల్లునంబిక, వారలఁ జూచి మై వలువ లేమి
సిగ్గు పుట్టిన లేచి చీరఁ గట్టినఁ జూచి, దేవియు దేవుండు దీర్ఘలీల
తే. నొంటి దమలోనఁ గ్రీడించు చున్నవారు
మనకు సమయంబు గా దని మరలి మునులు
నరుఁడు నారాయణుండు ననారతంబు
మెలఁగుచోటికి నడచిరి మేదినీశ. 22

వ. అది కారణంబుగా భగవంతుం డగుశివుండు దనప్రియురాలివేడుకలకొఱకు. 23

క. [4]ఈనెల వెవ్వఁడు సొచ్చిన, మానిని యగు ననినతొంటిమాటకతమునఁ
మానవుఁడు మగువపోఁడిమి, మానక పేరడవులందు మఱియుం దిరిగెన్. 24

వ. ఇట్లు చెలికత్తియలమొత్తంబులుం దానును నారాచపూబోఁడి వాఁడిచూపుల నాఁడుపోఁడిమి నెఱపుచు దైవయోగంబున సోమసుతుండును భగవంతుండును నగుబుధునియాశ్రమంబు సేరి మెలంగు చున్నయెడ. 25

ఆ. రాజుకొడుకుఁ జూచె రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి
దొంగకాముఁ డంతదొందడిఁ జిగురాకు,వాలు వెఱికి యుఱికి వారి మోఁదె.

వ. ఇట్లు పూవుంగైదువులు గలనెఱబిరుదుచిగురుటడిదంబు మొనకు నోహటించి వార లిరువురుం బైపడి వేడుకలకుం జొచ్చిన వారలకుం బురూరవుం డను కుమారుండు పుట్టె నివ్విధంబున. 27

---

1 'చేరె నవ్వేళ శంభుండు శివయుఁ దాను, నంతఁ గ్రీడింపఁ జొచ్చినయంతమాత్ర, నాఁట దయ్యెను'—వ్రా. ప్ర. 2 నగుచు. 3 నిట్టి దే మెఱుంగ. 4 ఈనే లెవ్వఁడు.

ఆ. మనుసుతుండు ఘనుఁడు మగనాలితనమునఁ, గొడుకుఁ గాంచి విసివి కుంది కుంది
చింతఁ బొంది గురు వసిష్ఠుని భావించె, నతనితలఁపుతోన యతఁడు వచ్చె.

వ. వచ్చి సుద్యుమ్నుండు మగవాఁ డగుకొఱకు నమ్మునిపుంగవుండు శంకరు నారాధింప నీశ్వరుండును దపసిప్రయాసంబునకు మెచ్చి యి ట్లనియె. 29

మ. తన ము న్నాడినమాటయున్ నిజముగాఁ దన్మానికిం బ్రీతిగా
[1]మనుజుండున్ నెల వో నెలం బురుషుఁ డై మాసాంతరం బైనఁ గా
మిని యై యీగతి వీడుపా టమర భూమిం దాన రక్షించుఁ బొ
మ్మనినన్ వచ్చె వసిష్ఠుఁ డామనుసుతుం డారీతి రాజ్యస్థుఁ డై. 30

ఆ. మగువ యగుచు మరల మగవాఁడు నగుచును, నవనిఁ గొంతకాల మాతఁ డేలెఁ
బ్రజలు సంతసింప బాహాబలముతోడ, గురునికరుణఁ జేసి కువలయేశ. 31

వ. ఆతనికి నుత్కలుండును గయుండును విమలుండును ననుకొడుకులు మువ్వురు గలిగి ధర్మపరు లై యుత్తరాపథంబునకు రాజు లయిరి సుద్యుమ్నుండు ముదుసలి యై ప్రతిష్ఠానపురంబు విడిచి పురూరవునకు భూమి యిచ్చి వనంబునకుం జనియె నివ్విధంబున. 32

సీ. కొడుకుసుద్యుమ్నుండు ఘోరాటవుల కేఁగ, వందుచు మనువు వైవస్వతుండు
దనకు బిడ్డలు గల్గఁ దప మాచరించెను, హరిఁ గూర్చి నూఱేండ్లు యమునలోన
హరియును నిక్ష్వాకుఁ డాదిగాఁ బదురు పుత్త్రుల నిచ్చె మనువుతోఁ దొరయువారి
నందులోనఁ బృషధ్రుఁ డను వాఁడు గురునాజ్ఞ, విమలధర్మంబుగా వెలయఁ బూని

తే. పసులకదుపులఁ గాచుచు బలుమొగిళ్లు, వచ్చి నడురేయి బోరునఁ వాన గురియ
మందవిడియించి చుట్టు నేమఱక యుండె, నడవిమెకములు సొరకుండ నరసికొనుచు.

వ. (అంత.) 34

క. ప్రబ్బికొనిన పంజీఁకటి, నిబ్బరముగ నడిఁకి నడిఁకి నింగికి వడితోఁ
గొబ్బున నెగసి తటాలున, బెబ్బులి మందావుఁ బట్టెఁ [2]బెలుకుఱి యఱవన్.

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును లేచి విచ్చలవిడితోఁ
జెల్లాచెద రై పాఱెను, బెల్లుగ నంభా యటంచు బెబ్బులిగాలిన్. 36

వ. అయ్యవసరంబున. 37

శా. ఆపెంజీఁకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూల మం
చాపుల్లావుశిరంబుఁ ద్రుంచి తెగదో యంచుం బులిన్ వెండియున్
వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖడ్గరక్తంబు చేఁ
బై పై గీఱుచు వచ్చి చూచెఁ దల ద్రెవ్వంబడ్డయద్ధేనువున్. 38

వ. చూచి దుఃఖితుం డై యున్నపృషధ్రునిం గని కులగురుం (డగువసిష్ఠుండు) కోపించి నీవు రాజత్వంబునకుఁ బాసి యీయపరాధంబున శూద్రుండవు గ మ్మని

1. 'మనుజేంద్రుండు నెలన్ నెలం' అ. ప్ర. 2. 'బెంబడి నఱవన్' వ్రా. ప్ర.

శపియించె నతండును గృతాంజలి యై తనకులాచార్యునివలన మరలం గైకోలు వడసి యతనియనుమతంబున. 39

సీ. అఖిలాత్ముఁ డగు చున్న హరియందుఁ బరునందు, భక్తితోఁ జాలఁ దత్పరతఁ జేసి
యూర్ధ్వరేతస్కుఁ డై యున్న ప్రాణుల కెల్ల, నాప్తుఁ డై సర్వేంద్రియములు గెల్చి
సంగంబునకుఁ బాసి శాంతుఁ డై యపరిగ్రహుండు నై కోరక యుండి తనకు
వచ్చినయదియ జీవనము గావించుచుఁ, దనుఁ దాన నిలుపుచు ధన్యబుద్ధి

తే. జడుని తెఱఁగున నంధుని చందమునను
జెవిటిభంగిని మహి నెల్లఁ జెల్లఁ దిరిగి
యడవులకు నేఁగి కార్చిచ్చునందుఁ జొచ్చి
చిక్కి నియతుఁ డై బ్రహ్మంబుఁ జెందె నతఁడు. 40

క. కవి యనుకడపటికొమరుఁడు, భవనము రాజ్యంబు విడిచి బంధులతో నేఁ
గి వనమునఁ బరమపురుషునిఁ, బ్రవిమలమతిఁ దలఁచితలఁచి పరముం బొందెన్.

వ. మఱియుఁ గరూశుం డనుమానవునివలనం గొందఱు కారూశులు క్షత్రియులు గలిగి ధర్మంబుతోడఁ బ్రియంబున బ్రహ్మణ్యు లై యుత్తరాపథంబునకు రాజు లైరి ధృష్టునివలన ధార్ష్టం బనువంశంబు గలిగి భూతలంబున బ్రాహ్మణం బై నెగడె నృగునివంశంబున సుమతి పుట్టె నతనికి భూతజ్యోతి పుట్టె నతనికి వసువు జనించె వసువునకుం బ్రతీకుండు గలిగెఁ బ్రతీకునికి నోఘవంతుండు జనించె నతని కూఁతు నోఘవతి యనుదాని సుదర్శనుండు వివాహం బయ్యె నరిష్యంతుం డనుమనుపుత్రునికిఁ జిత్రసేనుం డావిభునకు దక్షుం డాపుణ్యునకు మీఢ్వాంసుం డాసుజనునికి శర్యం డమ్మహాత్మునికి నింద్రసేనుం డారాజునకు వీతిహోత్రుం డాసుమతికి సత్యశ్రవుం డాఘనునికి నురుశ్రవుం డావీరునకు దేవదత్తుం డాపండితునకు నగ్నివేశుండు సుతు లయి జనియించి రయ్యగ్నివేశుండు గానీనుం డన నెగడి జాతకర్ణుం డనుమహర్షి యై వెలసె నతనివలన నాగ్నివేశ్యాయనంబు నాఁ బరఁగు బ్రహ్మకులంబు గలిగె నివ్విధంబున. 42

క. తెలుపఁబడె నరిష్యంతుని, కుల మెల్లను నీకు దిష్టకులమును వరుసం
దెలిపెద రాజేంద్రోత్తమ, తెలియుము సర్వంబు నీకుఁ దేటపడంగన్. 43

వ. దిష్టునికొడుకు నాభాగుం డనువాఁడు కర్మవశంబున వైశ్యత్వంబు నొందె నానాభాగునికి హలంధనుండు గలిగె నతనికి వత్సప్రీతియు వత్సప్రీతికిఁ బ్రాంశువు నతనికిఁ బ్రమతియుఁ బ్రమతికి ఖమిత్రుండు ఖమిత్రునికిఁ జాక్షుషుండు నతనికి వివింశతియు వివింశతికి రంభుండు రంభునికి ధార్మికుం డైనఖనినేత్రుండు నతనికిఁ గరంధనుండుఁ గరంధనున కవిక్షిత్తు నాయవిక్షిత్తునకు మరుత్తుండు జనియించి రామరుత్తుండు చక్రవర్తి యయ్యె నతనిచరిత్రంబు వినుము. 44

సీ. [1]అంగిరస్సుతుఁడు మ§హాయోగి సంవర్తుఁ, డతనియాగమునకు § యాజకుండు
దిరిగి యుండెడివారు § మరుదాఖ్యగణము లొ, ప్పారువిశ్వేదేవు § లచటిసభ్యు
లధికదక్షిణల బ్రా§హ్మణకోటిఁ దనిపెను, సోమపానంబున § సురవరుండు
మత్తిల్లి బంగారు§మయము గావించెను, యాగవస్తువు లెల్ల § నధికనియతి
తే. నామరుత్తుఁడు సేసిన§యట్టిభంగి, ధీరభావంబుఁ జాగంబుఁ§దెంపుఁ గలిగి
మఖముసేసినవారిని § మఱియు నెఱుఁగ, మెల్లలోకములందు న§రేంద్రముఖ్య.

వ. ఆమరుత్తునకు దముండును దమునకు రాజవర్ధనుండును రాజవర్ధనునకు సుధృతియు సుధృతికి సౌధృతేయుండును సౌధృతేయునకు గేవలుండును గేవలునకు బంధుమంతుండును నతనికి వేదవంతుండును వేదవంతునికి బంధుండును బంధునకు దృణబిందుండును సంభవించి రంత. 46

క. అచ్చరకన్య యలంబుస, గ్రచ్చుఱఁ దృణబిందుఁ జూచి § కామించి తుదిం
బచ్చవిలుతుపువుటమ్ముల, ముచ్చిచ్చున వెచ్చి పొందె § మోహాతుర యై. 47

వ. ఆదంపతులకు నిలబిల యనుకూఁతురు జన్మించె నాకొమ్మను విశ్రవసుండు వొందిన నైలబిలుం డనం గుబేరుండు పుట్టె మఱియు నాతృణబిందునకు విశాలుండును శూన్యబంధుండును ధూమ్రకేతుండును నను వారు మువ్వురుగొడుకులు గలిగి రందు విశాలుండు వంశవర్ధనుం డై వైశాలి యనునగరంబు నిర్మించె నారాజునకు హేమచంద్రుం డానరేంద్రునకు ధూమ్రాక్షుం డాపుడమిఱేనికి సహదేవుం డాబలిష్ఠునకుఁ గృశాశ్వుం డతనికి సోమదత్తుండు జనించె నతండు. 48

ఆ. అమరవిభుఁడు మెచ్చ § నశ్వమేధము సేసి, భూరిపుణ్యగతికిఁ § బోయె నెలమి
సోమదత్తుకొడుకు § సుమతికి జనమేజ, యుం డనంగఁ గొమరుఁ § డుప్పతిల్లె. 49

వ. వీరలు వైశాలురనం బరఁగి తృణబిందునికీర్తి వహించి రాజ్యంబుసేసిరి మఱియును.

సీ. శర్యాతి యనురాజు § జనియించె బ్రహ్మపరుం[2]డై నమనువుకు § రూఢితోడ
నతఁ డంగిరునిసత్త్ర§మందు రెండవనాఁటి, విహితకర్మము లెల్ల § వెలయఁ జెప్పె
నతనికూఁతురు సుక§న్యక యనుపేరిటి, వనజాక్షి తండ్రితో § వనము కేఁగి
చ్యవనాశ్రమముఁ జేరి § సఖులును దానును, ఫలపుష్పములు గోయఁ§బాఱఁదిరిగి
ఆ. యొక్కపుట్టలోన § నొప్పారుజోతుల, రెంటిఁ గాంచి వాఁడి§ముంటఁ బొడిచెఁ
గన్య ముగుద మఱచి § ఖద్యోతయుగ మంచు, దైవవశముకతనఁ§దమకియగుచు.

క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతుల నెత్తురులు గురిసె § వసుధేశభట
వ్రాతముల కెల్ల నచ్చట, నాతఱి మలమూత్రబంధ § మయ్యె నరేంద్రా. 52

వ. వారలం జూచి రాజర్షి యగుశర్యాతి విస్మితుం డై మీర లియ్యాశ్రమంబున నకృత్యంబు సేయ నోపుదు రది కారణంబు గా మీ కీనిరోధంబు సిద్ధించె నని పలుకునవసరంబునఁ దండ్రికి సుకన్య కయి ట్లనియె. 53

---

1. ఆంగీరసుండు. 2 డు నై మన్నన రూఢి. వ్రా. ప్ర.

తే. అయ్యొ యీపుట్టచేరువ § నాడి యాడి, యిందులో రెండుజోతుల § నేను గాంచి
కంటకంబునఁబొడువ ర § క్తంబు గురిసె, నేవిధంబునఁ గురిసెనో § యెఱుఁగుమీవు.

వ. అనిన విని శర్యాతి భీతుండై కూఁతుం దోడ్కొని వల్మీకంబుకడకుం జని యందు లోఁ దపంబు సేయు చున్నచ్యవనమునిం గని తన నేర్పున నతనివలనఁ బ్రసన్నత వడసి తపసిచిత్తంబు నెఱింగి తనపుత్త్రిక నిచ్చి యెట్టకేలకుఁ బ్రదికినవాఁడై మునీశ్వరుని వీడ్కొని పురంబునకుం జనియె నంత. 55

ఆ. పరమకోపుఁ డయిన § భార్గవుఁ బతిఁ జేరి, మిగులఁ బనులయెడల § మెచ్చఁ దిరిగి
యతనిపర్ణశాల § నాసుకన్యక యను, మగువ గొన్నియేండ్లు § మనువు మనియె.

వ. అంత నొక్కనాఁ డయ్యాశ్రమంబునకు వేల్పువెజ్జు లైననాసత్యు లిద్దఱు వచ్చిన వారలం బూజించి తనముదిమి సూపి చ్యవనుం డిట్లనియె మీకు మున్న యాగ భాగంబుల లేనిసోమపానంబు నేను గల్పించి యిచ్చెద సోమపానసమయంబునఁ బానపాత్రంబు మీకు నందిచ్చెద నాముదిమి మానుపుం డని యి ట్లనియె. 57

క. నవకం బగుప్రాయంబున, జవరాండ్రఁ గరంగఁ జేయు § చక్కఁదనంబున్
శివకరముగఁ గృప సేయుఁడు. దివిజాధిపవైద్యులార § దీవింతు మిమున్. 58

వ. అనిన [1]శ్వీదేవతలు సంతోషించి సిద్ధనిర్మితం బయినయామడుఁగున మునుఁగు మని పలికి. 59

సీ. ముసలితాపసుఁ బట్టి § మొగి నెత్తుకొని పోయి, ముగురునామడుఁగున § మునిఁగి లేచి
వనితాజనుల నెల్ల § వలపించువార లై, సుందరమూర్తు లై § సుభగు లగుచుఁ
గమలమాలికలతోఁ § గనకకుండలముల, తో మంచిచీరల § తోడఁ దుల్యు
లై సూర్యతేజస్కు § లై యున్నవారల, ముప్పురఁ బొడగాంచి § ముగుద బాల

తే. యిందుఁ బెనిమిటి వీఁ డని § యెఱుఁగ లేక, గరిత గావున నిజనాథుఁ § గానఁ గోరి
సుభగమతులార నానాథుఁ § జూపుఁ డనుచు, [1]శ్వీదేవతలకప్పు డ § య్యబల మ్రొక్కె.

వ. వార లాపతివ్రత [2]నిజమరితనంబునకు మెచ్చి వయోరూపసంపన్నుం డయిన చ్యవనుం జూపి దంపతుల వీడ్కొని విమానారూఢు లై వేలుపులప్రోలికిం జనిరంత.

సీ. యాగంబు సేయంగ § నర్థించి శర్యాతి, చ్యవనమునీంద్రు నా § శ్రమముకడకుఁ
గూఁతు నల్లునిఁ దోడు § కొని పోవువేడుక, వచ్చి పుత్త్రికకుఁ బా § ర్శ్వంబునందు
సూర్యతేజంబున § సొంపారువరుఁ గని, వీఁ డెవ్వఁడో దీని § విభుఁడు గాఁడు
చెల్లరే యని పుత్త్రి § సేసినప్రియములు, మ్రొక్కులు నొల్లక § మోము వాంచి

తే. మాఱుమాటాడ దీవింప § మనసు రోసి, చ్యవనుఁ డధికుండు మునిజన § సత్తముండు
భువనసన్నుతుఁ డతఁ డెందుఁ § బోయె నాతఁ, డెట్లు వంచింపఁబడియె వీఁ § డెవ్వఁ డబల.

మ. తగవే ధర్మమె శీలమే కులజవై § తప్పన్ వినోదింప నా
జగదారాధ్యునిఁ బుణ్యశీలుఁ దపసిన్ § సాధ్వీమనస్సమ్మతున్

1 'నశ్వినీదేవతల కయ్యబల. 2 నిజగరితతనంబునకు' వ్రా. ప్ర.

మగనిఁ మాని భుజంగుఁ బొందఁ దగునే మానంబు వాటింపఁగాఁ
దగదే దుర్గతిఁ ద్రోచితే కఠిన వై తండ్రిం బతిం గూఁతురా. 63

ఆ. ప్రమదనయన మగఁడు ప్రాయంపువాఁ డైనఁ, గాపువెట్టి కొంతఁ గావ నేర్చుఁ
[1]గడఁగి ముసలితపసి గావంగ నేర్చునే, యువతి ముదుకఁ గూర్పనొప్పదెందు.

వ. అని పలికిన నప్పరమపతివ్రతాలలామంబు చిఱునగవు సెక్కుటద్దంబులఁ జిడిముడి
పడఁ దండ్రి కిట్లనియె. 65

క. నీయల్లుఁ డితఁడు భార్గవుఁ, డయ్యా జారుండు గాఁడు హర్షముతోడన్
నెయ్యంబు సల్పు మంచును, దొయ్యలి సర్వంబుఁ దండ్రితో వినిపించెన్. 66

వ. అంత శర్యాతియు నప్రమత్తుం డై కూఁతుం గౌఁగిలించుకొని గారవంబున నయి
దువవు గమ్మని దీవించె (నంత భార్యాసహితుం డై) చ్యవనుండు (నని) తనమా
మకు యాగంబు సేయించి యొక్కపాత్రంబున సోమభాగంబుఁ బట్టి నిజతపో
బలంబున నశ్వి దేవతల కర్పించినం జూచి. 67

క. కోపముతోడను వాసవుఁ, డేపున ముని వైవ వజ్ర మెత్తిన మరలం
దాపసుఁడు వజ్రిభుజమున, నాపవి నిలిపెఁ జగంబు లాశ్చర్యపడన్. 68

వ. ఇవ్విధంబున నశ్వి దేవత లిద్దఱు వైద్యు లై సోమభాగంబు లేనివా రయ్యుఁ జ్య
వనుసామర్థ్యంబునఁ బ్రాప్తభాగు లయి చనిరి శర్యాతికి నుత్తానబర్హియు నాన
ర్తుండును భూరిషేణుండు నను మువ్వురు గొడుకులు గలిగి రందు. 69

సీ. ఆనర్తునకు రైవతాహ్వయుం డుదయించె, నతఁడు కుశస్థలి యనుపురంబు
నీరధిలోపల నిర్మించి యందులో, నానర్తముఖవిషయంబు లేలెఁ
గనియెఁ గకుద్మిముఖ్యం బైననందన, శతము రైవతుఁడు విశాలయశుఁడు
దనకూఁతు రేవతి ధాత ముందటఁ బెట్టి, తగువరు నడిగెడితలఁపుతోడఁ

తే. గన్య దోడ్కొని బ్రహ్మలోకమున కేఁగి, యచట గంధర్వకిన్నరు లజునిమ్రోల
నాటపాటలుసలుపఁగ నవసరంబు, గాక నిలుచుండె నతఁ డొక్కక్షణముతడవు.

వ. అంత నవసరం బయిన నజునికి నమస్కరించి రైవతుండు రేవతిం జూపి యిట్లనియె.

ఆ. చాల ముద్దరాలు జవరాలుఁ గోమరాలు, నీశుభాత్మురాలి కెవ్వఁ డొక్కొ
మగఁడు సెప్పు మనిన మదిఁ జూచి పకపక, నవ్వి భూమిపతికి నలువ వలికె.

సీ. మనుజేశ దీని కై మదిలోనఁ దలఁచిన, వార లెల్లను గాలవశతఁ జనిరి
వారలబిడ్డల వారలమనుమల, వారలగోత్రంబువారి నైన
వినము మేదినిలోన వెలయ నీవచ్చిన, యీలోన నిరువదియేడుమాఱు
లొండొండ నాలుగుయుగములుఁ జనియె నీ, వటుగాన ధరణికినరుగు మిపుడు

తే. దేవదేవుండు హరి బలదేవుఁ డనఁగ, భూమిభారంబు వారింపఁ బుట్టినాఁడు
సకలభూతాత్మకుఁడు నిజాంశంబుతోడ, యువతిమణి నిమ్ము జనమణి కున్నతాత్మ.

---

1 'గపతిముసలి' వ్రా. ప్ర.

వ. అని యానతిచ్చిన బ్రహ్మకు నమస్కరించి భూలోకంబునకుం (జనుదెంచి) సోదర స్వజనహీనం బగుతననగరంబున కారాజు వచ్చి బలభద్రుం గాంచి రేవతీకన్య నతని కిచ్చి నారాయణాశ్రమం బగుబదరికావనంబునకు నియమంబునం దపంబు సేయం జనియె. 74

క. నభగుం డనుమానవునకును, శుభమతి నాభాగుం డనంగ సుతుం డుదయించెం
బ్రభు లై కవి యనుతలంపున, విభజించిరి భ్రాత లతనికీవీకేఁడిధనముల్. 75

వ. అంత నాభాగుండు బ్రహ్మచారి యై తనతోడంబుట్టువులను ధనంబుపా లడిగిన వారలు దండ్రి చెప్పినక్రమంబున నిచ్చెద మనిన నాభాగుండు తండ్రి యగునభగు కడకుం జని విభాగంబు సేయు మని పలికిన నతం డిందు నంగిరసులు మేధ గలవార లయ్యును సత్త్రయాగంబు సేయుచు నాఱవదినంబున సర్వకర్మంబులు దోఁపక మూఢు లయ్యెదరు వారలకు నీవు వైశ్వదేవసూక్తంబులు రెం డెఱింగించినం గవి యనం బ్రసిద్ధి కెక్కెదవు దానం జేసి వారు కృతకృత్యు లై స్వర్గంబునకుం బోవుచు సత్త్రపరిశేషం బైనధనంబు నీ కిచ్చెద రని పలికినం దండ్రి వీడ్కొని నాభాగుండు సని యట్లు సేసిన నంగిరసులు సత్త్రపరిశేషధనంబు లతని కిచ్చి నాకంబునకుం జని రంత. 76

క. అంగిరసు లిచ్చుపైఁడికి, మంగళమతిఁ జేరునృపుని మానిచి యొకఁ డు
త్తుంగుఁడు [1]కృష్ణాంగుఁడు దగ, ముంగల నిలుచుండి విత్తము జేకొనియెన్.

వ. వానిం జూచి మానవుండు దనకు మును లిచ్చుటం జేసి తనధనం బని పలికిన నమ్మహాపురుషుండు మీతండ్రి సెప్పినక్రమం బకర్తవ్యం బనిన నాభాగుండు నభగు నడిగిన నతండు యజ్ఞమందిరగతం బై యుచ్ఛిష్టం బగుధనంబు ద్రొల్లి మునులు రుద్రున కిచ్చి రది గారణంబుగా నాదేవుండు సర్వధనంబునకు స్వామిం డనిన విని వచ్చి మానవుండు మహాదేవునకు నమస్కరించి దేవా యీధనంబు నీయధీనం బని మాతండ్రి నాకుం జెప్పె నే నపరాధంబు సేసితి సహింపు మనవుడు భక్తవత్సలుం డగునమ్మహాపురుషుండు నభగుసత్యవచనంబునకు నాభాగునినిజంబునకు మెచ్చి నీవు దప్పక పలికితివి కావున సత్త్రపరిశేషం బగు ధనంబు నీకు నిచ్చితి నని పలికి యంతర్దర్శిత్వంబును సనాతనం బగు బ్రహ్మజ్ఞానంబును నుపదేశించి తిరోహితుం డయ్యె నివ్విధంబున. 78

క. భువిలో నాభాగునికథ, తవిలి మతిన్ రేపు మాపుఁ దలఁచినమాత్రిం
గవి యగు మంత్రజ్ఞుం డగుఁ, బ్రవిమలగతిఁ బొందు నరుఁడు భద్రాత్మకుఁ డై.

వ. అంత నాభాగునకు నంబరీషుండు జనియించె నతనియందు జగదప్రతిహతం బైన బ్రాహ్మణశాపంబు నిరర్థకం బయ్యె ననిన విని యేమికారణంబున దురంతం బైన బ్రహ్మదండంబువలన నతండు విడువంబడియె ననిన నప్పుడమితేనికి శుకుం డిట్లనియె.

1 'జలదనిభాంగుఁడు' వ్రా. ప్ర.

### అంబరీషోపాఖ్యానము.

శా. సప్తద్వీపవిశాలభూభరము దోస్స్తంభంబునం బూన్చి సం
ప్రాప్తశ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురిం గల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనలమేరం గాలముం బుచ్చుచున్
సుప్తిం బొందక యొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుం డిలన్. 81

సీ. చిత్తంబు మధురిపుశ్రీపాదములయంద, పలుకులు హరిగుణపఠనమంద
కరములు విష్ణుమందిరమార్జనములంద, చెవులు మాధవకథాశ్రవణమంద
చూపులు గోవిందరూపవీక్షణమంద, శిరము కేశవనమస్కృతులయంద
పదము లీశ్వరగేహపరిసర్పణములంద, కామంబు చక్రికైంకర్యమంద

తే. సంగ మచ్యుతజనతనుసంగమంద, ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద
రసన తులసీదళములంద రతులుపుణ్య,సంగతులయంద యారాజచంద్రమునకు.

వ. మఱియు నమ్మహీవిభుండు. 83

సీ. ఘనవైభవంబునఁ గల్మషదూరుఁడై, యజ్ఞేశు నీశు నజ్ఞాత్ముఁ గూర్చి
మొనసి వసిష్ఠాదిమునివల్లభులతోడఁ, దగిలి సరస్వతీతటమునందు
మేధతో బహువాజిమేధంబు లొనరించె, గణుతింప రానిదక్షిణలు వెట్టి
సమలోష్టహేముఁడై సర్వకర్మంబులు, హరిపరంబులుగాఁగ నవని యేలె

ఆ. విష్ణుభక్తులందు విష్ణువునందుఁ గ,లంక యెడల మనసు లంకె వెట్టి
విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై, యతఁడు రాచతపసి యనఁగ నొప్పె.

వ. వెండియు నమ్మహాభాగవతుండు. 85

క. హరి యని సంభావించును, హరి యని దర్శించు నంటు నాఘ్రాణించున్
హరి యని రుచిగొనఁ దలఁచును,హరి హరిఘను నంబరీషు నలవియె పొగడన్.

వ. ఇట్లు పుణ్యచిత్తుండు నీశ్వరాయత్తుండునై యధికరాజ్యంబు సేయుచున్నసమ
యంబున. 87

ఆ. అతని కిహ మానె హరులందుఁ గరులందు, ధనములందుఁ గేలివనములందుఁ
బుత్త్రులందు బంధుమిత్త్రులయందును, బురమునందు నంతిపురమునందు. 88

వ. అంతఁ గొంతకాలంబున కమ్మేదినీకాంతుండు సంసారంబువలనితగులంబు విడిచి
నిర్మలుండై యేకాంతంబున భక్తిపరవశుం డయి యుండ నారాచతపసికి భక్త
లోకవత్సలుం డగుపురుషోత్తముండు ప్రతిభటశిక్షణంబును నిజజనరక్షణంబును
నిఖిలజగదవక్రంబును నగుచక్రంబు నిచ్చి చనియె నంత. 89

క. తనతోడినీడకైవడి, ననురూపగుణాఢ్యయైనయాత్మమహిషితో
జనవిభుఁడు ద్వాదశీవ్రత, మొనరఁగ హరిఁ గూర్చి చేసె నొకయేఁ డధిపా.

వ. ఇట్లు వ్రతంబు సేసి యావ్రతాంతంబునం గార్తికమాసంబున మూఁడురాత్రు
లుపవసించి కాళిందీజలంబుల స్నాతుం డయి మధువనంబున మహాభిషేకవి

రాజసింహాసనంబునం గూర్చుండి యతని మన్నించి కౌసల్యకుఁ బ్రియంబు సే
యుచు (జగత్ప్రాజ్యంబుగ) రాజ్యంబు సేయుచుండె నప్పుడు. 332

సీ. కలఁగు టెల్లను మానెఁ | జలధు లేడింటికి, జలనంబు మానె భూ|చక్రమునకు
జాగరూకత మానె | జలజలోచనునకు, దీనభావము మానె | దిక్పతులకు
మాసి యుండుట మానె | మార్తాండవిధులకుఁ, గావిరి మానె ది|క్తటములకును
నుడికి పోవుట మానె | నుర్వీరుహంబుల, కడఁగుట మానెఁ ద్రే|తాగ్నులకును
ఆ. గడిఁది వ్రేఁగు మానెఁ | గరిగిరికిటినాగ, కమఠములకుఁ బ్రజల|కలఁక మానె
రామచంద్రవిభుఁడు | రాజేంద్రరత్నంబు, ధరణిభరణరేఖఁ | దాల్చునపుడు.

వ. మఱియును. 334

సీ. పోలఁతుల వాలుఁజూ|పులయంద చాంచల్య, మబలలనడుముల|యంద లేమి
కాంతాలకములంద | కౌటిల్యసంచార, మతివలనడపుల|యంద జడిమ
ముగుదలపరిరంభ|ములయంద పీడన, మంగనాకుచముల|యంద పోరు
పడఁతులరతులంద | బంధసద్భావంబు, సతులఁ గాయుటలంద | సంజ్వరంబు
తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల | బెరసి తాఁపు
లంద చౌర్యంబు వల్లభు | లాత్మసతుల
నాఁగి క్రొమ్ముళ్లు వట్టులం | దక్రమంబు
రఘువరేణ్యుఁడు పాలించు | రాజ్యమందు. 335

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు, తండ్రుల మఱపించి ప్రజలఁ | దా రక్షింపం
దండ్రుల నంగలు మఱచిరి, తండ్రి గదా రామధరణి|నాథుం డనుచున్.

వ. మఱియు నారామచంద్రుండు రాజర్షిచరితుండును నిజధర్మనిరతుండును నేక
పత్నీవ్రతుండును సర్వలోకసమ్మతుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ
గోరిక లనుభవించుచుఁ ద్రేతాయుగం బైనఁ గృతయుగధర్మంబుఁ గావించుచు
బాలమరణంబు (మొదలగునరిష్టంబులు ప్రజలకుఁ) గలుగకుండ రాజ్యంబు
సేయుచుండె నయ్యెడ. 337

ఆ. సిగ్గు వడుట గల్గి | సింగారమును గల్గి, భక్తి గల్గి చాల | భయముఁ గలిగి
నయముఁ బ్రియముఁ గల్గి | నరనాథుచిత్తంబు, సీత దనకు వశము|సేసికొనియె.

వ. అనిన విని రాజిట్లనియె. 339

ఆ. భా[illegible] జనులయందు | బంధువులందును, బ్రజలయందు రాజ|భావ మొంది
యొ[illegible] [illegible] రాఘు|వేశ్వరుం డీశ్వరుఁ, గూర్చి క్రతువు లేల | గోరి చేసె. 340

వ. అ[illegible] [illegible] నియె. 341

సీ. భగవ[illegible] [illegible] ామ|భద్రుండు ప్రీతితో, దేవోత్తముని సర్వ|దేవమయునిఁ
జన[illegible] [illegible] య|ధ్వరములు సేసెను, హోతకుఁ దూరుపు | నుత్తరంబు
సా[illegible] [illegible] శమనదిగ్భాగంబు, బ్రహ్మకుఁ గ్రమమునఁ | బడమరెల్ల

నధ్వర్యునకు శేష మాచార్యునకు నిచ్చి, సొమ్ములఁ బంచి భూసురుల కొసఁగి
తే. తనదు రెండుపుట్టంబులుఁ దనకు నయిన, మెలఁత మంగళసూత్రంబు మినుకుఁ దక్క
వినతుఁడై యుండె నారాము వితరణంబు, పాండవోత్తమ యే మని పలుకవచ్చు.
వ. అంత నారామచంద్రుని దానశీలత్వంబునకు మెచ్చి విప్రవరులు దమతమభూములు మరల నిచ్చి యి ట్లనిరి. 343
ఆ. ధరణి వలదు మాకుఁ దపసుల కేల నీ, వఖిలలోకగురుఁడ వైన హరివి
మామనంబులందు మలయుచీఁకటిఁ గాపు, భవదుదారగుచులఁ బార్థివేంద్ర.
వ. అని పలికి బ్రహ్మణ్యదేవుం డైన రామచంద్రుని వినయోక్తులం బూజించి మునులు సని రిట్లు పెద్దకాలంబు రాజ్యంబు సేసి రాఘవేంద్రుం డొక్కదినంబున.
సీ. వసుధపైఁ బుట్టెడు వార్త లాకర్ణించు,కొఱకు నై రాముండు గూఢవృత్తి
నడురేయి దిరుగుచో నాగరజనులలో, నొక్కఁడు దనసతి యొప్ప కున్న
నొరునింటఁ గాఁపుర ముున్నచంచలురాలిఁ, బాయంగ లేక చేపట్టె నేమి
తా వెఱ్ఱి యగు రామధరణీశ్వరుండనే, బేల పొమ్మనుమాట బిట్టు వలుక
ఆ. నాలకించి మఱియు నామాట చారుల,వలన జగములోనఁ గలుగఁ దెలిసి
సీత నిద్రవోవఁ జెప్పక వాల్మీకి,పర్ణశాలఁ బెట్టఁ బనిచె రాత్రి. 346
వ. అంత సీతయు గర్భిణి గావునఁ గుశలవు లనియెడికొడుకులం గనియె వారికి వాల్మీకి జాతకర్మంబు లొనరించె లక్ష్మణునకు నంగదుండును జంద్రకేతుండును భరతునకుఁ దక్షుండును బుష్కలుండును శత్రుఘ్నునకు సుబాహుండును శ్రుతసేనుండును సంభవించి రయ్యెడ. 347
క. బంధురబలుఁ డగు భరతుఁడు, గంధర్వచయంబుఁ ద్రుంచి కనకాదుల స
ద్బంధునకు నన్న కిచ్చెను, బంధువులును మాతృజనులుఁ బ్రజలున్ మెచ్చన్.
ఆ. మధువనంబులోన మధునందనుం డగు, లవణుఁ జంపి భుజబలంబు మెఱసి
మధుపురంబు సేసె మధుభాషి శత్రుఘ్నుఁ, డన్నరామచంద్రుఁ డౌ ననంగ.
వ. అంతఁ గొంతకాలంబునకు రామచంద్రునికొమారు లయినకుశలవు లిద్దఱును వాల్మీకివలన వేదాదివిద్యలయందు నేర్పరు లై పెక్కుసభల [1]సతానంబుగా రామకథాశ్లోకంబులు వాఁడుచు నొక్కనాఁడు రాఘవేంద్రునియజ్ఞశాలకుం జని.
మత్తకోకిలము. వట్టిమ్రాఁకులు పల్లవింప నవారి యై మధుధార -
నుట్టఁ బాడిన నారిపాటకు నుర్వరాధిపుఁడున్ బ్రజల్
బిట్టు సంతస మంది రయ్యెడఁ బ్రీతిఁ గన్నులబాష్పముల్
దొట్ట నొదల లూఁచి వారలతోడిమక్కువ పుట్టఁగాన్. 351
వ. అంత నారామచంద్రుండు కుమారుల కిట్లనియె. 352

1 సుతానకంబుగా,

ఆ. చిన్నియన్నలార । శీతాంశుముఖులార, నళినదళవిశాల।నయనులార
మధురభాషులార । మహిమీఁద నెవ్వరు, దల్లిదండ్రి మీకు । ధన్యులార. 353

వ. అనిన వార లేము వాల్మీకి[1]పౌత్రులము రాఘవేశ్వరునియాగంబు సూడ వచ్చితి మనవుడు మెల్లన నగి యెల్లిప్రొద్దున మీతండ్రి నెఱిఁగెద రుండుం డని యొక్క నివాసంబునకు సత్కరించి పనిచె మఱునాఁడు సీతం దోడ్కొని కుశలవుల ముందట నిడుకొని వాల్మీకి వచ్చి రఘుపుంగవునిం గని (యనేకప్రకారంబుల వినుతించి) యి ట్లనియె. 354

ఆ. సీత [2]ముద్దరాలు । చిత్తవాక్కర్మంబు,లందు సత్యమూర్తి । యమలచరిత
పుణ్యసాధ్వి విడువఁ।బోలదు చేకొను, రవికులాబ్ధిచంద్ర । రామచంద్ర. 355

వ. అని (వాల్మీకి) పలుక రామచంద్రుండు పుత్రార్థి యై విచారింపఁ గుశలవులను వాల్మీకికి నొప్పగించి రామచంద్రచరణధ్యానంబు సేయుచు నిరాశ యై సీత భూవివరంబు సొచ్చె నయ్యెడ. 356

మ. ముదితా నేటికిఁ గ్రుంకి తీవు మనలో । మోహంబు చింతింపవే
వదనాంభోజము సూపవే మృదువు నీ।వాక్యంబు విన్పింపవే
తుది సేయం దగ దంచు నీశ్వరుఁడు నై । దుఃఖించె భూపాలుఁ డా
పద గాదే ప్రియురాలిఁ బాసినతఱిన్ । భావింప నెవ్వారికిన్. 357

వ. అని వగచి రామచంద్రుండు బ్రహ్మచర్యంబు ధరియించి పదుమూఁడువేలయేండ్లెడ తెగకుండ నగ్నిహోత్రంబులు సెల్లించి తా నీశ్వరుండు గావునఁ దన మొదలి నెలవునకుం జనియె నివ్విధంబున. 358

ఆ. ఆదిదేవుఁ డైన।యారామచంద్రుని, కబ్ధి గట్టు టెంత । యసురకోటిఁ
జంపు టెంత కపుల।సాహాయ్య మది యెంత, సురలకొఱకుఁ గ్రీడ । సూపెఁ గాక.

చ. వశుఁడ గ మ్రొక్కెదన్ లవణ।వార్ధివిజృంభణతానివర్తికిన్
దశదిగధీశమౌళిమణి।దర్పణమండితదివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి సు।ధారుచిభాషికి సాధుపోషికిన్
దశరథరాజుపట్టికిని । దైత్యపతిం బొరిగొన్నజెట్టికిన్. 360

ఉ. నల్లనివాఁడు పద్మనయ।నంబులవాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చువాఁడు గడు । విప్పగువక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కినభు।జంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైనరఘు।సత్తముఁ డిచ్చుత మా కభీష్టముల్. 361

ఆ. రామచంద్రుతోడ । రాకలఁ బోకలఁ, గదిసి తిరుగువారుఁ । గన్నవారు
నంటికొన్నవారు । [3]నాకోసలప్రజ, లరిగి రాదియోగు । లరుగుగతికి. 362

---

1 శిష్యులము. 2 'సుద్దరాలు' అ. ప్ర. 3 నాకన్నప్రజలుఁ దా, రరిగి.

క. మంతనములు సద్గతులకుఁ, బొంతనములు ఘనము లైన పుణ్యముల కిదా
నీంతనపూర్వమహాఘుని,కృంతనములు రామనామకృతిచింతనముల్. 363

వ. ఆరామచంద్రునకుఁ గుశుండును గుశునకు నతిథియు నతిథికి నిషధుండును నిషధునకు నభుండును నభునికిఁ బుండరీకుండును బుండరీకునకు క్షేమధన్వుండును క్షేమధన్వునకు దేవానీకుండును దేవానీకునకు నహీనుండును నహీనునకుఁ బారియాత్రుండును బారియాత్రునకు బలుండును బలునకుఁ జలుండును జలునకు నర్కసంభవుం డగువజ్రనాభుండును వజ్రనాభునకు శంఖణుండును శంఖణునకు విధృతియు విధృతికి హిరణ్యనాభుండును జనియించి రతండు జైమినిశిష్యుం డైన యాజ్ఞవల్క్యమునివలన నధ్యాత్మయోగంబు నేర్చి హృదయకలుషంబులం బాసి యోగచర్యుం డయ్యె నాహిరణ్యనాభునకుఁ బుష్యుండును బుష్యునకు ధ్రువసంధియు ధ్రువసంధికి సుదర్శనుండును సుదర్శనునకు నగ్నివర్ణుండును నగ్నివర్ణునకు శీఘ్రుండును శీఘ్రునకు మరు వనురాజశ్రేష్ఠుండును బుట్టి రారాజయోగి సిద్ధుం డయి కలాపగ్రామంబున నున్నవాఁడు కలియుగాంతంబున నష్టం బయ్యెడుసూర్యవంశంబుఁ గ్రమ్మఱఁ బుట్టింపం గలవాఁ డామరువునకుఁ బ్రశుశ్రుకుండును నాప్రశుశ్రుకునకు సంధియు నతనికి నమర్షణుండును నాయమర్షణునికి మహస్వంతుండును నామహస్వంతునకు విశ్వసాహ్వుండును నావిశ్వసాహ్వునకు బృహద్బలుండును జనియించి రాబృహద్బలుఁడు భారతయుద్ధంబున (మీతండ్రి యగు నభిమన్యునిచేత) హతుం డయ్యె వినుము. 364

భవిష్యద్రాజేతిహాసము.

తే. పరఁగ నిక్ష్వాకుఁడును బృహద్బలుఁడు మొదలు
నుదయుఁ గాఁ గలరాజులఁ గోడుతోడ
నెఱుఁగఁ జెప్పితి నీవారి నింక మీఁదఁ
బుట్టఁ గలవారిఁ జెప్పెద భూవరేంద్ర. 365

వ. అబృహద్బలునకు బృహద్రణుండును బృహద్రణునకు నురుక్షతుండును నాతనికి వత్సప్రీతుండును వత్సప్రీతునకుఁ బ్రతివ్యోముండును బ్రతివ్యోమునకు భానుండును భానునకు సహదేవుండును సహదేవునకు బృహదశ్వుఁడును బృహదశ్వునకు భానుమంతుండును భానుమంతునకుఁ బ్రతీకాశ్వుఁడును బ్రతీకాశ్వునకు సుప్రతీకుండును సుప్రతీకునకు మేరుదేవుండును మేరుదేవునకు సుతక్షత్రుండును సుతక్షత్రునకు ఋక్షకుండును ఋక్షకునకు నంతరిక్షుండును నంతరిక్షునకు సుతపుండును సుతపునకు నమిత్రజిత్తును నతనికి బృహద్వాజియు నతనికి బర్హియు బర్హికి ధనంజయుండును ధనంజయునకు రణంజయుండును నతనికి సృంజయుండును సృంజయునకు శాక్యుండును శాక్యునకు శుద్ధాదుండును శుద్ధాదునకు లాంగలుండును లాంగలునకుఁ బ్రసేనజిత్తును నతనికి క్షుద్రకుండును క్షుద్ర

కునకు ఋణకుండును ఋణకునకు సురథుండును సురథునకు సుమిత్రుండును
బుట్టుదురు సుమిత్రునియనంతరకాలంబున సూర్యవంశంబు మఱి సాఁగదు వీరలు
బృహద్బలునినుండి క్రమంబునం బుట్టం గలవార లని చెప్పి శుకుం డిట్లనియె.

సీ. ధన్యుఁ డాయిక్ష్వాకుతనయుఁ డౌనిమి యాఁగ, మాచరింపఁగఁ గోరి యావసిష్ఠు
నార్త్విజ్యమునకుఁ దా నర్థింపఁ గని యాతఁ, డింద్రునిమఖము సేయింప నియ్య
కొనినాఁడ మఱి వత్తుఁ గొదవ లే దన వచ్చి, సంసార మెంతయుఁ జంచలంబు
కాలయాపన మేల క్రతువు సేసెద నని, యన్యఋత్విక్కుల నతఁడు గూర్చి
తే. సేయ నింద్రునిమఖ మంతఁ జెల్లఁ జేసి, గురుఁడు సనుదెంచి శిష్యుపైఁ గోపమెత్తి
యోరి నావచ్చునందాఁక నుండవనుచు, నతని దేహంబు వడుగాత మని శపించె.

వ. ఇట్లు వసిష్ఠుండు శపించిన నిమియును వసిష్ఠుని దేహంబు వడుఁ గాక యని మ
రల శపియింప నవ్వసిష్ఠుండు మిత్రావరుణులవలనఁ గడపట నూర్వశికి జన్మించె
గురుశాపంబున బ్రహ్మజ్ఞాని యైననిమి విగతదేహుం డైన నతని దేహంబు మునీ
శ్వరులు గంధ[1]వస్తువులం బొదివి (దాఁచి) దొరఁకొన్న సత్త్రయాగంబు సెల్లిం
చిరి యాగంబుకడపట దేవగణంబులు మెచ్చి వచ్చిన వారలకు నిమిదేహంబు
సూపి బ్రదుకం జేయుం డనవుడు వారలు నిమిప్రాణంబు వచ్చుం గాక యని
పలికిన నిమి దనదేహంబు సార నొల్లక యి ట్లనియె. 368

మ. అతిమోహాకులితంబు సాంద్రమమతాహంకారమూలంబు సం
తతనానాసుఖదుఃఖపీడితమనిత్యం బిట్టిదేహంబు సం
కృతి నా కేటికి మీనజీవనముభంగిన్ భీతిబాహుళ్య మం
చితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశున్ హరిం గొల్చుచున్. 369

వ. అని పలికిన నిమిమాటలు క్రమ్మఱింప నేరక శరీరులు గన్నులు దెఱచినప్పుడును
మూసినప్పుడును నిమి గాన వచ్చుం గాక యని పల్కి దేవతలు చని రంత.

ఆ. పెద్ద లైనమునులు పృథివీస్థలికి రాజు, లేమిఁ జూచి నిమికళేబరంబు
దరువ నొకడు పుట్టెఁ దనయుండు వానిని, జనకుఁ డనుచుఁ బలికె జగము లెల్ల.

వ. మఱియు నతండు విగతదేహుండు గావున వైదేహుం డనియు మథనజాతుండు
గావున మిథిలుం డనియు ననం బరఁగె నమ్మిథిలునిచేత నిర్మితం బయినది మిథిలా
నగరంబు నాఁ బరఁగె నాజనకునకు నుదావసుండును నుదావసునకు నందివర్ధనుం
డును నందివర్ధనునకు సుకేతుండును సుకేతునకు దేవరాతుండును దేవరాతు
నకు బృహద్రథుండును బుట్టె నాతనికి మహావీర్యుండును నతనికి సుధృతియు
నతనికి ధృష్టకేతుండును నతనికి హర్యశ్వుండును నతనికి మరువును నతనికిఁ బ్రతీం
ధకుండును నతనికిఁ గృతరయుండును నతనికి దేవమీఢుండును నతనికి విధృతుం
డును నతనికి మహాధృతియు నతనికిఁ గీర్తిరాతుండును నతనికి మహారోముండును

1 పుష్పంబులం,

నతనికి స్వర్ణరోముండును నతనికి హ్రస్వరోముండును నతనికి సీరధ్వజుండును బుట్టిరి. 372

ఆ. అతఁడు మఖము సేయ ♦ నవని దున్నింపంగ, లాంగలంబుకొనను ♦ లక్షణాంగి
సీత జాత యయ్యె ♦ సీరధ్వజుం డని, దానఁ జెప్పఁబడియె ♦ ధన్యుఁ డతఁడు.

వ. ఆసీరధ్వజునకుఁ గుశధ్వజుండును గుశధ్వజునకు ధర్మధ్వజుండును ధర్మధ్వజునకుఁ గృతధ్వజ మితధ్వజు లనువా రిద్దఱుఁ బుట్టి రందుఁ గృతధ్వజునకుఁ గేశిధ్వజుం డుదయించె నతండు తన్నుఁ దా నెఱింగెడివిద్యయందు నేర్పరి యయ్యె మితధ్వజునకు ఖాండిక్యుం డనువాఁడు జన్మించి తండ్రివలన నెఱుక గలవాఁడై కర్మతంత్రంబు నేర్చి కేశిధ్వజునివలన భీతుండై యేఁగె ఖాండిక్యునకు భానుమంతుండును భానుమంతునకు శతద్యుమ్నుండును శతద్యుమ్నునికి శుచియు శుచికి సనద్వాజుండు సనద్వాజునకు నూర్ధ్వకేతుండును నూర్ధ్వకేతునకు నజుండును నజునకుఁ గురుజిత్తును గురుజిత్తునకు నరిష్టనేమియు నరిష్టనేమికి శ్రుతాయువును శ్రుతాయువునకుఁ బార్శ్వకుండును బార్శ్వకునకుఁ జిత్రరథుండును జిత్రరథునకు క్షేమాపియు క్షేమాపికి హేమరథుండును హేమరథునకు సత్యరథుండును సత్యరథునకు నుపగురుండును నుపగురునకు నగ్నిదేవుప్రసాదంబున నుపగుర్వుం డును నుపగుర్వునకు సావనుండును సావనునకు సువర్చసుండును గల్గి రతండె సుభూషణుం డని వినంబడు నాసుభూషణునకు జయుండును జయునకు విజయుం డును విజయునకు ధృతుండును ధృతునకు ననఘుండును ననఘునకు వీతిహవ్యుం డును వీతిహవ్యునకు ధృతియు ధృతికి బహుళాశ్వుండును బహుళాశ్వునకుఁ గృతియుఁ గృతికి మహావశియును జన్మించిరి వీరలు మైథిలు లగురాజు లని చెప్పంబడుదురు యోగీశ్వరప్రసాదంబున గృహస్థులై యుండియు బంధనిర్ముక్తులై యాత్మజ్ఞానంబు గలిగి నిరంతరబ్రహ్మానుసంధానంబు సేయుచు నుండుదు రని పలికి శుకయోగీంద్రుం డి ట్లనియె. 374

**చంద్రవంశ్యు లగురాజులయితిహాసము.**

ఆ. చంద్రగార మైన ♦ చంద్రవంశమునందుఁ, జంద్రకీర్తితోడ ♦ జనితులైన
యట్టిపుణ్యమతుల ♦ నైళాదిరాజుల, నింక వినుము మానవేంద్రచంద్ర. 375

సీ. ఒకవేయితలలతో ♦ నుండుజగన్నాథు, బొడ్డుఁదమ్మిని బ్రహ్మ ♦ పుట్టె మొదల
నతనికి గుణముల ♦ నతనిఁ బోలినదక్షుఁ, డగునత్రి సంజాతుఁ ♦ డయ్యె నత్రి
కడగంటిచూడ్కులఁ ♦ గలువలసంగడీఁ, డుదయించి విప్రుల ♦ కోషధులకు
[1]నమరఁ దారాతతి ♦ కజునిపంపున నాథుఁ, డై యుండి రాజసూ ♦ యంబు చేసి

తే. మూఁడులోకములను గెల్చి ♦ మోఱకమునఁ
జని బృహస్పతిపెండ్లాముఁ ♦ జారుమూర్తిఁ

---

1. నంబుగర్భములకు నజుని,

దార నిలు సొచ్చి కొనిపోయి తన్ను గురుఁడు
వేఁడునందాఁక నయ్యింతి విడువఁ డయ్యె. 376

వ. అంత వేల్పులతో రక్కసులకుఁ గయ్యం బయ్యె బృహస్పతితోడి వైరంబున సేసి రాక్షసులుం దానును శుక్రుండు చంద్రునిం జేపట్టి సురాచార్యునిం బోఁ దోలిన హరుండు భూతగణసమేతుం డై [1]తనగురుపుత్త్రుం డైనబృహస్పతిం జేపట్టె దేవేంద్రుండు సురగణంబులుం దానును బృహస్పతికి నడ్డంబు వచ్చె నయ్యవసరంబున బృహస్పతిభార్యానిమిత్తంబున రణంబున సురాసురవినాశం బయ్యె నాలోన బృహస్పతితండ్రి యగునంగిరసుండు సెప్పిన విని బ్రహ్మదేవుం డు వచ్చి చంద్రునిం దిట్టి గర్భిణి యైనతారను మరల నిప్పించినం జూచి బృహ స్పతి దాని కిట్లనియె. 377

ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియ వై వడి ధర్మకీర్తులన్
బొగ్గులు సేసి జారు శశిం బొంది కటా కడు పేల సేసికొం
టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము నిన్
మ్రగ్గఁగఁ జేసెదం జెనఁటి మానవతుల్ నినుఁ జూచి మెత్తు రే. 378

వ. అని కోపించుచుండ నాచెలువకుఁ బసిండిచాయ[2]మేను గలకుఱ్ఱండు పుట్టె వానిం జూచి మోహంబు సేసి బృహస్పతి దనకొడు కనియునుం జంద్రుండు దనకన్నవాఁ డనియును జగడించి రప్పుడు. 379

ఆ. వారివాదు సూచి వారింపఁగా వచ్చి, గోర్వరింప లేక యెల్లమునులు
నమరవరుల నడుగ నావేడుకలకర్త, యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి.

వ. ఆపలుకులు విని సిగ్గుపడి యున్నతారం జూచి చిన్నికొడుకి ట్లనియె. 381

క. ఇలువరుస చెడఁగ బంధులు, దల వంపఁగ మగఁడు రోయఁ దల్లీ కట్టా
వెలి నేల నన్నుఁ గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁడో. 382

వ. అని పలుకుచున్నకొడుకునకు మఱుమాట లాడ నేరక యూరక యున్నతార నేకాంతంబునకుం జీరి (మంతనంబున) బ్రహ్మ యి ట్లనియె. 383

మ. చెలువా నీయెలసిగ్గు వాపి గురుఁడో శీతాంశుఁడో యెవ్వఁ డీ
లలితాకారుఁ గుమారుఁ గన్నయతఁ డేలా దాఁప నీపాటు నీ
తలనే పుట్టెనె వెచ్చనూర్పకుము కాంతల్ గాముకల్ గారె మా
టల నిం దేమియుఁ బోవ దొండొరులతోడం జెప్ప విన్పింపవే. 384

వ. అని పలికిన బ్రహ్మకు నెదురుమాటాడ వెఱచి మంతనంబున నయ్యింతి చంద్రు నికిం గన్నదాన ననవుడు నాబాలకునకు బుధుం డని పేరు వెట్టి చంద్రున కిచ్చి బ్రహ్మ చనియె నంత. 385

ఆ. బుద్ధిమంతుఁ డయినబుధుఁడు పుత్త్రుం డైన, మేను వెంచి రాజు మిన్నుముట్టె

1 యతని నిమిడికొనియె. 2 మేనితో నొక్కకుమారుండు.' వ్రా. ప్ర.

బుద్ధి గలసుతుండు పుట్టినచోఁ దండ్రి, మిన్ను ముట్ట కేల మిన్నకుండు. 386

వ. ఆబుధునకుఁ దొల్లి చెప్పినయిళాకన్యకవలనఁ బురూరవుండు పుట్టె నాపురూరవు(నకుం గల)శౌర్యసౌందర్యగాంభీర్యాదిగుణంబులు నారదునివలన నింద్రసభలోన నూర్వశి విని మిత్రావరుణశాపంబున మనుష్యస్త్రీరూపంబు దాల్చి భూలోకంబునకు వచ్చి యప్పురూరవుముందట నిలువంబడి. 387

తరలము. సరసిజాక్షు మృగేంద్రమధ్యు విశాలవక్షు మహాభుజున్
సురుచిరాననచంద్రమండలశోభితున్ సుకుమారు నా
పురుషవర్యుఁ బురూరవుం గని పువ్వుటంపఱజోదుచేఁ
దొరఁగుక్రొవ్విరితూపులన్ మది దొందడించినభ్రాంతితోన్. 388

వ. ఊర్వశి నిలుచున్నంత. 389

ఉ. భావజుదీమమో మొగులుఁ బాసి వెలుంగుమెఱుంగొ మోహినీ
దేవతయో [1]సభోరమయొ దీనికరగ్రహణంబు లేనిచో
జీవన మేటి కంచు మరుచేఁ జిగురాకడిదమ్ముజిమ్ములం
దా వడఁకెం బురూరవుఁడు దామరపాకుజలంబుకైవడిన్. 390

వ. ఇట్లా రాచపట్టి చెఱకువింటివానిదాడికి నోఁబవడి యొట్టకేలకు నిలుకడఁ దెచ్చికొని సైరణ నచ్చెలువ కిట్లనియె. 391

ఉ. ఎక్కడనుండి రాక మన కిద్దఱకుం దగు నీకు దక్కితిన్
మ్రొక్కెడి వచ్చెనే యలరుములుకులవాఁ డడిదంబుఁ ద్రిప్పె నే
దిక్కునెఱుంగ నోయబల దేహము దేహముఁ గేలుఁ గేల నీ
చెక్కునఁ జెక్కు మోపి తగుచెయ్వుల నన్ను విపన్నుఁ గావవే. 392

వ. అనినం బోఁడిచేడియ యిట్లనియె. 393

మ. ఇవె నాకూర్చుతగళ్లు రెండు గగ నీ వెల్లప్పుడుం గాచె దే
ని వివస్త్రుండవు గాక నాయెడ సదా నీ వుండు దేనిన్ విశే
షవిలాసాధిక నీకు [2]నాఘృతము భక్ష్యం బయ్యెనేనిన్ మనో
జవినోదంబుల నిన్నుఁ దేల్తు నగునే చంద్రాన్వయగ్రామణీ. 394

వ. అని పలికిన వేల్పులవెలయాలిప్రతినమాటల కియ్యకొని తనమనంబున. 395

క. మంచి దఁట రూపునన్ రతి, నంచిత యఁట దేవగణిక యఁట మరుచేతన్
సంచలితచిత్తయై కా,మించిన దఁట యింతకంటె మేలుం గలదే. 396

వ. అని నిశ్చయించుకొని. 397

ఆ. రాజు రాజముఖిని రతిఁ దేల్చె బంగారు,మేడలందుఁ దరులనీడలందు
[3]డోలలందు రత్నశాలలందును దమ్మి,కొలఁకులందు గిరులకొలఁకులందు. 398

వ. అంత నయ్యిద్దఱకుం దగులంబు నెలకొని. 399

---

1 నభోమణియొ. 2.నాఘృతము పక్షం బయ్యె. 3 దోఁటలందు రత్నకూటంబులందును,కొలఁకు,

క. ఒకదిక్కు గాని చనఁబో, రొకచోటను గాని నిలిచి యుండరు దమలో
నొకటియు గాని తలంపరు, నొకనిమిషముఁ బాయ లేరు నువిదయు విభుఁడున్.

క. దయ్యు మెఱుంగుల్ వారల, నెయ్యంబులు మక్కువలును [1]నిజమరితసముల్
[2]వియ్యములును నెడసందిని, బయ్యెదకొం గడ్డ మైనఁ బ్రాణము వెడలున్. 401

వ. ఇట్లూర్వశియుం బురూరవుండు నొండొరువులవలనిమక్కువలు చెక్కులొత్తం బగళ్లు రేలు నెల్లెడల విహరింప నొక్కనాఁడు దేవలోకంబున దేవేంద్రుండు గొలువుండి తనకొలువున నూర్వశి లేకుండుటం జూచి. 402

క. ఇన్నిదినంబులవలె నా, యున్నసభామధ్యవేది యూర్వశి లేమిన్
విన్నఁదనంబున నున్నది, వన్నె దఱిఁగి యున్నపసిఁడివడువున ననుచున్. 403

వ. ఇంద్రుండు గంధర్వులం బనిచిన వారు నడురేయి సని చీఁకటి నూర్వశి పెంచుచున్నమేడికలం బట్టిన నవి రెండును మొఱ వెట్టిన వానిమొఱ విని రతిఖిన్నుండై మేను మఱచి కూరుకు చున్నపురూరవుకౌఁగిట నుండి యూర్వశి యిట్లనియె. 404

మ. అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు ను
న్మదు లై పోయెద రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై
కదలం డీమగపంద కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టెడిం
బ్రదుకుం జాలఁడు నాదుకౌఁగిలియు సంభీతాత్ముఁడై చెల్ల రే. 405

క. [3]పగతురు దొంగలు నేఁపఁగ, మగఁటిమి వాటింప లేక మగతన మెడలన్
మగువలకౌఁగిట నడఁగెడు, మగవాఁడగుకంటె మగఁడు మగు వగు టొప్పున్.

ఆ. అధముఁడైనవాని కాలగుకంటె నత్యధికునింట దాసి యగుట మేలు
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల, యువతిజనుల కూర కుంట లెస్స.

క. [4]ఏటిది నీరాచఱికం, బాఁటది మొఱవెట్టఁ బశువు లాతురపడ నో
యాఁట దని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవముక్రియ నుండెదిదే.

క. వినియు వినవు రణభీరువు, మనుజాధము నిదురపోతు మందుని నకటా
నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే. 409

వ. అని పెక్కుభంగుల నయ్యింతి పరుసనిపలుకు లనుకఱకువాలమ్ములు సెవులఁ జొనుప నారాజశేఖరుం డంకుశంబుపోట్ల నదరుమదగజంబునందంబునఁ జీర మఱచి దిగంబరుండై లేచి వాలు కేల నంకించి యానడురేయి దొంగల నఱికి వైచి మేషంబుల విడిపించుకొని తిరిగి వచ్చునెడ. 410

---

1 'నిజగరితసముల్' అనియే వ్రా. ప్ర. 3 'దియ్యాకు లొనెడ సుందరి, పయ్యెద' వ్రా. ప్ర. 3 పగతురు దొంగల రేఁపఁగ ..మగతనమెల్లన్ కౌఁగిటఁ జూపెడుమగవాఁడు, 4 ఏటికి నీరాచఱికము, బోటులు మొఱవెట్టఁ బశువు బోరన నఱచె-నో, యేటి దనిలేచి దొంగల-వేఁటల నిడ్చెడిదొంగల-గీటడఁచవు వెడలి శవముక్రియ నుండెదిదే.

ఆ. చీర లేనిమగనిఁ జెలువ దా నీక్షించి, కన్ను మొఱఁగి పోవఁ గాన కతఁడు
వెఱ్ఱివానిభంగి వివశుఁడై పడి లేచి, పొరలి తెరలి స్రుక్కి సొక్కి పడియె.

వ. మఱియుఁ బురూరవుండు మదనాతురుండై వెదకుచు సరస్వతీనదీతీరంబునం జెలికత్తెలతోఁ గూడియున్నయూర్వశిం గని వికసితముఖ(కమలుం)డై యిట్లనియె.

మ. తనుమధ్యా యిటు మేల వచ్చి తకటా ధర్మంబె శర్మంబె మున్
మనలో [1]నుంకుగ నాడికొన్న పలుకుల్ మర్యాదలుం దప్పెనే
నిను నేఁ బాసినయంతనుండి తనువున్ నేలం బడం బాఱెడిం
దిను [2]గృధ్రాదులు దీని మున్ను గరుణాదృష్టిన్ విలోకింపవే. 413

వ. అనిన నూర్వశి యి ట్లనియె. 414

క. మగువలకు నింత [3]లోం గాదు, మగవాఁడవె నీవు పశువుక్రమాడ్కిన్ వగవం
దగవే మానుషపశువును, మృగములుఁ గని తోయఁ గాక మే లని తినునే.

వ. అదియునుం గాక. 416

మ. తలఁపుల్ చిచ్చులు మాట లుజ్జ్వలసుధాధారల్ విభుం డైనపు
వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతు రేకవిశ్వాసమున్ లేదు క్రూ
రలు తోడుం బతి నైనఁ జంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్
వెలయాం డ్రెక్కడ వారివేడబము లా వేదాంతసూత్రంబులే. 417

ఉ. ఇం కొక యేఁడు పోయిన నరేశ్వర యాతలి రేయి నీవు నా
లంకకు వచ్చె దాత్మజుల లక్షణవంతులఁ గాంచె దేమియుం
గొంకక పొమ్ము నావుడును గొమ్మను గర్భిణిఁ గాఁ దలంచుచున్
శంక యొకింత లేక నృపసత్తముఁ డల్లన పోయె వీటికిన్. 418

వ. ఇట్లు మరలి చని తనపురంబున నొక్కయేఁ డుండి పిదప నూర్వశికడ కేఁగి యొక్కరేయి పురూరవుం డయ్యింతికడ నున్న నావెలందియు గంధర్వవరుల వేఁడికొనుము ని న్నిచ్చెద రనవుడు నతండు గంధర్వవరులం బ్రార్థించిన వార లతండు వొగడుటకు మెచ్చి యగ్నిస్థాలి నిచ్చిన నయ్యగ్నిస్థాలి నూర్వశిం గాఁ దలంచుచు దానితో నడవిం దిరుగుచుండి యొక్కనాఁ డది యూర్వశి గా దగ్నిస్థాలి యని యెఱింగి వనంబున దిగవిడిచి యింటికిఁ జనుదెంచి నిత్యంబు రాత్రి దానిన చింతించుచుండఁ ద్రేతాయుగంబు సొచ్చిన నారాజుచిత్తంబునఁ గర్మబోధంబు లయి వేదంబులు మూఁడుమార్గంబులం దోఁచిన నాభూవరుండు స్థాలి కడకుం జని యందు శమీగర్భజాతం బైనయశ్వత్థంబుఁ (జూచి యాయశ్వత్థంబు) చేత నరణులు రెండు గావించి ముందటియరణి దానును వెనుకటియరణి యూర్వశియును రెంటినడుమ నున్నకాష్ఠంబు పుత్త్రుండు నని మంత్రంబు సెప్పుచుం ద్రచ్చుచుండ జాతవేదుం డనునగ్ని సంభవించి విహితారాధన

1 నుంకువ లాడికొన్న. 2 నుగ్రంపుమృగాళి దీనుఁ. 3 లోఁ గాదు.

సంస్కారంబునంజేసి యాహవనీయాదిరూపంబుల మూఁట నెగడి పురూరవునిపు
త్రుం డని కల్పింపంబడియె నాయగ్ని పురూరవునిఁ బుణ్యలోకంబునకుఁ బనుపం
గారణం బగుటంజేసి. 419

క. ఆయగ్నిచేఁ బురూరవుఁ, డాయజ్ఞేశ్వరు ననంతు హరి వేదమయున్
శ్రీయుతుఁ గూర్చి యజించెను, నాయుతుఁ డూర్వశిఁ గనంగ నరిగెడుకోర్కెన్.

ఉ. ఒక్కఁడ వహ్ని వేల్పు పురుషోత్తముఁ డొక్కఁడ సర్వవాఙ్మయం
బొక్కఁడ వేద మా ప్రణవ మొక్కఁడ వర్ణము గొల్లి త్రేతనుం
డెక్కటి మాన్చి మూఁడుగను నేర్పఱచెం దనబుద్ధి పెంపుచేఁ
జక్కఁగ నాపురూరవుఁ డశేషక్రతులకున్ సులభంబు లట్లు గన్. 421

వ. ఇట్లు వేదవిభాగంబు గల్పించి యాగంబు సేసి పురూరవుం డూర్వశి యున్నగంధ
ర్వలోకంబునకుం జనియె నతనికి నూర్వశిగర్భంబున నాయువు శ్రుతాయువు
సత్యాయువు రయుండు జయుండు విజయుం డన నార్గురు పుత్రులు గలిగి రందు
శ్రుతాయువునకు వసుమంతుండును సత్యాయువునకు శ్రుతంజయుండును రయు
నకు శ్రుతుండు నేకుం డన నిరువురును జయునకు నమితుండును విజయునకు
భీముండును జనించి రాభీమునకుఁ గాంచనుండు కాంచనునకు హోత్రకుండు
హోత్రకునకు గంగాప్రవాహంబు పుక్కిటం బట్టినజహ్నుండు జహ్నునకుఁ
బూరుండు పూరునకు బాలకుండు బాలకునకు నజకుం డజకునకుఁ గుశుండు
కుశునకుఁ గుశాంబుండు ధూర్తయుండు వసువు కుశనాభుం డన నలువురును
సంభవించి రందుఁ గుశాంబునకు గాధి యనువాఁడు గలిగె నాగాధి రాజ్యంబు
సేయుచుండ. 422

సీ. సత్యవతిని గాధిజాతను గన్యను, విప్రుఁడు ఋచికుండు వేఁడికొనిన
గాధియు సుత కీడు గాఁ డని తెల్లని, నవకంపుమేనులు నల్లచెవులు
గలగుఱ్ఱములు వేయి కన్యకు సుంకువ, యిచ్చినఁ గూఁతు నే నిత్తు ననిన
వసుధామరుండును వరుణునికడ కేఁగి, హరులఁ దెచ్చినఁ గూఁతు నాతఁ డిచ్చె

ఆ. నామహాత్మునతియు నత్తయుఁ గొడుకులఁ, గోరి యడుగ నియ్యకొని యతండు
విప్రరాజమంత్రవితతుల వేల్పించి, చరువు సేసి క్రుంక నరిగె నదికి. 423

వ. అయ్యెడం దల్లి యడిగిన సత్యవతి బ్రహ్మమంత్రంబులఁ దనకు వేల్పించినచరువు
దల్లి కిచ్చి క్షాత్త్రమంత్రంబు(లం దల్లికి వేల్పించిన)చరువు దా నందికొని యుండ
నాముని సనుదెంచి చరువు వీడ్వడుట యెఱింగి భార్య కిట్లనియె. 424

ఆ. తల్లిచరువు నీవు దాల్చి నీచరు వేల, తల్లిపాల నిడితి తరళనేత్ర
కొమ్మ యింక నీకుఁ గ్రూరుఁడు పుట్టు మీ, యమ్మ బ్రహ్మవిదుని ననఘుఁ గాంచు.

వ. అనిన నయ్యింతి వెఱచి మ్రొక్కి వినయంబు లాడినం బ్రసన్నుం డై నీకొడుకు
సాధు వై నీమనుమండు క్రూరుం డగుం గాక యని ఋచికుం డనుగ్రహించిన

నాసత్యవతికి జమదగ్ని సంభవించె సత్యవతియుం గౌశికీనది యై లోకపావని యై ప్రవహించె నాజమదగ్నియు రేణువుకూఁతు రయినరేణుకను వివాహం బై వసుమదాదికుమారులం గనియె నందు. 426

క. పురుషోత్తమునంశంబున, ధర జమదగ్నికి జనించి ధన్యుఁడు రాముం
డిరువదియొకమఱి నృపతుల, శిరములఁ జక్కడిచెఁ దనదుచేగొడ్డంటన్. 427

వ. అనిన విని భూవరుండు శుకున కిట్లనియె. 428

—•• పరశురామునిచరిత్రము. ••—

ఉ. ఏటికిఁ జంపె రాముఁ డవనీశుల వేమఱు వారియందుఁ ద
ప్పేటిది విప్రుఁ డయ్యు నతఁ డేటికి రాజసతామసంబులన్
వాటముఁ బొందె భూభరము వారిత మౌ టది యేవిధంబు నా
మాటకు మానిచంద్ర మఱుమాట ప్రకాశము గాఁగఁ జెప్పవే. 429

వ. అనిన శుకుం డిట్లనియె. 430

సీ. హైహయాధీశ్వరుం డర్జునుం డనువాఁడు, ధరణీశ్వరులలోనఁ దగినవాఁడు
పురుషోత్తమాంశాంశుఁ బుణ్యు దత్తాత్రేయు, నారాధనముసేసి యతనివలనఁ
బరిపంథిజయమును బాహుసహస్రంబు, నణిమాదిగుణములు యశము బలము
యోగీశ్వరత్వంబు నోజయుఁ దేజంబుఁ, జెడనియింద్రియములు సిరియుఁ బడసి

తే. గాలికైవడి సకలలోకంబులందుఁ, దనకుఁ బోరాని రారాని తలము లేక
యెట్టిచో నైనఁ దనయాజ్ఞ యేపుమిగుల, ధరణి వెలుఁగొందె విను పీఁదిఁ దరణిమాడ్కి.

మ. ఒకనాఁ డామనుజేంద్రుఁ డంగనలతో నుద్దాముఁ డై వీట నుం
డక రేవానది కేఁగి యందుఁ దెలినీటం జల్లులాడి దీ
ర్ఘకరాబ్జంబుల నానదీజలములం గట్టెన్ వడిన్ నీరు మో
లకుఁ బెల్లుబ్బి రణాగతుం డయినయాలంకేశు పైఁ దొట్టఁగన్. 432

వ. ఇట్లు దిగ్విజయార్థంబు వచ్చినరావణుం డారాజుచేకట్టం దొట్టినయేటినీటికి సహింపక రోషంబునం బోటరియుంబోలె నమ్మోటిమగనితోడిపోటునకుం దొడరినఁ బాటింపకఁ దనబాహుపాటవంబున. 433

క. వీఁకమెయి నతఁడు రావణుఁ, గూఁకటులు లగలించి పట్టికొని మోఁకాలం
దాఁకించి కోఁతికైవడి, నాఁకం బెట్టించెఁ గింకరావళిచేతన్. 434

వ. అంత నర్జునుండు మాహిష్మతీపురంబున కేతెంచి. 435

క. ఆరాజేంద్రుఁడు రావణు, నోరీ యిట మీఁదఁ నూరకుండుము జగతిన్
వీరుఁడ ననకుము కాచితిఁ, బోరా యని సిగ్గు పఱిచి పుచ్చెన్ మరలన్. 436

వ. అంత. 437

సీ. ధరణీశుఁ డొకనాఁడు దైవయోగంబున, వేఁటకై కాంతారవీథి కేఁగి
తిరిగి వేఁటలశ్రాంతదేహుఁడై జమదగ్ని, మునియాశ్రమముఁ జేరి మ్రొక్కి నిలువ

నామునీంద్రుఁడు రాజు నర్థితోఁ [1]బూజించి, యారాజునకు రాజానుచరులకుఁ
వనహోమధేనువుఁ దడయక రప్పించి, యిష్టాన్నములు గురియింపఁ దడవు

తే. గుడిచి కూర్చుండి మొదవుపైఁ గోర్కెఁ జేసి
[2]సంపద యదేల యీయావు చాలుఁగాక
యిట్టిగోవుల నెన్నండు నెఱుఁగ మనుచుఁ
బట్టి తెం డని తనయోద్ధభటులఁ బనిచె. 438

వ. పంచిన వారలు దర్పంబునం జని. 439

క. క్రేపుం బాపకుఁ డంచును, హా పీడం బడితి ననుచు నంభా యనుమం
జూ పోపరు నృపు లంచును, నాపోవక మొదవుఁ గొనుచు వచ్చిరి పురికిన్.

వ. (అంత నర్జునుండు మాహిష్మతీపురంబునకు) వచ్చునెడ రాముం డాశ్రమంబున
కేతెంచి తద్వృత్తాంతం బంతయు విని. 441

ఆ. అద్దిరయ్య యింట నన్నంబు గుడిచి మా, యయ్య వల దనంగ నాక్రమించి
క్రొవ్వి రాజు మొదవు గొనిపోయినాఁడఁట, యేను రాముఁ డౌట యెఱుఁగఁ

వ. అని పలికి. [డొకొ.

శా. ప్రళయాగ్నిచ్ఛటభంగిఁ గుంభి విదళింపం జాలుసింహాకృతిం
బెలుచన్ రాముఁ డిలేశు వెంట నడచెం బృథ్వీతలం బెల్ల నా
కుల మై క్రుంగఁ గురారి యై కవచి యై కోదండి యై కాండి యై
ఫలి యై సాహసి యై మృగాజినమనోజ్ఞశ్రోణి యై తూణి యై. 444

వ. చని మాహిష్మతీపురద్వారంబుఁ జేరి నిలుచున్నసమయంబున. 445

మ. కనియెన్ ముందటఁ గార్తవీర్యుఁడు సమిత్కాముం బ్రకామున్ శరా
సనతూణీరకుఠారభీము నతిరోషప్రోచ్చలద్భ్రూయుగా
నన నేత్రాంచలసీము నైణపటనానామాలికోద్దాము నూ
తనసంరంభనరేంద్రదారశుభసూత్రత్రాసమునిన్ రామునిన్. 446

వ. కని కోపించి. 447

ఉ. బాలుఁడు వెఱ్ఱిబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుకై వడి నుంట మాని భూ
పాలురతోడ భూరిబలభవ్యులతోడ భయంబు దక్కి క
య్యాలకు వచ్చినాఁడు మనయం దిఁకఁ బాపము లేదు లెండు లెం
డేల సహింప భూసురుని నేయుఁడు వ్రేయుఁడు గూల్పుఁ డిమ్మహిన్. 448

వ. అని యదలించి దండనాయకులఁ బురికొల్పిన వారు రథకరిహరిపదాతిసమూ
హంబులతో లెక్కకుం బదినే డక్షౌహిణు లై యెదురునడచి శరచక్రగదాఖడ్గ
భిందిపాలశూలప్రముఖసాధనంబుల నొప్పించిన నవ్విప్రవరుండు గన్నులకొలు
కుల నిప్పులు గుప్పలుగొన రెట్టించినకట్టల్క మిట్టిపడ యజ్ఞోపవీతంబు సక్కనిడి

1 దీవించి. 2 సంప దేటికి నీయావు.

కొనికరాళించి బిట్టు దట్టించి కఠోరం బగు కుఠారంబు సారించి మూఁకలపైఁ కుఱికి [1]తొలకరి మొగంబునం గ్రొచ్చెలికపట్టునం జెట్టులు గొట్టు కృషీవలుని తెఱంగునఁ బదంబులు త్రుంచుచు ననఁటికంబంబులఁ దెగనడుచు నారామకారుని పగిది మధ్యంబులఁ ద్రుంచుచుఁ దాళఫలంబులు రాల్చు వృక్షారోహకునికైవడి శిరంబులు ద్రుంచుచు మృగంబుల వండం ఖండించు సూపకారుని భంగి నవయవంబులం జెక్కుచు నంతటం దనివి సనక విలయకాలకీలి కేలిని మంట లుమియుచు విల్లంది యెల్లెడం బిడుగులసోనలు గురియు బలుమొగిళ్లవడువున నప్రమాణంబు లగు బాణంబులఁ బఱపి సుభటసైన్యంబుల దైన్యంబు నొందించుచు (నడ్డంబు లేని యూర్చ్భటంబులు గల బాణవర్గఘృతంబులతోఁ) రాహుతులం గోపానలంబున కాహుతులు సేయుచు తురంగంబుల నిరంగంబులఁ గావించుచు రథంబుల శ్లథంబులఁగా నొనర్చుచు ద్విరదంబుల నరదంబులై పఱవం దోలుచు నివ్విధంబున సేనల నంపవానల ముంచి రూపు మాపిన. 449

క. మత్తిల్లి భూతజాలము, చిత్తంబులఁ జొక్కి వేడ్కఁ జిందులు వాఱన్
జొత్తిల్లి సమిత్తలమున, నెత్తురు మేఁకంబు పలలనికరం బయ్యెన్. 450

వ. అయ్యవసరంబున. 451

క. మేలీ బ్రాహ్మణుఁ డొక్కఁడు, నేలం బడఁ గూల్చె సైన్యనిచయము నెల్లన్
బాలార్చ నేల యీతనిఁ, దూలించెదఁ గాక నాదు దోర్బలము వడిన్. 452

వ. అని పలికి. 453

మ. ఒకయేనూఱు కరంబులన్ ధనువు లత్యుల్లాసియై తాల్చి వే
ఱొకయేనూట గుణధ్వనుల్ నిగుడ శాతోగ్రాస్త్రముల్ గూర్చి వి
ప్ర కుఠారంబును నిన్నుఁ గూల్తు ననుచున్ భర్జించి పుంఖానుపుం
ఖకఠోరంబుగ నేసి యార్చె జయరేఖాధామునిన్ రామునిన్. 454

క. వడిఁ దూపు లేయ గుడుసులు, పడి కార్ముకపంచశతము పరఁగ విభుఁడు సొం
పడరెఁ బరివేషచయముల, నడుమ ఖరద్యుతుల వెలయు నలినాప్తుక్రియన్.

వ. ఇట్లగ్గలుండు బాణవిలాసంబు సూపిన. 456

మ. ధరణీదేవుఁడు రాముఁ డాఢ్యుఁడు జగద్ధానుష్కరత్నంబు దు
ష్కరచాపం బొక ఎక్కు వెట్టి శరముల్ సంధించి పెల్లేసి భూ
వరుకోదండము లొక్క[2]మాటు దునిమెన్ నాఁ డంతటం బోక వే
తరువుల్ ఉవ్వఁ గుఠారధార నఱకెం దద్బాహుసందోహమున్. 457

క. కరములు దునిసిన నతనికి, శిర మొక్కటి చిక్కె శైలశిఖరముభంగిం
బరశువున నదియుఁ ద్రుంచెను, బరసూదనుఁ డైనఘనుఁడు భార్గవుఁడు వడిన్.

ఆ. తండ్రి వడిన నతనితనయులు పదివేలు, దలఁగిపోయి రతనిఁ దాఁక లేక

---

1 డోలాయిడి మొగంబునం. 2 చూడ్కి.

పరభయంకరుండు భార్గవుం డంత నా, గోవుఁ గ్రేపుతోడఁ గూడఁ దెచ్చె.

వ. ఇట్లు హోమధేనువు మరలం దెచ్చి యిచ్చి తనపరాక్రమంబు దండ్రి కెఱింగిం
చి గోఁబుట్టువులకు సవర్ణంబుగాఁ జెప్పిన జమదగ్ని రాముస కిట్లనియె. 460

క. కలవేల్పు లెల్లఁ దమతమ, చెలువంబులు దెచ్చి రాజుఁ జేయుదు రకటా
బలువేల్పు రాజు వానిం. జలమున ని ట్లేల పోయఁ జంపితి పుత్రా. 461

క. తాలిమి మనకును ధర్మము, తాలిమి [1]మూలంబు మనకు ధన్యత్వమునం
దాలిమి గల దని యీశుం, డేలించును బ్రహ్మపదము నెల్లన్ మనలన్. 462

క. క్షమ గలిగిన సిరి గలుగును, క్షమ గలిగిన వాణి గలుగు సౌరప్రభయున్
క్షమ గలుగఁ దోన కలుగును, క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుఁడు సంప్రీ.

క. పట్టపురాజును జంపుట, గట్టలుకన్ విప్రుఁ జంపుకంటెను బాపం
బట్టి ట్టనకుము నీ వీ, చెట్ట సెడం దీర్థసేవ సేయుము తనయా. 464

క. అని తన్నుఁ దండ్రి పనిచినఁ, బని పూని ప్రసాద మనుచు భార్గవుఁడు రయం
బున నొకయేఁడు ప్రయాణము, సని తీర్థము లెల్ల నాడి చనుదెంచె నృపా.

ఉ. ఆయెడ నొక్కనాఁడు సలిలార్థము రేణుక గంగలోనికిం
బోయి ప్రవాహమధ్యమునఁ బొల్పుగ నచ్చరలేమపిండుతోఁ
దోయవిహారముల్ సలుపు దుర్లభుఁ జిత్రరథున్ సరోజమా
లాయుతుఁ జూచు చుండెఁ బతియాజ్ఞ దలంపక కొంతప్రేమతోన్. 466

వ. ఇట్లు గంధర్వవల్లభునిం జూచుకారణంబునం దడసి. 467

ఉ. అక్కట వచ్చి పెద్దతడ పయ్యెడి హోమమువేళ దప్పె నే
నిక్కడ నేల యుంటి ముని యేమనునో యని భీతచిత్తయై
గ్రక్కునఁ దోయకుంభము శిరస్థలమం దిడి తెచ్చి యిచ్చి వే
మ్రొక్కి కరంబు మోడ్చి పతిముందట సల్లన నిల్చె నల్కుచున్. 468

వ. అప్పుడు. 469

క. చిత్తమున భార్య దడసిన, వృత్తాంతం బెఱిఁగి తపసి వేగమ సుతులన్
మత్తం దీనిం జావఁగ, మొత్తుం డన మొత్త రైరి మునుకుచు వారల్. 470

క. కొడుకులు పెండ్లముఁ జంపమి, గొడుకులఁ బెండ్లాముఁ జంప గురుఁ [2]డానతియీ
నడుగులకు నెఱఁగి రాముం, డడు గిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్. 471

శా. తల్లిన్ భ్రాతల నెల్లఁ జంపు మనుచోఁ దాఁ జంపి రాకున్నఁ బెం
పెల్లం బోవ శపించుఁ దండ్రి తనపం పేఁ జేయుదున్ మెచ్చి నా
తల్లిన్ భ్రాతల నిచ్చు నిక్కము తపోధన్యాత్మకుం డంచు వే
తల్లిన్ భ్రాతలఁ జంపె భార్గవుఁడు లేదా చంపఁ జే యాఁడునే. 472

వ. ఇవ్విధంబున. 473

---

1 'మూల మగు ధర్మతత్త్వంబులకుం' వ్రా. ప్ర. 2. డొసఁగినఁ దా.

క. అడ్డము సెప్పక కడపటి,బిడ్డఁడు రాముండు సుతులఁ § బెండ్లము నచటన్
గొడ్డంటం దెగ నడచిన, జడ్డనఁ దల యూఁచి మెచ్చె § జమదగ్ని మదిన్.

క. మెచ్చినతండ్రిని గనుఁగొని, చెచ్చెర నీపడినవారి§జీవంబులు నీ
విచ్చితి నను మని మ్రొక్కిన, నిచ్చెన్ వారలును లేచి § రెప్పటిభంగిన్. 475

ఆ. పడినవారి మరల § బ్రదికింప నోపును, జనకుఁ డనుచుఁ జంపె § జామదగ్న్యుఁ
డతఁడు సంపె ననుచు § నన్నలఁ దల్లిని, జనకునాజ్ఞ యైనఁ § జంపఁ దగదు.

వ. అంత. 477

సీ. పరశురాముని కోడి § పరుగులు వెట్టిన,యర్జునపుత్రకు § లాత్మయందుఁ
దండ్రి మ్రిగ్గుటకు సం§తప్తులై వ్రేగుచు, నింతట నంతట § నెడరు వేచి
తిరిగి చూడుచు నొక్క§దివసమం దారాముఁ, డడవి కన్నలతోడ§నరుగఁ దెరపఁ
బగఁ దీర్పఁ దఱి యని § పఱతెంచి హోమాల,యంబున సర్వేశు § నాత్మ నునిచి

తే. నిరుపమధ్యానసుఖవృత్తి§నిలిచియున్న,పుణ్యు జమదగ్ని నందఱుఁ§బాదుగఁ బట్టి
కుదులకుండంగఁ దలఁ ద్రెంచి§కొనుచుఁ జనిరి, యడ్డమేతెంచి రేణుక§యడిచికొనఁగ.

వ. మఱియును. 479

మ. జనకుం జంపినవైరముం దలఁచి రా§జన్యాత్మజుల్ నేఁడు మీ
జనకుం జంపిరి రామ రామ రిపులన్ § శాసింతు రమ్మంచు న
మ్మునిపై వ్రాలి లతాంగి మోఁదికొనియెన్ § మున్నేడుమాఱుల్ రయం
బున రాముం డరుదెంచి యెన్నికొన నా§పూర్ణాపదాక్రాంత యై. 480

వ. అప్పుడు తల్లి మొఱ విని జమదగ్నికుమారులు వచ్చి యి ట్లని విలపించిరి. 481

క. వాకిలి వెడలవు కొడుకులు, రా కుండఁగ నట్టినీవు § రాజసుతులచేఁ
జీకాకు నొంది పోవఁగ, నీకాళ్లెట్లాడెఁ దండ్రి § నిర్జరపురికిన్. 482

వ. అని విలపించు చున్నయన్నలం జూచి (రాముం డిట్లనియె). 483

ఉ. ఏడువ నేల తండ్రికిని § వేమఱు కుందుఁడు తోడులార నే
సూఁ డిదె తీర్తు నంచుఁ బర§శుద్యుతిభీముఁడు రాముఁ డుగ్రుఁడై
యోడక యర్జునాత్మభవు § లున్నపురంబున కేఁగి వారు గో
డాడఁగఁ బట్టి చంపె వడి § నర్జునజాతుల బ్రహ్మఘాతులన్. 484

క. ఖండించి రిపులశిరములు, గొండలు గాఁ బ్రోఁగు లిడియె § గురురక్తనదుల్
నిండికొని పాఱ నుబ్బుచు, భండనమున [1]విప్రరిపులు § భయ మంద నృపా.

వ. మఱియు నంతటఁ బోక. 486

ఆ. అయ్యపగకు రాముఁ § డలయక రాజుల, నిరువదొక్కమాఱు § నరసి. చంపె
జగతిమీఁద రాజ§శబ్దంబు లేకుండ, సూడు దీర్ప లేని§సుతుఁడు సుతుఁడె.

వ. మఱియు నారాముండు [2]శమంతపంచకంబున రాజరక్తంబులం దొమ్మిదిమడుఁ

---

1. విపులనృపులు. 2. 'రాజరక్తంబుల శమంతపంచకం బన నేడుమడుఁగులు' వ్రా. ప్ర.

గులు గావించి తండ్రిశిరంబు దెచ్చి శరీరంబుతో సంధించి సర్వదేవమయుం
డగుదేవుండు దాన కావునఁ దన్ను నుద్దేశించి యాగంబు సేసి హోతకుం
దూర్పును బ్రహ్మకు దక్షిణభాగంబును నధ్వర్యునకుఁ బడమటిదిక్కును నుద్గా
తృనకు నుత్తరదిశయు నున్నవారల కవాంతరదిశలును నుపద్రష్ట యైనకశ్యపున
కు నార్యావర్తం బనుమధ్యభూమియు సదస్యులకుం దక్కినయెడలును గలయ
నిచ్చి బ్రహ్మనది యైనసరస్వతియం దవభృథస్నానంబు సేసి కల్మషంబులం
బాసి మేఘవిముక్తుం డయినసూర్యుండునుంబోలె నొప్పుచుండె నంత. 488

క. ఆప్తుఁ డగుపుత్త్రువలనను, బ్రాప్తతనుం డగుచుఁ దపము § బలిమిని మింటన్
సప్తర్షిమండలంబున, సప్తముఁ డై వెలుఁగుచుండె § జమదగ్ని నృపా. 489

క. ఆజమదగ్నితనూజుఁడు, రాజీవాక్షుండు ఘనుఁడు § రాముఁ డధికుఁ డై
యోజను సప్తర్షులలో, రాజిల్లెడు మీఁదిమనువు § రా నవ్వేళన్. 490

ఆ. శాంతచిత్తుఁ డగుచు § సంగవిముక్తుఁ డై, భవ్యుఁ డై మహేంద్ర § పర్వతమున
నున్నవాఁడు రాముఁ § డోజతో గంధర్వ, సిద్ధవరులు నుతులు § సేయుచుండ.

క. భగవంతుఁడు హరి యీక్రియ, భృగుకులమునఁ బుట్టి యెల్ల § పృథివీపతులన్
జగతీభారము వాయఁగఁ, బగగొని పలుమాఱుఁ జంపె § బవరమున నృపా.

వ. అంత గాధికి నగ్నితేజుం డగువిశ్వామిత్త్రుండు జన్మించి తపోబలంబున రాజ
ధర్మంబు దిగనాడి బ్రహ్మర్షి యై నూర్వురుకొడుకులం గనియె నయ్యెడ భృగుకుల
జాతుం డయినయజీగర్తునికొడుకు శునశ్శేపుండు దల్లిదండ్రులచేత హారిశ్చం
ద్రునియాగపశుత్వంబునకు నమ్ముడువడి బ్రహ్మాదుల వినుతిసేయుచు మెప్పించి
దేవతలచేత బంధవిముక్తుం డయిన వానియందుఁ గృప గలిగి చేపట్టుకొని
విశ్వామిత్త్రుండు పుత్త్రుల కిట్లనియె. 493

క. కన్నులఁ గంటిని వీనిని, మన్ననకొమరుండు నాకు § మక్కువ మీలో
నన్నన్న యనుచు నీతని, మన్నింపుం డనినఁ జూచి § మనసంయుతు లై. 494

క. ఇతఁ డన్నఁట మా కఁట కట, కృతకృత్యుల మయితి మనుచు § గేలియొనర్పన్
సుతులన్ మ్లేచ్ఛులు గం డని, ధృతి లేక శపించెఁ దపసి § తిరుగుడువడఁగన్.

వ. అయ్యెడ నతనిశాపంబునకు వెఱచి యానూర్వురయందు మధ్యముం డయిన
మధుచ్ఛందుం డేఁబండ్రు దమ్ములుం దానును నమస్కరించి తండ్రీ నీచెప్పిన
తెఱంగున శునశ్శేపుండు మా కన్న యని మన్నింపంగలవార మనవుడు సంత
సించి మంత్రదర్శి యైనశునశ్శేపుని వారలయందుఁ బెద్దఁ జేసి మధుచ్ఛందున
కిట్లనియె. 496

ఆ. పాడి సెడక వీఁడె § నేఁడు మీకతమునఁ, గొడుకు గలిగె నాకుఁ § గొడుకులార
కడుపు లార మీరు § గొడుకులఁ గనుఁ డింకఁ, బ్రీతితోడ దేవ § రాతుఁ గూడి.

వ. అని పలికె నట్లు శునశ్శేపుండు దేవతలచేత విడివడుటం జేసి దేవరాతుం డయ్యె

మధుచ్ఛందుం డను మొదలయిన యేఁబండ్రు నా దేవరాతునకుఁ దమ్ము లైరి పెద్ద లయిన యష్టకహారీతజయంతసుమదాదు లేఁబండ్రును వేఱై చని యీక్రమంబున విశ్వామిత్రుకొడుకులు రెండువిధంబు లయిన ప్రవరాంతరంబు గలిగె నని చెప్పి శుకుం డిట్లనియె నా పురూరవుకొడు కగు నాయువునకు నహుషుండును క్షత్త్రవృద్ధుండును రజియును రంభుండును ననేనసుండును ననువారు పుట్టి రందు క్షత్త్రవృద్ధునకుఁ గుమారుం డగు సుహోత్రునకుఁ గాశ్యుండుఁ గుశుఁడు గృత్సమదుండు నన ముగ్గురు సంభవించి రా గృత్సమదునకు శునకుండును శునకునకు శౌనకుండును న మ్మహాత్మునికి బహ్వృచప్రవరుండును జన్మించి రా బహ్వృచప్రవరుండు దపోనియతుండై చనియెఁ గాశ్యునకుఁ గాశియుఁ గాశికి రాష్ట్రుండును రాష్ట్రునకు దీర్ఘతపుండును జనియించిరి. 498

క. ఆదీర్ఘతపుని కధికుఁడు, శ్రీదయితాంశమునఁ బుట్టి సేవ్యుం డాయు
ర్వేదజ్ఞుఁడు ధన్వంతరి, ఖేదంబులు వాయు నతనిఁ గీర్తన సేయన్. 499

వ. (వాసుదేవాంశసంభూతుం డగు) నా ధన్వంతరి యజ్ఞభాగంబున కర్హుం డతనికిఁ గేతుమంతుండు గేతుమంతునకు భీమరథుండు నతనికి దివోదాసుం డనం బరఁగు ద్యుమంతుండు నుదయించి రా ద్యుమంతునకుఁ బ్రతర్దనుండు జన్మించె నా ప్రతర్దనుండు శత్రుజితుండును ఋతధ్వజుండు నని చెప్పంబడె నాతనికిఁ గువలయాశ్వుండు సంభవించె. 500

ఆ. వసుమతీశ విను కువలయాశ్వభూభర్త, లలితపుణ్యు ఘను నలర్కుఁ గనియె
నాతఁ డేలె నేల నఱువదియాఱువే, లేండ్లు వానిభంగి నేలఁ డొకఁడు. 501

వ. అయ్యలర్కునకు సన్నతియును నతనికి సునీతుండును నతనికి సుకేతనుండును నతనికి ధర్మకేతువును నతనికి సత్యకేతువును నాతనికి ధృష్టకేతువును నా ధృష్టకేతువునకు సుకుమారుండును సుకుమారునకు వీతిహోత్రుండును వీతిహోత్రునకు భర్గుండును భర్గునకు భార్గభూమియు జనియించిరి. 502

ఆ. వాఁడు తుదయుఁ గాశ్యవసుమతీశుం డాది, యైనవారు కాశు లనఁగ నెగడి
రవనిమీఁద వార లాక్షత్త్రవృద్ధుని, వంశజాతు లగుచు వంశవర్య. 503

వ. మఱియు క్షత్త్రవృద్ధునికి †రెండవకొడు కగు (కుశునికిఁ బ్రీతియును వానికి సంజయుండును సంజయునికి జయుండును జయునికిఁ గృతుండును గృతునికి హర్యశ్వనుండును హర్యశ్వునకు సహదేవుండును సహదేవునికి భీముండును భీమునకు జయత్సేనుండును జయత్సేనునకు సంకృతియు సంకృతికి జయుండును జయునికి క్షత్త్రధర్ముండును బుట్టిరి వీరలు క్షత్త్రవృద్ధాన్వయులు) రంభునికి రభసుండును రభసునికి గంభీరుండును గంభీరునికిఁ గృతుండును గల్గి రా కృతునికి బ్రహ్మకులం

---

† ఈకుండలీకరణములోనిపాఠము 498-వ వచనమున 'ముగ్గురు సంభవించిరి' అనుటకుఁ బిదప వ్రాఁతప్రతులం జూపట్టెడి.

బు పుట్టె నయ్యేనేనునకు శుద్ధుండును శుద్ధునకు శుచియు శుచికి బ్రహ్మసారథి యైన త్రికకుత్తును జనించి రతనికి శాంతరజుండు పుట్టె నతండు విజ్ఞానవంతుండుఁ గృతకృత్యుండు విరక్తుండు నయ్యె. 504

సీ. రజి యనువానికి రాజేంద్ర యేనూఱు, కొడుకులు గలిగిరి ఘోరబలులు
వేల్పు లెల్లను వచ్చి వేఁడిన నారజి, దైత్యులఁ జెక్కాడ్రి ధరణిఁ గూల్చి
నాకంబు దేవేంద్రునకు నిచ్చె నిచ్చిన, రజికాళ్ల కెఱఁగి సురపవిభుండు
వెండియు నతనికి విబుధగేహము నిచ్చి, సంతోషబుద్ధి నర్చన మొనర్చె

ఆ. నంత నారజి మృతుఁడైన నతనిపుత్త్రు, లమరవిభుఁడు తమ్ము నడిగికొనిన
నీక యింద్రలోక మేలిరి యాగభాగములు పుచ్చికొనిరి గర్వ మంది. 505

క. వేలుపులఱేఁడు గురుచే, వేలిమి వేల్పించి బలిమి వెలయఁగ నిజదం
భోళిని రజిసుతులను ని, ర్మూలము గావించి నాకముం గైకొనియెన్. 506

వ. అది యట్లుండె నహుషునకు యతియు యయాతియు సంయాతియు నాయాతియు వియతియుఁ గృతియు నన నార్గురుగొడుకులు దేహికి నింద్రియంబుల చందంబున సంభవించి రందుఁ బెద్దకొడుకగు యతికి రాజ్యం బిచ్చిన నతండు విరక్తుండై. 507

క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొడ లెఱుంగ రాదు సుమతియుఁ
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగఁడు, రాజ్యము గీజ్యమ్ము ముక్తికర్తునకు నేలా.

వ. అని పలికి నాఁడు రాజ్యంబునకుం బాసి చనియె. 509

క. ఆనహుషుఁడు మఖశతమును, మానుగ నొనరించి యింద్రమానినిఁ గవయం
బూని మునీంద్రులు మోచిన, యానముపై నుండి కూలె నహియై నేలన్. 510

ఉ. అన్నయుఁ దండ్రియుం జన యయాతి మహీపతి యై చతుర్దిశల్
ప్రన్ననఁ గావఁ దమ్ములకుఁ బాలిడి శుక్రునికూఁతురుఁ సునం
పన్న గుణాభిరామ వృషపర్వునికూఁతురు నోలి నాండ్రు గా
నన్నయశాలి యై ధరణిచక్రధురంధరుఁ డయ్యెఁ బేర్మితోన్. 511

వ. అనిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 512

—యయాతిచరిత్రము.—

ఆ. పార్థివుఁడు యయాతి బ్రహ్మర్షి భార్గవుఁ, డల్లుఁ డగుట మామ యగుట యెట్లు
రాజు రాచకూఁతు రతిసేయఁ దగుఁ గాక, విప్రకన్య నొందవిహిత మగునె.

వ. అనిన శుకుం డిట్లనియె. 514

సీ. దనుజేంద్రుకూఁతురు తరళాక్షి శర్మిష్ఠ, పురమున నొకనాఁడు ప్రొద్దు వోక
వేవురుబోటులు వెంట రా గురుసుత, యగు దేవయానితో నాట మరగి
పూచినయెలదోఁటపొంత జొంపము గొన్న, క్రొమ్మావిసీడల కొలఁకుఁ జేరి
యందుఁదమ్ములతేనెలానిచొక్కుచుమ్రోయు, నళులఝంకృతులకు నదరిపడుచు

ఆ. వలువ లూడ్చి కొలఁకు వడిఁ జొచ్చి తమలోనఁ, బెల్లు రేఁగి నీటఁ జల్లులాడ
నంది నెక్కి మౌళి నిందురోచులు పర్వ, శూలి వచ్చెఁ గొండచూలితోడ.

చ. మలహరుఁ జూచి సిగ్గుపడి మానిను లందఱు సంభ్రమంబునన్
వలువలు గట్టుచోఁ దనుజవల్లభుకూఁతురు దేవయానిదౌ
వ్వలువ ధరించి ముంగటికి వచ్చినఁ జూచి యెఱింగి నా
వలు విది యెట్లు గట్టికొన వచ్చును దాసికి నంచుఁ దిట్టుచున్. 516

వ. దేవయాని యిట్లనియె. 517

శా. ఆలోకేశుముఖంబునం గలిగె బ్రాహ్మణ్యంబు బ్రహ్మంబు నా
మేలై వైదికమార్గముల్ దెలుపుచున్ మిన్నంది యందున్ మహా
శీలుర్ భార్గవు లందు శుక్రుఁడు [1]సుధీసేవ్యుండు నే వానికిం
జూలన్ నావలు వెట్లు గట్టితివి రక్షోజాత వై చేటికా. 518

క. మహిమవతులైనభూసుర, మహిళలవిత్తమ్ములు పఱమగువల కగునే
మహిఁ బసిఁడిగొలుసు లిడినన్, విహితములే కుక్కలకు హవిర్భాగంబుల్.

క. మీతండ్రి మాకు శిష్యుఁడు, మాతండ్రి గురుండు గొంతమాత్రం బైనం
బ్రీతిం గావింపక పరి, భూతం జేయుదువె తులువపోఁడిమిఁ జెనఁటీ. 520

వ. అని భర్జించుచున్నదేవయానిపలుకులు విని కరాళించి మ్రోఁగుచున్నభుజంగి చందంబున నిట్టూర్పులు నిగిడించి పదవులు [2]గొఱుకుచు శర్మిష్ఠ యిట్లనియె.

శా. భిక్షుండై తమతండ్రి మాజనకునిన్ భిక్షించి యుండంగ సం
రక్షింపం దుది నింత యై మఱపుతో రాజప్రసూతాకృతి
న్రక్షోరాజతనూజతో సుగుణతో నాతో సమం బాడెడిం
గుక్షిస్ఫోటము గాఁగ దీనిఁ జెలులీ కూపంబునం ద్రోవరే. 522

వ. అని పలికి. 523

ఆ. బోటిపిండుచేతఁ బొదువంగఁ బట్టించి, రాజసమున దైత్యరాజతనయ
దొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంకి నూతిలోనఁ [3]గుతిలకొనఁగ.

వ. ఇట్లు సేసి శర్మిష్ఠ వోయినవెనుక యయాతిభూపాలుండు వేఁటమార్గంబున నడవిం దిరుగుచు దైవయోగంబున నాదేవయాని యున్ననూయి సేరం జనుదెంచి యందు. 525

క. బంధువుల నెల్లఁ జీరుచు, [4]నంధుజలామగ్నమధ్య యై వగచుచు ని
ర్బంధమునఁ జిక్కి పీడా, సింధువున మునింగి యున్నచేడియఁ గనియెన్. 526

వ. కనుంగొని. 527

—దేవయాని యయాతిని వరించుట.—

శా. సప్తాంభోనిధిమేఖలావృతమహాసర్వంసహాకన్యకా

1 మహా. 2 విఱుచుచు, 3 గుదిలకొనఁగ, 4 నంధుజలామగ్ననగ్న యై.

ప్రాప్తోద్యత్స్వరదక్షదక్షిణకర ప్రాలంబముం జేసి ప్రో
త్థిష్టం జేసె యయాతి గట్టుకొనఁ జైలంబు ము న్నిచ్చి ప
ర్యాప్తస్వేదజలాంగి నాళిసముదాయస్వర్గవిద్ భార్గవిన్. 528

వ. ఇట్లు నూయి వెడలించిన రాజునకు రాజవదన యి ట్లనియె. 529

మ. ననుఁ బాణిగ్రహణంబొనర్చితి కదా నాథ ర్తవుగ్ నీవ దై
వనియోగం [1]బిది తప్ప దప్పురుషతా వాక్యంబు సిద్ధంబు సౌ
ఖ్యనివాసుగ్ నినుఁ జేరునాఁటది పరుం గాంక్షింపఁ గా నేర్చునే
వనజం బానెడి తేఁటి యన్యకుసుమా వాసం బపేక్షించునే. 530

వ. అదియునుం గాక. 531

సీ. సుగుణాఢ్య విను నేను శుక్రునికూఁతుర, దేవయానిని దొల్లి దేవమంత్రి
తనయుండు కచుఁడు మాతండ్రిచేత మృతసం, జీవనిఁ దా నభ్యసించువేళ
నతనిఁ గామించిన నతఁ డొల్ల ననవుడు, నతఁడు నేర్చినవిద్య యడఁగిపోవ
నే శపించిన నాతఁ డెఱిఁగి నాథ ర్త బ్రాహ్మణుఁడు గా కుండెడు మని శపించె

తే. నది నిమిత్తంబు నాకు బ్రాహ్మణుఁడు గాఁడు
ప్రాణనాథుఁడ వీ వని పడఁతి వలుకఁ
దనదుహృదయంబు నెలఁతపైఁ దగులువడినఁ
దమక మొకయింతయును లేక తలఁచి చూచి. 532

మత్తకోకిలము. దైవయోగము గాక విప్రసుతఁ వరించునె నామనం
బేవిధంబున నీశ్వరాజ్ఞయు నిట్టి దంచు వరించె ధా
త్రీవరుండును దేవయానిని ధీరబుద్ధులకుఁ మనో
భావ మొక్కటిగా ప్రమాణ మభావ్యభావ్యపరీక్షకున్. 533

వ. ఇట్లు వరించి యయాతి సనినవెనుక దేవయాని శుక్రునికడకుం జని శర్మిష్ఠ సేసిన
వృత్తాంతం బంతయుం జెప్పి కన్నీరు మున్నీరు గా వగచిన. 534

క. క్రూరాత్ములమందిరములఁ, గారోహిత్యంబుకంటె పాపం బిసఁ
సారముకంటె శిలల్ దినీ, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పున్. 535

వ. అని వృషపర్వుకడ నుండుట నిందించుచు శుక్రుం డాకూఁతుం దోడ్కొని
పురంబు వెడలి చన నయ్యసురవల్లభుం డెఱింగి శుక్రునివలనం దేవతల గెలువఁ
దలంచి తెరువున కడ్డంబు వచ్చి పాదంబులపైఁ బడి ప్రార్థించి ప్రసన్నుం జేసిన
నాకోపంబు మాని శుక్రుండు శిష్యున కి ట్లనియె. 536

తరలము. చెలులు వేవురుఁ దాను నీసుత చేటికై వడి నాసుతం
గొలువఁ బెట్టినఁ దీఱుఁ గోపము గొల్వఁ బెట్టెద వేని నీ
వెలఁదిఁ దోకొని వత్తు నావుడు వేగ రమ్మని భార్గవిం

---

[1] బిది పౌరుషంబునకు నావాక్యంబు.

గొలువఁ బెట్టె సురారివర్యుఁడు గూఁతు నెచ్చెలిపిండుతోన్. 537

మ. చల మింకే లని తన్నుఁ దండ్రి వనుపన్ శర్మిష్ఠ సన్నిష్ఠతో
జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నజస్రంబుఁ ద
న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ నాయన్ [1]భూరికోపానలా
కలితగ్లానికి దేవయానికి మహాగర్వోద్యమస్థానికిన్. 538

వ. అంత. 539

ఉ. ఆతత మైన వేడ్క దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లియొనర్చె మహావిభూతికిం
బ్రీతి మహోగ్రజాతికి సభీతికి సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుష్కలహకార్యభియాతికి నయ్యయాతికిన్. 540

వ. ఇట్లు యయాతికి దేవయాని నిచ్చి శుక్రుండు శర్మిష్ఠాసంగమంబు సేయకు మని యతని నియమించి పనిచినపిమ్మట దేవయానియు నయ్యయాతివలన యదుతుర్వసు లనుకుమారులం గనియె నొక్క రేయి సెఱంగు మాసి దేవయాని వెలుపల నున్నయెడ శర్మిష్ఠ యెడరు వేచి యేకాంతంబున యయాతికడకుం జని చెఱకువింటిజోదుపువ్వుటంపఱ కోహటించి తనతలంపు సెప్పిన. 541

—శుక్రాచార్యులు యయాతికి శాపం బొసంగుట.—

ఉ. ఆజవరాలిఁ జూచి మన మాపఁగ లేక [2]మనోభవార్తుఁడై
యాజనభర్త మున్ను కవి యాడినమాట దలంచి యైనఁ జే
తోజసుఖంబులం దనిపెఁ గ్రొవఁగి తప్పునె దైవయోగముల్
రా జఁట సద్రహస్య మఁట రాజకుమారిని మాన నేర్చునే. 542

వ. ఇట్లు యయాతివలన శర్మిష్ఠ గర్భంబై క్రమంబున ద్రుహ్యుండు ననువుఁ బూరువు నన ముగ్గురుతనయులం గాంచె నంత దేవయాని తద్వృత్తాంతం బంతయు నెఱింగి కోపించి శుక్రుకడకుం జని క్రోధమూర్ఛిత యై యున్నసమయంబున యయాతి వెంటం జని యి ట్లనియె. 543

ఆ. మామ కేల చెప్ప మా మా సరోజాక్షి, దనుజతనుజఁ బొంది తప్పు వడితిఁ
గామినయిననన్నుఁ గరుణింపు పతిమాట, [3]తండ్రి కెఱుఁగఁ జెప్పఁ దగవె సతికి.

వ. అని పలికి పాదంబుల కెఱఁగిన నయ్యింతి యొడంబడక యుండె నంత నది యెఱింగి శుక్రుం డి ట్లనియె. 545

క. నామాటఁ ద్రోచి దానవ, భామను బొందితివి ధరణిపాలక తగవే
యేమాట యేది రూపము, కాముకులకు లోలుపులకుఁ గలవే నిజముల్. 546

వ. అని పలికి నిన్ను వనితాజనహేయం బయినముదిమి వొందెదు మని శపియించిన

---

1 'పీతచేతస్సమాకలితగ్లానికి' వ్రా. ప్ర. 2 తనూభవార్థి యై. 3 తల్లిఁదండ్రి మోపఁ దగునె అని పాఠాంతరము.

యయాతి యిట్లనియె. 547

క. మామా నాపైఁ గోపము, మామా నీపుత్రియందు మానవు నాకుం
గామోపభోగవాంఛలు, ప్రేమమున రమించి ముదిమిఁ బిదపం దాల్తున్. 548

వ. అని పలికి యనుజ్ఞ గొని (దేవయానిం దోడ్కొని పురంబునకుం జని) పెద్దకొడు కగుయదువుం బిలిచి యయాతి యిట్లనియె. 549

శా. నీతల్లిం గనినట్టిశుక్రువలనన్ నేఁ డీజరం బొందితిన్
నాతండ్రీ యదునామధేయ సదయా నావృద్ధతం దాల్పవే
నీతారుణ్యము నాకు నీవె తనివో నిండారఁ గొన్నేండ్లు నేఁ
జేతోజాతసుఖంబులం దిరిగెదన్ శృంగారి నై పుత్రకా. 550

వ. అనిన విని తండ్రికి యదుం డిట్లనియె. 551

శా. కాంతాహేయము బంధునింద్యము దురాకండూతిమిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేదవ్రణాకంపన
శ్రాంతిస్ఫోటకయుక్త మీముదిమి వాంఛం దాల్చి నానాసుఖా
పాంతం బైనవయోనిధాన మిది యయ్యా తేర యీ వచ్చునే. 552

వ. అని యదుండు దండంబడకున్న యయాతి దుర్వసుద్రుహ్యానుల నడిగిన వారును
యదువు పలికినట్లు పలికినం గడగొట్టుకొమరుం డైన పూరువున కిట్లనియె. 553

ఉ. అన్నవు గాని నీవు కడుఁబెద్దవు బుద్ధులయందు రమ్ము నా
యన్న మదాజ్ఞ దాఁటవుగదన్న వినీతుఁడ వైననీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకు మన్న నాజరన్
మన్ననఁ దాల్చి నీతరుణి[1]మం బొనగూర్పుము నాకుఁ బుత్రకా. 554

వ. అనిన విని గురుభక్తిగుణాధారుం డయినపూరుం డిట్లనియె. 555

శా. అయ్యా యన్నిటు వేఁడ నేల భవదీయాజ్ఞాసముల్లంఘనం
బయ్యుండం బరిహారముల్ నొడువ నే నన్యాయినే నీజరన్
నెయ్యం బొప్పఁగఁ దాల్చి నాతరుణతన్ నీ కిచ్చెదం బంపనం
గ్రయ్యం బాటెడిపుత్రకుండు క్రిమిసంకాశుండు గాకుండునే. 556

వ. అదియునుం గాక. 557

క. మునివృత్తి డయ్య నేటికి, జనపాలక సుగతిఁ గోరు సత్పురుషులకుం
దనకన్నతండ్రి సెప్పిన, పని సేసిన సుగతి గొంగుపసిఁడియ కాదే. 558

క. పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు వొందుపఱతురు తండ్రుల్
పని చెప్పి కోరి పనిచిన, ననిశము మాఱాడుపుత్త్రు లధములు దండ్రీ. 559

వ. అని పలికి పూరుండు ముదిమి సేకొని తనలేఁబ్రాయంబు యయాతి కిచ్చె నయ్యయాతియుం దరుణుం డై. 560

1. 'మంబు రయంబున నిమ్ము పుత్రకా' వ్రా. ప్ర.

శా. ఏడున్ ద్వీపము లేడువాడలు గ సర్వోర్వీతలం బెల్లఁ బె
స్వీ ద్దై [1]పోఁడిగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షించుచుం
దోడన్ భార్గవి రా మనోజసుఖసంతోషంబులం దేలుచుం
గ్రీడించెన్ నియతేంద్రియుం డగుచు [2]నాకక్రీడాతిరేకంబులన్. 561

క. మర్మంబుల నతిసాధ్వి, ధర్మంబుల దేవయాని దనప్రాణేశున్
నర్మముల మనోవాక్తను, కర్మంబుల నొండు లేక కడు మెప్పించెన్. 562

శా. ఆకాశంబున మేఘబృందము ఘనంబై సన్నమై దీర్ఘమై
యేకంబై బహురూపమై యడఁగున ట్లేదేవుగర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలఁగుచున్ లోపించు నాదేవు సు
శ్రీకాంతున్ హరిఁ గూర్చి యాగములు సేసెన్ నాహుషుం డిమ్ములన్. 563

వ. మఱియును. 564

మ. చెలికాండ్రన్ భటులన్ రథమ్ములఁ గరిశ్రేణిం దురంగంబులం
గలఁగం గన్నధనాళితో సమములం గాఁ జూచుచున్ భార్యతోఁ
బలువేడ్కన్ మనోజ్ఞభోగలహరీపర్యాప్తుఁ డై తేలియున్
బలుతృష్ణం గడఁ గాన కింద్రియమహాబంధంబులన్ స్రుక్కుచున్. 565

వ. ఒక్కదినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతానిమిత్తంబున దనమోసపోవుట యెఱింగి యయాతి (యతివిషాదంబు నొంది) దేవయాని కిట్లనియె. 566

— యయాతి దేవయానికి బస్తోపాఖ్యాన మనెడివ్యాజంబు దెలుపుట. —

క. మనచారిత్రమువంటిది, విను మితిహాసంబు గలదు వృద్ధజనములున్
[3]మునులును మెత్తురు నీవును, మనమున నంగీకరింపు మంజులవాణీ. 567

వ. అది యెట్టి దనిన. 568

సీ. అజ మొకం డడవిలో నసఁగుచు దాఁ గర్మ, ఫలమున నూతిలోపలికి జాఱి
లోఁగడఛాగ నాలోకించి కామియై, కొమ్మున దరిఁ గొంత గాలఁ ద్రోచి
వెడలింప నచ్ఛాగి విభునిఁ గాఁగోరిన, నగుఁగాక యని తాను నదియుఁ దిరుగ
[4]నెన్నియానిని దన్ను నెంత కామించిన, నన్నిటికిని భర్త యై తనర్చి

తే. వాని నేప్రొద్దు రతులకు వశలఁ జేసి, సారిదిఁ గ్రీడించి క్రీడించి చొక్కి చొక్కి
కాముఁ డనియెడిదుస్సహాగ్రహముకతనఁ, జిత్త మేమఱి మత్తిల్లి చెల్లఁ జిక్కి.

క. వెడవింటివానిచిగురా, కడిదపువ్రేటునకు లోఁగి యతిమోహితుఁ డై
విడువక సతులం దగిలెడు, జడునకు నెక్కడివి బుద్ధిచాతుర్యంబుల్. 570

వ. అంత నచ్ఛాగంబు దనపదపం దగిలినఛాగీనివహంబులోపలం జూడ నొప్పెడి ఛాగియందుఁ దగిలి క్రీడింపం గని నూతిలోపలం బడి వెలువడినఛాగి తనపతి

1 లోనుగ. 2 'సత్కీర్తిన్ విజృంభించుచున్' వ్రా. ప్ర. 3 మును మన్నింతురు. 4 నజరేని యన్నిచ నంతఁ.

వలని నెయ్యంబు లే కుండుటకు విన్ననై తనమనంబున. 571

క. పలికినఁ బలుకులు వలుకఁడు, కలయఁడు నవకాంతఁ జూచి కడునంచలుఁడై
నిలిచినచోటను నిలువఁడు, నిలు వెల్లను గల్ల కామి నిజమరి గలఁడే. 572

వ. అని పలికి విడిచి చనిన నయ్యజవల్లభుండు సురతపరతంత్రుండై మిసిమిసి యను శబ్దంబు సేయుచుఁ దచ్ఛాగివెంటం జని యొడంబఱుపం జాలకుండె నంత దానికిఁ గర్తయైన బ్రాహ్మణుండు రోషంబున రతిసమర్థంబు గా కుండ నల్లాడుచుండ ఛాగివిభువృషణంబులు ద్రెంచివేసిన నచ్ఛాగంబు గ్రిందఁబడి వేఁడుకొనినఁ బ్రయోజనంబు వోఁడగని యోగవిదుండు గావున బ్రాహ్మణోత్తముండు గ్రమ్మఱ నయ్యజవృషణంబులు సంధించిన. 573

క. వృషణములు మరలఁ గలిగిన, సుషముండై ఛాగివిభుఁడు సుందరితోడన్
విషయసుఖంబులఁ బొందుచుఁ, దృపతుఁడు గాఁడయ్యెఁ బెక్కు దివసము లయ్యున్.

వ. అని యివ్విధంబున యయాతి దేవయానికి నిజవృత్తాంతంబు గథారూపంబున నెఱింగించి యి ట్లనియె. 575

మ. అబలా నీనిబిడాతిదుర్జయసలజ్జాపాంగభల్లంబులం
బ్రబలంబై నమనంబు భగ్నము గ నాత్రప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుం డగుకాముబారిఁ బడి నే నట్లోగ్తునే బందిక
త్తెబడిం బాపపుఁదృష్ణ [1]యిప్పు డకటా దీర్ఘాకృతిన్ రొప్పెడిన్. 576

క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు సర్వాంగకములుఁ గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలినఁ, దుది లేదీతృష్ణ దీనిఁ ద్రుంపఁగ వలయున్.

క. వెయ్యేం డ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం
గ్రుయ్యదొ కయించుకైన, నయ్యది కొన లిడియెఁ దృష్ణ నవపద్మముఖీ.

క. ముదిసెను దంతావళియును, ముదిసెను గేశములు దనువు ముదిసెం గనకున్
ముదియనివి రెండు సిక్కెను, బ్రతికెడితీపియును విషయభక్షస్పృహయున్.

క. కడ లేదాశాలతకుం, గడఁ జూడఁగ నేరరాదు కడఁ గని రేనిం
గడుముదమున సంసారము, కడఁ గందురు తత్త్వవిదులు కమలదళాక్షీ. 580

క. మండనహాటకపశువే,దండాశ్వవధూదుకూలధాన్యమ్ములు పె
క్కుండియు నాశాపాశము, ఖండింపఁగ లేవు మఱియుఁ గడమయ చుమ్మీ.

క. కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నం
గామంబు శాంతిఁ బొందునె, ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడువకునే.

ఆ. అక్క తల్లి చెల్లెలాత్మజ యెక్కిన, పాను పెక్కఁ జనదు పద్మనయన
[2]పరమయోగికైన బలిమిని నింద్రియగ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 583

---

1 'యక్కటకటా బొందెడిన్. 2 పరమయోగికైన బలిమాలునింద్రియగ్రామ మధిక మడఁచి కట్టరాగు' వ్రా. ప్ర.

క. వెంగలివై త్రాయి తిరుగుచుఁ, గంగా రై చెడక ముక్తిఁ గాంక్షించునతం
డంగనలతోడ విడువని, సంగడములు వదల వలయు జలజాతముఖీ. 584

వ. అది గావున నేఁడు మొదలు తృష్ణాఖండనంబు సేసి నిర్విషయుండ నయి యహంకారంబు విడిచి మృగంబులం గలసి వనంబున సంచరించెదఁ బరబ్రహ్మం బునందుఁ జిత్తంబు సేర్చెద బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగు టం జేసి యే నందుఁ దత్పరుండ నై యాహారనిద్రాదియోగంబులం బరిహరించెద నాత్మవిదుండ నై సంసారనాశంబులఁ దలంచినవాఁడె విద్వాంసుం డని పలికి పూరునియౌవనం బతని కిచ్చి ముదిమి దాను గైకొని విగతలోభుండ నై నిజ భుజశక్తిపాలితం బగుభూమండలంబు విభాగించి ద్రుహ్యునకుఁ బూర్వభాగంబును యదువునకు దక్షిణభాగంబును దుర్వసునకుఁ బ్రదీచీభాగంబును ననువునకు నుదీచీభాగంబును సంరక్షింపుం డని యిచ్చి వారలసమక్షంబున. 585

క. నాలుగుచెఱఁగులనేలయుఁ, బాలింపుం డనుచు నగ్రభవులను బంచెన్
భూలోక మేలు మనుచును, బాలార్కాకారుఁ బూరుఁ బట్టము గట్టెన్. 586

వ. ఇట్లు పూరునికి రాజ్యం బిచ్చి పెక్కువర్షంబులందు ననుభూతంబు లయిన యింద్రియసుఖంబులు వర్జించి. 587

క. మిక్కిలి సుజ్ఞానంబునఁ, జక్కఁగ [1]దెగ నడిచి వైరిషడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చినవిహగము, గ్రక్కున నీడంబు విడుచుకరణి నుదితుఁ డై. 588

క. కారుణికోత్తముఁ డగుహరి, కారుణ్యముకతన నతఁడు ఘనుఁ డై గెలిచెం
గ్రూరము లగువిషయంబుల, నూరక గెలువంగ శక్తుఁ డొక్కఁడుఁ గలఁడే. 589

వ. మఱియు నిర్మూలితసకలసంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడి నిర్మలం బయి పరమం బయినవాసుదేవాభిధానబ్రహ్మంబునందు యయాతిభూపాలుండు స్వతస్సిద్ధ యయినభాగవతగతిం జెందె నంత. 590

సీ. ప్రాణేశుఁ డాడినపలుకులు నగవులు, గాఁ జూడ కంతరంగమున నిలిపి
పథికులై పోవుచుఁ బానీయశాలల, జల్లగా నుండెడిజనులయట్ల
సంసారమునఁ గర్మసంబంధులై వచ్చి, యాలుబిడ్డలు మగం డనుచుఁ గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు, గా దీశమాయాప్రకల్పితంబు

తే. దీని విడుచుట దగ వని తెగువ మెఱసి, నిద్ర సాలించి మేల్కొన్న నేర్పు సాలఁ
గలిగి భార్గవి సర్వసంగములవిడిచి, హరిపరాధీన యై ముక్తిఁ గరిగె నధిప.

వ. అని యిట్లు యయాతిచరితంబు సెప్పి భగవంతుండును సర్వభూతనివాసుం డును శాంతుండును వేదమయుండును నైనవాసుదేవునికి నమస్కరించెద నని శుకుం డి ట్లనియె. 592

క. భారత నీవు జనించిన, పూరునివంశంబునందుఁ బుట్టినవారిం

---

1 దిగవిడిచి,

జారుయశోలంకారుల, ధీరుల వినిపింతు నధిక తేజోధనులన్. 593

వ. పూరునకు జనమేజయుండు జనమేజయునకుఁ బ్రాచిన్వాంసుండు నాప్రాచిన్వాంసునకుఁ బ్రవిరోధనసమన్యువు నతనికిఁ జారువుఁ బుట్టె రాచారువునకు సుద్యువు సుద్యువునకు బహుగతుండును బహుగతునకు శర్యాతియు శర్యాతికి సంయాతియు సంయాతికి రౌద్రాశ్వుండును రౌద్రాశ్వునకు ఘృతాచి యను నచ్చరలేమయందు ఋతేపువుఁ గక్షేపువు స్థలేపువుఁ గృతేపువు జలేపువు సన్నతేపువు ధర్మేపువు సత్యేపువు వ్రతేపువు వనేపువు ననువారు జగదాత్మభూతుండై నప్రాణునకు నింద్రియంబులచందంబునఁ బదుగురు గొడుకులు జన్మించి రందు ఋతేపువునకు రంతిసారుండును రంతిసారునకు సుమతియు ధ్రువుండు నప్రతిరథుండు నన ముప్వురు పుట్టి రందు నప్రతిరథునికిఁ గణ్వుండును గణ్వునికి మేధాతిథియు నతనికి బ్రస్కందుండు మొద లగుబ్రాహ్మణజాతులును జన్మించి రాసుమతికి రైభ్యుండు పుట్టె రైభ్యునకు దుష్యంతుండు పుట్టె. 594

క. పారావారపరీతో, దారధరాభారదక్షదక్షిణహస్త
శ్రీ రాజిల్లఁగ నొకనాఁ, డారాజేంద్రుండు వేఁటయం దభిరతుఁడై. 595

క. గండకకంఠీరవభే, రుండశశవ్యాళకోలగోహిమరురువే
దండవ్యాఘ్రమృగాదన, చండశరభశల్యభల్లచమరాటవులన్. 596

క. చప్పుడు సేయుచు మృగముల, గొప్పుచు నీరములయందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పడఁగఁ జోపుచుఁ, దప్పక వ్రేయుచును వేఁటతమకం బొప్పన్.

క. మృగయూథంబులవెంటను, మృగలాంఛనసన్నిభుండు మృగయాతురుఁడై
మృగయులుగొందఱుగొలువఁగ, మృగరాజపరాక్రమంబు మెఱయుచు వచ్చెన్.

వ. ఇట్లు వచ్చి వచ్చి దైవయోగంబునఁ గణ్వమహామునితపోవనంబు సేరం జని.

సీ. ఉరుతరశాఖాంతాహి యుగళంబులకుఁ బింఛ,ములు విసరెడి కేకిముఖ్యములను
[1]గరిణు లొల్లనికుంభి కలభంబులకు మేఁత, లిడుచు ముద్దాడుమృగేంద్రములను
ఘనమృగాదనములు గాపుగా లేళ్లతో, రతులు సాగించుసారంగములను
ననుపుగా హోమధేనువులకంఠంబులు, దువ్వుచు నాడుశార్దూలములను

తే. దారి కలహించు[2]నుందురు దంపతులకు, మైత్రి లంకించుమార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని యిట్లు,గలసి క్రీడించుమృగములఁ గాంచె నతఁడు.

క. ఇత్తెఱఁగున మృగజాతుల, పొత్తులు నే మెఱుఁగ మనుచు భూవల్లభుఁడుం
జిత్తములోపల నామునిస,త్తమునద్వృత్తమునకు సంతసపడుచున్. 601

క. హల్లకబిసగుహానరసీ, కల్లోలోత్ఫుల్లయూథకాగిరిమల్లీ
మల్లీమరువకకురవక, సల్లలితానిలమువలన సంతుష్టుం డై. 602

వ. దుష్యంతుండు వచ్చునవసరంబున. 603

---

1 'కరుణతో మదియుక్తకలభం' అ. ప్ర. 2 మూషిక.

క. ఇం దిందిరాళిసుందరి, యిందిందిరచికుర యున్న ♦ దిందింద శుభం
బిం దిందువంశ యనుక్రియ, నిందీవరవీథి మ్రోసె ♦ నిందిందిరముల్. 604

క. మాకందద్రునికరములు, మాకందము లగుటఁ జేసి ♦ మాకందంబుల్
మా కందము లనుకై వడి, మాకందాగ్రములఁ బికసమాజము లులిసెన్. 605

వ. అంత. 606

క. ఇం దున్న కణ్వమునికిని, వందన మొనరించి తిరిగి ♦ వచ్చెద ననుచుం
బొందుగ [1]ననుచరులను దా, నందఱ నందంద నిలిపి ♦ యటఁ జని త్రోవలన్.

శా. ఆకణ్వాశ్రమమందు నీరజనివా ♦ సాంతప్రదేశంబునన్
మాకందంబులనీడఁ గల్పలతికా ♦ మధ్యంబునన్ మందారం
భాకాండాంచితశాలలోఁ గుసుమసం ♦ పన్నస్థలిం జూచె నా
భూకాంతుండు శకుంతలన్ [2]నవవన ♦ భూపర్యటత్కుంతలన్. 608

క. దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించినచన్నుఁగవయు ♦ మిఱుమిఱుచూడ్కుల్
నట్టాడునడుముఁ దేవియ, లుట్టుడుమోవియును మనము ♦ నూరింపంగన్. 609

వ. అంత నారాజకుమారుం డలరుటమ్ములవిలుకానివెడవింట ఘుణఘుణాయమాన లయి మ్రోయుఘంటలకుం బంటించి తనమనంబున. 610

శా. వన్యాహారములన్ జితేంద్రియత నా ♦ వాసించునాకణ్వుఁ డీ
కన్యారత్నము నేగతిం గనియెడిం ♦ గా దీకురంగాక్షి రా
జన్యాపత్యము గాఁగ నోపు నభిలా ♦ షం బయ్యెఁ గా దేని నే
యన్యాయక్రియలందుఁ బౌరవుల కి ♦ ట్లాశించునే చిత్తముల్. 611

క. అడిగిన నృపసుతఁ గా నని, నొడివెడినొ కదే మనంబు ♦ నొవ్వ నని విభుం
డుడురాజవదన నడుగఁగఁ, [3]దడుమునఁ బడికొంత ప్రొద్దు ♦ దడఁబడఁ జొచ్చెన్.

వ. మఱియు నెట్టకేలకుఁ దనచిత్తసంచారంబు సత్యంబు గాఁ దలంచి యిట్లనియె.

క. భూపాలకకన్యక వని, నీపయిఁ జిత్తంబు నాటె ♦ నీవా రేరీ
నీపే రెవ్వరు నిర్జన, భూపర్యటనంబు దగవె ♦ పూర్ణేందుముఖీ. 614

వ. అని పలుకుచున్నరాజకుమారునివదనచంద్రికారసంబు నేత్రచకోరంబులవలనం ద్రావుచు నయ్యువిద విభ్రాంత యయి యున్నసమయంబున. 615

క. కంఠేకాలునిచేతం, గుంఠితుఁ డగు టెట్లు మరుఁడు ♦ కుసుమాస్త్రంబుల్
లుంఠించి గుణనినాదము, ఠంఠ మ్మన బాల నేసె ♦ రవరవ గదురన్. 616

వ. ఇట్లు వలరాజువాఁడిక్రొవ్విరిగోలలవేఁడిమిఁ దాలిమిపోఁడిమి సెడి యావాలుఁ గంటి యి ట్లనియె. 617

మ. అనివార్యప్రభ మున్ను మేనకయు వి ♦ శ్వామిత్రభూభర్తయుం
గని రా మేనక డించి పోయె నడవిం ♦ గణ్వుండు న న్నింతగా

---

1 'నన్నల మాన్యుల' వ్రా. ప్ర. 2 'నవనటమ్మాపర్యటత్కుంతలన్' అ. ప్ర. 3 దడుమన యొక.

మనిచెన్ సర్వము నామునీంద్రుఁ డెఱుఁగున్ § మద్భాగధేయంబునన్
నినుఁ గంటిం బిదపం గృతార్థ నగుదున్ § నే జీవనాంతంబునన్. 618

క. నీవారము ప్రజ లేమును, నీవారము ప్రాజ గొనుము § నిలువుము నీవున్
నీవారును మాయింటను, నీవారాన్నంబు [1]గొనుఁడు § నేఁడు నరేంద్రా. 619

వ. అని పలికిన దుష్యంతుండు మెచ్చి మచ్చెకంటియిచ్చ యెఱింగి యిట్లనియె.

ఆ. రాజతనయ వగుదు § రాజీవదళనేత్ర, మాట నిజము లోని § మాటు లేదు
తనకు సదృశుఁ డయిన § తరుణునిఁ గైకొంట, రాజసుతకుఁ దగవు § రాజవదన.

వ. అని మఱియుఁ దియ్యని నెయ్యంపుఁబలుకులవలన నయ్యువిద నియ్యకొలిపి. 622

క. బంధురయశుఁడు జగన్నుత, సంధుఁడు దుష్యంతుఁ డుచిత § సమయజ్ఞుం డై
గంధగజగమన నప్పుడు, గాంధర్వవిధిన్ వరించె § గహనాంతమునన్. 623

భరతుని చరిత్రము.

వ. ఇవ్విధంబున నమోఘవీర్యుం డగు నారాచపట్టి నపసిరాచూలికిఁ జూలు నెక్కొ-
లిపి మఱునాఁడు తనవీటికిం జనియె న య్యాతియుం గొంతకాలంబునకుఁ గొడు
కుం గనినఁ గణ్వమునీంద్రుం డారాచపట్టికి జాతకర్మాదిమంగళాచారంబు లొనర్చె
నాడింభకుండును దినదినంబునకు బాలచంద్రుండునుంబోలె నెదుగుచు. 624

క. కుంఠితుఁడు గాక నాఁడు, త్కంఠరం దనపిన్ననాఁడె § కణ్వావనచర
త్కంఠీరవముఖ్యంబుల, [2]కంఠములం బట్టి యడుచుఁ § గట్టున్ విడుచున్. 625

వ. అంత నాకణ్వమునీంద్రుండు బాలకుం జూచి శకుంతల కి ట్లనియె. 626

ఉ. పట్టపురాజు నీమగఁడు § పాపఁడు నంతకు నెక్కుడన్నిటం
బట్టపుదేవి వై గలువ § [3]బాగున నుండక పాఱువారితో
[4]గట్టువనంబులో నవయఁ § గాఁ బని లే దిటఁ గర్లి పోఁ గదే
పుట్టినయిండ్ల మానినులు § పోరచి గా ననిశంబు నుందురే. 627

వ. అని పలికిన. 628

క. ఆపిన్నవాని నతుల, వ్యాపారు నుదారు వైష్ణ § వాంశోద్భవునిం
జూపెద నంచు శకుంతల, భూపాలునికడకు వచ్చెఁ § బుత్త్రునిఁ గొనుచున్. 629

వ. వచ్చిదుష్యంతుం డున్నసభామండపంబునకుం జని నిలిచి యున్నయెడ. 630

మ. వలకేల న్నరుచక్రరేఖయుఁ బద § ద్వంద్వంబునం బద్మరే
ఖలు నొప్పారఁగ విందు వచ్చినరమా § కాంతుండు నాఁ గాంతి న
గ్గల మై యున్నకుమారు మారసదృశా § కారున్ విలోకించి తాఁ
బలుకం డయ్యె విభుం డెఱింగి సతి వి § భ్రాంతాత్మ యై వందురన్. 631

వ. ఆసమయంబున. 632

---

1. గుడువు. 2 వెంఱారించుం గలంచు విడుచుం గట్టున్. 3 భావన. 4 టట్టు వనంబులందు నవయం బని,

మ. అదె నీవల్లభ వాఁడు నీసుతుఁడు భా§ర్యాపుత్రులం బాత్రులన్
వదలం గా దలనాఁటికణ్వవనికా§వైవాహికారంభముల్
మది నూహింపు శకుంతలావచనముల్ § మాన్యంబు లౌ భూవరేం
ద్ర దయం జేకొను మంచు మ్రోసెను వియ§ద్వాణీవధూగీతముల్. 633

వ. ఇట్లశరీరవాణి సర్వభూతంబులకుఁ దేటపడ భరింపు మని పలికిన నాకుమారుండు భరతుం డయ్యె నంత నారాజు రాజవదన నంగీకరించి తనూభవుఁ జేకొని కొంత కాలంబు రాజ్యంబు సేసి పరలోకంబునకుం జనియెఁ దదనంతరంబ. 634

క. రెండవహరిక్రియ ధరణీ, మండలభారంబు నిజస§మంచితబాహా
దండమున నిలిపి తనకును, భండనమున నెదురు లేక § భరతుం డొప్పెన్. 635

వ. మఱియు నాదౌష్యంతి యమునాతటంబున దీర్ఘతపుండు పురోహితుండు గా డెబ్బదియెనిమిదియును గంగాతీరంబున నేఁబదేనుం గా నిట్లు నూటముప్పది మూఁ డశ్వమేధయాగంబులు సదక్షిణంబులు గా నొనర్చి దేవేంద్రవిభవంబున నతిశయించి పదుమూఁడువేలు నెనుబదినాలుగింటికదుపు సేరు ద్వంద్వం బనం బరఁగు నట్టివేయిద్వంద్వంబులపాఁడిమొదవులఁ గ్రేపులతోడ నలంకారసహితలం జేసి వేవురు బ్రాహ్మణుల కిచ్చి మష్కారతీర్థకూలంబున విప్రముఖ్యులకుఁ బుణ్యదినంబునఁ గనకభూషణశోభితంబు లయి ధవళదంతంబులు గలనల్లనియేనుంగులం బదునాలుగులక్షల నొసంగె దిగ్విజయకాలంబున శకశబరబర్బరకపకిరాతకహూణమ్లేచ్ఛదేశంబులరాజులఁ బీఁచం బడంచి రసాతలంబున రాక్షసకారాగృహంబులం దున్నవేల్పులగరితలం బెక్కండ్ర విడిపించి తెచ్చి వారలవల్లభులం గూర్చెఁ ద్రిపురదానవుల జయించి నిర్జరుల నిజమందిరంబుల నునిచె నతనిరాజ్యంబున గగనధరణీతలంబులు ప్రజలు గోరినకోరిక లిచ్చుచుండె నివ్విధంబున. 636

ఆ. సత్యచరితమందుఁ § జలమందు బలమందు, భాగ్యమందు లోక§పతులకంటె
నెక్కుడైనపేర్మి § నిరువదియేడువే, లేండ్లు ధరణి భరతుఁ § డేలె నధిప. 637

క. అర్థపతికంటెఁ గలిమిఁ గృ, తార్థుం డై యతులశౌర్య§ మలవడియు నతం
డర్థములను బ్రాణములను, వ్యర్థము లని తలఁచి శాంతుఁ § డయ్యె నరేంద్రా.

క. భరతునిభార్యలు మువ్వురు, వరుసం బుత్రకులఁ గాంచి § వల్లభుతోడన్
సరి గా రని తోడ్తోడను, శిరములు దునుమాడి రాత్మ§శిశువుల నధిపా. 639

వ. ఇట్లు విదర్భరాజపుత్రికలు శిశువులం జంపిన భరతుం డపుత్రకుం డై మరుత్స్తోమం బను యాగంబు పుత్రార్థి యై చేసి దేవతల మెచ్చించె నయ్యవసరంబున.

సీ. అన్నయిల్లాలిఁ జూ§లాలిని మమతాఖ్యఁ, జూచి బృహస్పతి § సురతమునకుఁ
దొరఁకొని పైపడఁ § దొల్లి గర్భంబున, నున్నబాలుఁడు భయం § బొదవి వలదు
తగ దని మొఱసేయఁ § దమకంబుతో వాని, నంధుండ వగు మన్న§నలిగి వాఁడు

యోనిలోపలివీర్య ॥ మురలఁ దన్నిన నేలఁ, బడి బిడ్డఁడై యున్నఁ ॥ బాయలేక
ఆ. నితనిఁ బెంపుకొడుకు ॥ లిరువురు జన్మించి, రనుచు వెలయఁజేయు ॥ మనిన మమతఁ
బెంపఁజాల నీవ ॥ పెంపు భరింపు మీ, ద్వాజు ననుచుఁ జనియె ॥ దాని విడిచి.
వ. ఇట్లు చథ్యునిభార్య యగుమమతయు బృహస్పతియు శిశువుం గని ద్వాజుఁడైన వీని నీవ నీవ భరింపు మని వదినెమఱందులు దమలో నొండొరువులం బలికినకారణంబున వాఁడు భరద్వాజుం డయ్యె గర్భస్థుం డయినవాఁడు బృహస్పతి శాపంబున దీర్ఘతముం డయ్యెనంత నాబృహస్పతియు మమతయు (నుదయించిన)వాని విడిచి నిజేచ్ఛం జనిన మరుత్తులు వానిం బోషించి పుత్రార్థి యయినభరతున కిచ్చి రతండు వానిం జేకొనియె వితథం బయినభరతవంశంబునకు నాభరద్వాజుండు వంశకర్త యగుటంజేసి వితథుం డనం బరఁగె నావితథునికి మన్యువు మన్యువునకు బృహత్క్షత్ర జయ మహావీర్య నర గర్గు లనువా రేగురు సంభవించి రందు నరునికి సంకృతి సంకృతికి గురుండు రంతిదేవుం డన నిరువురు జన్మించి రందు. 642

రంతిదేవుని చరిత్రము.

సీ. రాజవంశోత్తమ ॥ రంతిదేవునికీర్తి, [1]నేల చెప్పఁగ విను ॥ మింపు నందు
నారాజు దనసంచి ॥ తార్థంబు లన్నియు, నెడపక దీనుల ॥ కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై ధైర్య ॥ సంయుతుండై పేద, యై కూడు నీరు లే ॥ కధమవృత్తి
నెందేని నలువది ॥ యెనిమిదిదివసముల్, చరియింప నొకదిన ॥ సంబు రేపు
ఆ. నెయ్యి పాయసంబు ॥ నీరును గలిగిన, బహుకుటుంబభార ॥ భయముతోడ
నలసి నీరువట్టు ॥ నాఁకలియును మిక్కి, లూగవఁ జూచి కుడువ ॥ నుత్సహించె.
వ. అయ్యవసరంబున. 644
సీ. అతిథిభూసురుఁ డొక్కఁ ॥ డాహార మడిగినఁ, గడపక ప్రియముతో ॥ గారవించి
హరిసమర్పణ మంచు ॥ నన్నంబులో సగ, మిచ్చిన భుజియించి ॥ చనఁగ నాతఁ
డంతలో నొకశూద్రుఁ ॥ డశనార్థియై వచ్చి, పొడసూప లే గనఁ ॥ బోక తనకు
నున్నయన్నములోన ॥ నొకభాగ మిచ్చిన, సంతుష్టుఁడై వాఁడు ॥ సనిన వెనుక
ఆ. కుక్కగమియుఁ దాను ॥ నొక్కఁడే తేర నా,యన్నశేష మిచ్చి ॥ సన్నయంబు
లాడి మ్రొక్కి పంప ॥ నోడక చండాలుఁ, డొక్కఁ డరుగుదెంచి ॥ చక్క నిలిచి.
వ. రాజున కిట్లనియె. 646
క. హీనుఁడఁ జండాలుండను, మానవకులనాథ దప్పి ॥ మానదు నవలం
బో నేర నీకుఁ జిక్కిన,పానీయము నాకుఁ బోసి ॥ బ్రతికింపఁగదే. 647
వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి రా జిట్లనియె. 648
ఉ. అన్నము లేదు కొన్నిమధు ॥ రాంబువు లున్నవి త్రావు మన్న [2]రా

1 'యెలమిఁ జెప్పఁగఁబడు నిందు నందు' వ్రా. ప్ర. 2. 'ర మ్మన్న' అ. ప్ర.

వన్న శరీరధారులకు ◊ నాపద వచ్చిన నారియాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండుమే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ చుమ్ము పుల్కసా. 649

వ. అని పలికి. 650

మ. బలవంతం బగునీరువట్టున నిజప్రాణాంత మై యున్నచో
నలయం డేమియు వీనిహృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచున్ ◊ సర్వేశ్వరాధీనుఁ డై
జలముం బోసెను రంతిదేవుఁడు దయం ◊ జండాలపాత్రంబునన్. 651

వ. తదనంతరంబ బ్రహ్మాదిదేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు సేయం దలంచి నిజాకారంబులతో ముంగట నిలువంబడి యారాజుధైర్యపరీక్షార్థంబు దమ చేసినవృషలాదిరూప యగువిష్ణుమాయ నెఱింగించిన నాసరేంద్రుం డందఱకు నమస్కరించి. 652

క. వారల నేమియు నడుగక, నారాయణభక్తి దనమనంబున వెలుఁగన్
ధీరుం డతఁడు మాయా, పారజ్ఞుం డగుచుఁ బరమపదమునఁ బొందెన్. 653

క. ఆరాజర్షిని గొలిచిన, వా రెల్లఁ దదీయయోగవైభవమున శ్రీ
నారాయణచింతను లై, చేరిరి యోగీశు లగుచు ◊ సిద్ధపదంబున్. 654

వ. ఇట్లు రంతిదేవుండు విజ్ఞానగర్భిణి యగుభక్తివలనఁ బరమపదంబునకుం జనియె నంత గర్గునకు శిని జన్మించె శినికి గార్గ్యుండు గలిగె నాతనినుండి బ్రాహ్మణకులం బయ్యె మహావీర్యునికి సురక్షయుండును సురక్షయునకుఁ ద్రయ్యారుణి యుఁ గవియుఁ బుష్కరారుణియు నను ముమ్వురు సంభవించిరి వారును బ్రాహ్మణు లయి చనిరి బ్రహ్మక్షత్త్రునికి సుహోత్త్రుండు సుహోత్త్రునకు హస్తియు జనించి రాహస్తి దనపేర హస్తినాపురంబు నిర్మించె నాహస్తికి నజమీఢుండును ద్విమీఢుండును బురుమీఢుండును నన ముమ్వురు జనియించి రం దజమీఢునివంశంబునం బ్రియమేధాదులు గొందఱు వుట్టి బ్రాహ్మణు లయి చనిరయ్యజమీఢునికి బృహదిషువు నతనిపుత్త్రుండు బృహద్ధనువు నతనికి బృహత్కాయుండు నతనికి జయద్రథుండు నతనికి విశ్వజిత్తు విశ్వజిత్తునకు సేనజిత్తు సేనజిత్తునకు రుచిరాశ్వుండు దృఢహనువుఁ గాశ్యుండు వత్సుండు నన నలుగురు జనించి రందు రుచిరాశ్వునకుఁ బ్రాజ్ఞుండు నతనికిఁ బృథుసేనుండును బృథుసేనునికిఁ బారుండును వానికి నీపుండును నీపునికి నూర్వురు గొడుకులును బుట్టిరి మఱియును. 655

ఆ. శుకునికూఁతు రైన ◊ సుందరి సత్కృతిఁ, బొంది వేడ్క నీపభూవిభుండు
విమలయోగవిత్తు ◊ విజ్ఞానదీపితో, దారచిత్తు బ్రహ్మదత్తుఁ గనియె. 656

వ. ఆబ్రహ్మదత్తుండు జైగిషవ్యోపదేశంబున యోగతంత్రంబునం జేసి[1]గోదేవి యను
భార్యవలన విష్వక్సేనుం డనుకుమారునిం గనియె విష్వక్సేనునకు నుదక్సేనుం
డు నుదక్సేనునకు భల్లాదుండు వీరలు బార్హదిషవు లనురాజు లైరి ద్విమీఢు
నకు యమీనరుండు యమీనరునికిఁ గృతిమంతుండు గృతిమంతునికి సత్యధృతి
సత్యధృతికి దృఢనేమి దృఢనేమికి సుపార్శ్వకృత్తు సుపార్శ్వకృత్తునకు సుపా
ర్శ్వుండు సుపార్శ్వునకు సుమతి సుమతికి సన్నతిమంతుండు సన్నతిమంతునికొ
డుకు కృతి యనువాఁడు హిరణ్యనాభునివలన యోగమార్గం బెఱింగి శోకమో
హంబులు విడిచి తూర్పుదేశంబున సామసంహిత పఠియించె నతనికి నుగ్రాయుధుం
డు నుగ్రాయుధునకు క్షేమ్యుండు క్షేమ్యునకు సువీరుండు సువీరునకుఁ బురంజ
యుండు బురంజయునకు బహురథుండు జన్మించిరి హస్తికొడుకు పురుమీఢుని
కి సంతతి లేదయ్యె నజ్యమీఢునికి నళిని యనుభార్యయందు నీలుండు నీలు
నికి శాంతియు శాంతికి సుశాంతియు సుశాంతికిఁ బురుజుండుఁ బురుజునికి న
ర్కుండు నర్కునికి భర్మ్యాశ్వుండు భర్మ్యాశ్వునకు ముద్గల యవీనర బృహదిషు
కాంపిల్య సృంజయు లనువా రేవురుం బుట్టిరి. 657

క. మించినభర్మ్యాశ్వుఁడు సుత, పంచకమును జూచి విషయపంచకమును వ
ర్జించితిఁ దల మని పల్కినఁ, బాంచాలురు నాఁగ సుతులు పరఁగిరి ధరణిన్.

వ. అంత ముద్గలునినుండి బ్రాహ్మణకులం బై ముద్గలగోత్రంబు నా నెగడె భర్మ్యా
శ్వపుత్త్రుం డైనయాముద్గలునికి దివోదాసుండు నహల్య యనుకన్యకయును
బుట్టె రహల్యయందు గౌతమునికి శతానందుండు పుట్టె శతానందునికి ధను
ర్వేదవిశారదుం డయిన సత్యధృతి పుట్టె నతం డొకనాఁడు వనంబున నూర్వశిం
గనిన నతనికి రేతఃపాతం బై తద్వీర్యంబు శరస్తంబంబునం బడి మిథునం బయ్యె
నాసమయంబున. 659

క. చపలరతి శంతనుం డను, నృపవరుఁ డడవికిని వేఁట నెపమునఁ జనుచుం
గృపతో శిశుయుగముం గని, కృపియుఁ గృపుం డనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్.

వ. ఆకృపి ద్రోణునకు భార్య యయ్యె దివోదాసునకు మిత్రాయువు మిత్రాయువు
నకుఁ జ్యవనుఁడుఁ జ్యవనునకు సుదాసుండు సుదాసునకు సహదేవుండు సహదేవు
నకు సోమకుండు సోమకునకు సుజన్మకృత్తు సుజన్మకృతునకు నూర్వురుకొడుకు
లుం గలిగిరి వారిలో జంతు వనువాఁడు జ్యేష్ఠుండు కడచూలు పృషతుండు పృ
షతునకు ద్రుపదుండు ద్రుపదునకు ధృష్టద్యుమ్నాదు లయినకొడుకులును
ద్రౌపది యనుకూఁతురుం గలిగిరి ధృష్టద్యుమ్నునకు ధృష్టకేతువు పుట్టె వీరలు
పాంచాలరాజు లని యెఱుంగుము మఱియు నజ్యమీఢునికొడుకు ఋక్షుండు
ఋక్షునకు సంవరణుం డాసంవరణుండు తపతి యనియెడిసూర్యకన్యయందుఁ

1 సరస్వతివలన.

గురువుం గనియె నాకురువుపేరం గురుక్షేత్రం బయ్యె నాకురువునకుఁ బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుండు ననువారు నలువురు పుట్టి రందుఁ బరీక్షిత్తు కొడుకులు లేక చనియె సుధనువునకు సుహోత్రుం డతనికిఁ జ్యవనుండు చ్యవనునకుఁ గృతి గృతికి వసువు వసువునకు బృహద్రథకుసుంభమత్స్యప్రత్యగ్రచేదిపాదులు పుట్టి రందు బృహద్రథునకుఁ గుశాగ్రుండు గుశాగ్రునికి ఋషభుండు ఋషభునికి సత్యహితుండు సత్యహితునికిఁ బుష్పవంతుండు పుష్పవంతునకు జహ్ను వనువాఁడు మఱియును. 661

సీ. ఆబృహద్రథునకు నన్యభార్యాగర్భ, మున రెండు తునుఖండకములు జనించెఁ
దునుకలు గని తల్లి తొలఁగంగ వైచిన, సంధించె నొకటిగా జర యనంగ
నొకదైత్యకాంత వాఁ డొప్పె జరాసంధుఁ, డన గిరివ్రజపుర మాతఁ డేలె
నతనికి సహదేవుఁ డతనికి సోమాపి, తనయుఁ డాతనికి శ్రుతశ్రవుండు

తే. జహ్నుపుత్రుండు సురథుండు జనవరేణ్య, యతనికొడుకు విదూరథుఁ డతనిపట్టి
సార్వభౌముండు వానికి సంభవుండు, విను జయత్సేనుఁ డనువాఁడు విమలకీర్తి.

వ. ఆజయత్సేనునికి రథికుండు రథికునకు నయుతాయువు నయుతాయువునకుఁ గ్రోధనుండుఁ గ్రోధనునకు దేవాతిథియు దేవాతిథికి ఋక్షుండు ఋక్షునికి భీమసేనుండు వానికిఁ బ్రతీపుండుఁ బ్రతీపునకు దేవాపి శంతను బాహ్లకు లన మువ్వురు గొడుకులు పుట్టి రందు. 663

సీ. దేవాపి రాజ్యంబు దీర్ప నొల్లక వనం, బున కేఁగెఁ దమ్ముండు పూర్వజన్మ
మందు మహాభిషుఁ డనియెడువాఁడు శంతనుఁ డయ్యె వాఁడె యీధాత్రి నెల్ల
నేలుచుఁ గరముల నెవ్వృద్ధు ముట్టిన, వాఁ డెల్ల నిండుజవ్వనము నొందు
నతఁడు శాంతిప్రాప్తుఁ డై యున్న దానఁ బం, డ్రెండేండ్లు వజ్రి వర్షింప కున్న

ఆ. వృష్టి లేనిచొప్పు విప్రుల నడిగిన, నన్న యుండఁ దమ్ముఁ డగ్నిహోత్ర-
దారసంగ్రహంబు దాల్చినఁ బరివేత్త, యండ్రు గాన నీవ యతఁడవైతి. 664

వ. అది కారణంబుగా నన్న యుండఁ దమ్ముండు రాజ్యార్హుండు గాఁడు నీవు పరివేత్తవు మీయన్నకు రాజ్యం బిచ్చిన ననావృష్టిదోషంబు సెడు నని బ్రాహ్మణులు పల్కిన శంతనుండు వనంబునకుం జని దేవాపికిఁ బ్రియంబు సెప్పి రాజ్యంబు సేకొమ్మని పల్కె నంతకు మున్న [1]వానితండ్రి దేవాపిని రాజ్యంబున కర్హుం జేయం దలంచి విప్రులం బిలిచిన నావిప్రులు పాషండమతవాక్యంబులు దేవాపికి నుపదేశించిన దేవాపి వేదంబుల నిందించిన పాషండుండును దేవదూషకుండును నయ్యెం గావున దేవాపికి రాజ్యంబు లే దని బ్రాహ్మణులు సెప్పిన శంతనుండు మగిడి వచ్చి రాజ్యంబుఁ జేకొనియె నంత వర్షంబును గురిసె నివ్విధంబున. 665

క. దేవాపి కలాపపురం, బావాసము గాఁగ యోగి యై యున్నాఁడు

1 వానిమంత్రి దేవాపిని బాషండునిం జేసి.

రీశ్వర కలి నష్టం బగు, జైవాతృకకులము మీఁద సంస్థాపించున్. 666

వ. బాహ్లీకుం డనువానికి సోమదత్తుండు పుట్టె సోమదత్తునకు భూరియు భూరిశ్రవసుఁడును శలుండు ననువారు మువ్వురు పుట్టిరి. 667

క. భాతిగ శంతనునకు గం, గాతటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతినయననీలోత్పల, భీతికరగ్రీష్ముఁ డైనభీష్ముఁడు పుట్టెన్. 668

ఆ. పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప, నన్యు నొకని నెఱుఁగ మతనిఁ దక్క
వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు, వేల్పుటేటిపట్టి విమలయశుఁడు. 669

వ. ఆశంతనునకు దాశకన్యక (యైనసత్యవతి)యందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులు పుట్టి రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుం డయ్యె మఱియును. 670

ఉ. సత్యవతీవధూటి మును శంతనుపెండ్లము గానినాఁడు సాం
గత్యమునం బరాశరుఁడు గర్భము సేసిన బాదరాయణుం
డత్యుదితుండు శ్రీహరికళాంశజుఁ డై [1]ప్రభవించె నిత్యముల్
సత్యము లైనవేదముల సాంగముల్ విభజింప దక్షుఁ డై. 671

ఆ. బాదరాయణుండు భగవంతుఁ డనఘుండు, పరమగుహ్య మైనభాగవతము
నందనుండ నయిననాకుఁ జెప్పెను శిష్య,జనుల మొఱఁగి యేను జదువుకొంటి.

వ. ఆవిచిత్రవీర్యునికిఁ గాశిరాజుకూఁతుల నంబికాంబాలికల భీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చి వివాహంబు సేసిన విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుం డై చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు రాజయక్ష్మపీడితుం డై మృతుం డయ్యె నంత. 673

క. అతనిసతులవలన సుతుల, సుత కను మని తల్లి వనుప సొరిదిం గనియెన్
ధృతరాష్ట్రపాండువిదురుల, నుతచరితుఁడు బాదరాయణుండు నరేంద్రా. 674

వ. అందు ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధనాదు లగుకొడుకులు నూర్వురును దుశ్శల యనుకన్యకయును జన్మించిరి మృగశాపభయంబునం జేసి భార్యం బొంద వెఱచినపాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసాదంబున యుధిష్ఠిరభీమార్జును లనుమువ్వురును మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకుల సహదేవు లనువారిద్దఱును గా నేవురు పుట్టి ర య్యేవురకును ద్రుపదరాజపుత్రి యైన ద్రౌపదియందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును శ్రుతసేనుండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతకర్ముండును నన నేవురు పుట్టిరి. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును గాళియందు సర్వగతుండును సహదేవునికి విజయయందు సుహోత్రుండును నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును నర్జునునకు నులూపి యనునాగక

1 'జనియించెఁ జోరహృద్దైత్యకరావకృష్టమిళితస్థితవేదవిభాగదక్షుఁ డై' వ్రా. ప్ర.

న్యకయందు నిరావంతుండును మణలూరుపతిపుత్రి యయిన చిత్రాంగదయందు బభ్రువాహనుండును సుభద్రయందు (శౌర్యధైర్య తేజోవిభవంబుల నఖిలరాజనికరంబునం బ్రఖ్యాతుం డైన)యభిమన్యుండును జన్మించి రందు బభ్రువాహనుం డర్జునునియోగంబున మాతామహునిగోత్రంబునకు వంశకర్త యయ్యె. 675

ఉ. అన్యసుపూజ్యు నీజనకుఁ డై యభిమన్యుఁడు భూవరేంద్రమూ
ర్ధన్యుఁడు ధన్యమార్గణకదంబవిదారితవైరివీరరా
జన్యుఁడు జన్యభీతకురుసైన్యుఁడు సైన్యసమూహనాథధృ
ద్యుమ్నుఁడు మాన్యకీర్తిమహిమం దనరెం గురువంశకర్త యై. 676

వ. ఆయభిమన్యునకు నుత్తరయందు నీవు జన్మించితివి. 677

క. ద్రోణసుతుతూపు వేఁడిమిఁ, బ్రాణంబులఁ బాసి హరికృపాదర్శనసం
త్రాణంబున బ్రదికితి కా, క్షోణీశ్వర మున్ను నీశిశుత్వము వేళన్. 678

వ. నీకుమారులు జనమేజయశ్రుతసేనభీమసేనోగ్రసేను లనునల్వురు వీరలయందు.

ఆ. నీవు తక్షకాహినిహతుండ వని విని, సకలసర్పలోకసంహృతము గ
సర్పయాగ మింక జనమేజయుఁడు సేయఁ, గలఁడు పూర్వరోషకలితుఁ డగుచు.

వ. మఱియు నతండు సర్వధరణీమండలంబును జయించి కావషేయుండు పురోహితుండు గా నశ్వమేధంబు సేయంగలవాఁడు వానికి శతానీకుండు జనియించి యాజ్ఞవల్క్యునితోడ వేదంబులు పఠించి కృపాచార్యునివలన విలువిద్య నేర్చి శౌనకునివలన నాత్మజ్ఞానంబుఁ బడయంగలవాఁ డాశతానీకునికి సహస్రానీకుండు వానికి నశ్వమేధజుం డశ్వమేధజునికి నాసీమకృష్ణుం డాసీమకృష్ణునకు నిచకుం (డానిచకుండు గజాహ్వయంబు నదిచే హృతంబు గాఁ గౌశాంబియందు వసియించు) నాతనికి నుప్తుం డుప్తునికిఁ జిత్రరథుండు చిత్రరథునకు శుచిరథుండు శుచిరథునికి వృష్టిమంతుండు వృష్టిమంతునికి సుషేణుండు సుషేణునికి సుపీతుండు సుపీతునికి నృచక్షువు నృచక్షువునకు సుఖానిలుండు సుఖానిలునికిఁ బరిప్లవుండు బరిప్లవునకు మేధావి మేధావికి సునయుండు సునయునికి నృపంజయుండు నృపంజయునికి దూర్వుండు దూర్వునికి నిమి నిమికి బృహద్రథుండు బృహద్రథునకు సుదాసుండు సుదాసునికి శతానీకుండు శతానీకునకు దుర్దమనుండు దుర్దమనునికి విహీనరుండు విహీనరునికి దండపాణి దండపాణికి మితుండు మితునకు క్షేమకుండు క్షేమకునకు బ్రహ్మక్షత్త్రుండు [1]వాఁడు నిర్వంశుం డై దేవర్షిసత్కృతుం డై కలియుగంబునందుఁ జనం గలవాఁడు. 681

క. జగతి నిటమీఁదఁ బుట్టెడు, మగధాధీశ్వరుల నిఖిలమనుజేశ్వరులన్
నిగమాంతవిదులఁ జెప్పెద, సుగుణాలంకార ధీర సుభగవిచారా. 682

వ. జరాసంధపుత్త్రుం డైన సహదేవునికి మార్జాలి మార్జాలికి శ్రుతశ్రవుండు శ్రుత

1 వానివలన వంశంబు సాఁగ దయ్యె మఱియు,

శ్రవునకు నయుతాయువు నయుతాయువునకు నిరమిత్త్రుండు నిరమిత్త్రునకు సున
క్షత్త్రుండు సునక్షత్త్రునికి బృహత్సేనుండు బృహత్సేనునికిఁ గర్మజిత్తు గర్మజిత్తు
నకు శ్రుతంజయుండు శ్రుతంజయునకు విప్రుండు విప్రునకు శుచి శుచికి క్షే
ముండు క్షేమునికి సువ్రతుండు సువ్రతునకు ధర్మనేత్రుండు ధర్మనేత్రునకు
శ్రుతుండు శ్రుతునకు దృఢసేనుండు దృఢసేనునికి సుమతి సుమతికి సుబలుండు
సుబలునకు సునీతుండు సునీతునకు సత్యజిత్తు సత్యజిత్తునకు విశ్వజిత్తు విశ్వజిత్తు
నకుఁ బురంజయుండును జన్మించెద రని చెప్పి మఱియు ని ట్లనియె. 683

ఆ. వినుము మగధదేశ విభులు జరాసంధ, [1]ప్రముఖధరణిపతులు ప్రబలయశులు
వీరు కలియుగమున వేయేండ్లలోపలఁ, బుట్టి గిట్టఁ గలరు భూవరేంద్ర. 684

వ. యయాతికొడు కనువునకు సభానరుండుఁ జక్షువుఁ బరోక్షుండు ననువారు ము
గ్గురు పుట్టి రందు సభానరునికిఁ గాలనాథుండు గాలనాథునకు సృంజయుండు
సృంజయునకుఁ బురంజయుండుఁ బురంజయునకు జనమేజయుండు జనమేజయు
నకు మహాశాలుండు మహాశాలునికి మహామనసుండు మహామనసునకు నుశీన
రుండు తితిక్షు వన నిరువురు జన్మించి రందు నుశీనరునకు శిబివనక్రమిదర్పు లన
నలువురు జన్మించి రందు శిబికి వృషదర్ప సువీర మద్ర కేకయులు నలువురు
పుట్టిరి తితిక్షునకు రుశద్రథుండు రుశద్రథునకు హేముండు హేమునకు సుత
పుండు సుతపునకు బలియుఁ బుట్టె నాబలికి నంగవంగకళింగసింహపుండ్రాం
ధ్రు లను పేళ్లు గలవా రార్వురు కుమారులు పుట్టిరి వారలు దూర్పుదేశంబున
కు రాజు లయి దేశంబులకుఁ దమతమనామధేయంబు లిడి యేలిరి సువీరునకు
సత్యరథుండు సత్యరథునికి దివిరథుండు దివిరథునికి ధర్మరథుండు ధర్మరథునకుఁ
జిత్రరథుండుఁ బుట్టె నాచిత్రరథుండు రోమపాదుండు నాఁ బరఁగె. 685

క. సంతతి లేనికతంబునఁ, జింతించుచు నుండ నతని చెలికాఁ డగుధీ
మంతుఁడు దశరథుఁ డతనికి, సంతతిగా నిచ్చె నాత్మజను శాంతాఖ్యన్. 686

వ. అంత రోమపాదుండు దనకూఁతురు శాంతి యని కైకొని మెలంగుచుండ నా
రాజు రాజ్యంబునఁ గొంతకాలంబు వర్షంబు లేమికిం జింతించి విభాండకసుతుం
డైనఋశ్యశృంగుండు వచ్చిన వర్షంబు గురియు నని పెద్దలవలన నెఱింగి. 687

క. ఆరాజు ఋశ్యశృంగుని, ఘోరతపోనియముఁ దెచ్చుకొఱకై పనిచెన్
వారసతుల నేర్పుల ను, దారస్తనభారభీరుతరమధ్యగలన్. 688

వ. వారును జని. 689

ఆ. కాంతలార మెకము గన్నది మొదలుగా, నాఁడువారి నెఱుఁగఁ డడవిలోన
గోఁచి బిగియఁగట్టుకొనినయాఁవడుగని, మత్తిఁ గాని రతికి మరపవలయు. 690

వ. అని పలుకుచు. 691

---

1 ధరణిపతులు బాహుదర్పయుతులు.

క. ఆడుచుఁ జెవులకు నింపుగఁ, బాడుచు నాలోకనిశితబాణౌఘములన్
వీడుచు డగ్గఱ నోడుచుఁ, జేడియ లాతని బిసివడుగుఁ జేరిరి కలఁపన్. 692

వ. అయ్యవసరంబున వారలం జూచి. 693

సీ. మిళితాళినీలధమ్మిల్లభారంబులు, చారుజటావిశేషంబు లనియు
భర్మాంచలోజ్జ్వలప్రభదుకూలంబులు, తతచర్మవస్త్రభేదంబు లనియు
బహురత్నకీలితభాసురదామంబు, లధికరుద్రాక్షమాలాదు లనియు
మలయజమృగనాభిమహితలేపంబులు, బహువిధభూతిలేపంబు లనియు

తే. మధురగానంబు శ్రుతియుక్తమంత్రజాతు, లనియు వీణెలు దండంబు లనియు సతుల
మూర్తు లెన్నఁడు నెఱుఁగని ముగుదతపసి, వారిఁ దాపసులని యవచ్చి మ్రొక్కె.

వ. ఇట్లు వచ్చి మ్రొక్కిన ఋశ్యశృంగుం జూచి నగుచు డగ్గఱి. 695

సీ. సేమమే యని సతుల్ సేతుల గ్రుచ్చి కర్కశకుచంబులు మోవఁ గౌఁగిలించి
చిరతపోనియతి డస్సితి గదా యని మోముఁ, గందువ యనునాభిఁ గలయఁ బుడికి
క్రొత్తదీవన లివి గొను మని పీనుల, పొంత నాలుకలఁ జప్పళ్లు చేసి
మావనంబులపండ్లు మంచివి తిను మని, పెక్కులడ్వాంబులు ప్రీతి నొసఁగి

ఆ. నూతనాజినంబు నును పిది మే లని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి
మాని మరగఁ జేసి మాపర్ణశాలకుఁ, బోద మనుచుఁ గొంచుఁ బోయి రతని.

వ. ఇట్లు హరిణీసుతుండు కాంతాకటాక్షపాశబద్ధుం డై వారలవెంటం జని రోమపాదుకడకుం బోయిన నతండు దనప్రియనందన యైన శాంత నిచ్చి పురంబున నునిచికొనియె నమ్మునీశ్వరుండు వచ్చిన (వర్షప్రతిబంధదోషంబు సెడి) వర్షంబు గురిసె నంత. 697

ఆ. ఆనృపాలచంద్రుఁ డనపత్యుఁ డై యుండ, నెఱిఁగి మునికులేంద్రుఁ డింద్రుఁ గూర్చి
యిష్టి చేసి సుతుల నిచ్చె నాతనికృపఁ, బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల.

వ. ఆరోమపాదునకుఁ జతురంగుండును జతురంగునకుఁ బృథులాక్షుండును బృథులాక్షునికి బృహద్రథుండు బృహత్కర్ముండు బృహద్భానుండు ననువారు మువ్వురు పుట్టి రందు బృహద్రథునకు బృహన్మనసుఁడు బృహన్మనసునకు జయద్రథుండు జయద్రథునకు విజయుండు విజయునకు సంభూతి యనుభార్యయందు ధృతియు నాధృతికి ధృతవ్రతుండు ధృతవ్రతునకు సత్యకర్ముండు సత్యకర్మునకు నతిరథుండును జన్మించిరి. 699

ఆ. కుంతి పిన్ననాఁడు గోరి సూర్యునిఁ బొంద, బిడ్డఁ డుదితుఁ డైనఁ బెట్టెఁ బెట్టి
గంగనీట విడువఁ గని యతిరథుఁ డంత, గర్ణుఁ డనుచుఁ గొడుకు గారవించె.

వ. ఇట్లతిరథునకుఁ గానీనుం డైనకర్ణుఁడు కొడు కయ్యెఁ గర్ణునకు వృషసేనుండు పుట్టె

---

1 తే. చర్మవస్త్రము వదలించి చర్మకాంతి, మించి చెలఁగుపీతాంబర మిచ్చి వెసను, మనము పొక్కంగ నతనిఁ జేకొనఁగ వారి, మఱుఁగునకుఁ జేరు నతఁడు వే మరగి వారి.

నయ్యయాతికొడుకైన ద్రుహ్యునకు బభ్రుసేతువు బభ్రుసేతువునకు నారబ్ధుండు నారబ్ధునకు గాంధారుండు గాంధారునకు ఘర్మ్ముండు ఘర్మ్మునకు ఘృతుండు ఘృతునకు దుర్మ్మదుండు దుర్మ్మదునకుఁ బ్రచేతసుండు బ్రచేతసునకు నూర్గురు పుట్టి మ్లేచ్ఛపతులయి యుదగ్దిశ నాశ్రయించిరి తుర్వసునకు వహ్ని వహ్నికి భర్గుండు భర్గునకు భానుమంతుండు భానుమంతునకుఁ ద్రిసానువుఁ ద్రిసానువునకుఁ గరంధముండును గరంధమునకు మరుత్తుండు నతనికి యయాతిశాపంబున సంతతి లే దయ్యె వినుము. 701

## యదువంశచరిత్రము.

చ. అనఘ యయాతి పెద్దకొడుకైన యదుక్షితిపాలువంశముం
 బినినఁ బఠించినన్ నరుఁడు వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న
 య్యనుపమమూర్తి విష్ణుఁడు నరాకృతిఁ బొంది జనించెఁ గావునన్
 వినుము నరేంద్ర నీకు నది వీనులపండువు గాఁగఁ జెప్పెదన్. 702

వ. యదువునకు సహస్రజిత్తుఁ గ్రోష్టువు నలుండు రిపుండు ననువారు నలువురు సంభవించి రందుఁ బెద్దకొడుకైన సహస్రజిత్తునకు శతజిత్తు గలిగె నాశతజిత్తునకు మహాహయ వేణుహయ హేహయు లనువారు ముువ్వురు జనించి రందు హేహయునకు ధర్మ్ముండు ధర్మ్మునకు నేత్రుండు నేత్రునకుఁ గుంతి గుంతికి మహిష్మంతుండు మహిష్మంతునికి భద్రసేనుండు భద్రసేనునకు దుర్మ్మదుండు దుర్మ్మదునికి ధనికుండు ధనికునికిఁ గృతవీర్య కృతాగ్ని కృతకర్మ కృతౌజు లను నలుగురు సంభవించి రందుఁ గృతవీర్యునికి నర్జునుండు జనియించె నతండు మహాబుద్ధిబలంబున.

సీ. హరికళాసంజాతుఁ డైన దత్తాత్రేయు, సేవించి సద్యోగసిద్ధిఁ బడసి
 బహుయజ్ఞదానతపంబులు గావించి, సకలదిక్కులు గెల్చి జయముతోడ
 సతతంబు హరినామసంకీర్తనము సేసి. ధనముల నమ్మ కుదారవృత్తి
 నెనుబదియేను వేలేండ్లు భూచక్రంబు, [1]ఘనకీర్తిఁ దనపేరు గాఁగ నేలె

ఆ. ముదిమి లేక తరుణమూర్తియై యురుకీర్తి,నమరెఁగార్తవీర్యుఁ[2]డనఁగ విభుఁడు
 నిజము వానిభంగి నేల యేలినయట్టి, రాజు నెఱుఁగ మెందు రాజముఖ్య.

వ. అయ్యర్జునునకుం గలవేవురుగొడుకులం బరశురాముని బారికిం దప్పి జయధ్వజుండు శూరసేనుండు వృషణుండు మధువు నూర్జితుండు ననువా రేవురు బ్రదికిరి జయధ్వజునకుఁ దాళజంఘుండును దాళజంఘునకు నౌర్వముని తేజంబున నూర్వురు గొడుకులును గలిగి రందుఁ బ్రథముండు వీతిహోత్రుండు మధువునకు వృష్ణుండు వృష్ణునకుఁ బుత్రశతంబు పుట్టె నావంశంబువారు మాధవులును బ్రథముండు వృష్ణి గాన వృష్ణులు యాదవులు ననం బరఁగిరి యదువు రెండవపుత్రుండైన క్రోష్టువునకు వృజినవంతుండు వృజినవంతునకు శ్వాహితుఁడు శ్వాహితు

1 గలవెల్ల. 2 డర్జునుండు.

నకు రుశేకుండు రుశేకునకుఁ జిత్రరథుండు చిత్రరథునకు శశిబిందుండుఁ బుట్టిరి. 705

మ. కృశమధ్యల్ పదివేవు [1]రంగనలతోఁ గ్రీడం బ్రమోదింప స
త్కుశలుం డై పదివేలలక్షలు సుపుత్రుల్ భక్తి సేయం జతు
ర్దశరత్నుండును యోగి నాఁ బరఁగి సప్తద్వీపరాజేంద్రుఁ డై
శశిబిందుం డురుకీర్తిమంతుఁ డమరెన్ సత్కాంతిపూర్ణేందుఁ డై. 706

వ. అతనికొడుకులమొత్తంబునకు ముఖరు లయినయార్వురలోఁ బృథుశ్రవుం డను వానికి ధర్ముండు పుట్టె ధర్మునకు నుశనుండు పుట్టి నూ అశ్వమేధంబులు సేసె నయ్యుశనునకు రుచికుండు పుట్టె నారుచికునకుఁ బురుజిత్తు రుక్ముండు రుక్మేషువుఁ బృథువు జ్యామఘుండు ననువా రేవురు పుట్టి రందు జ్యామఘుండు. 707

సీ. తొట్రుకొల్పెడుశైబ్యతోడిప్రేమంబున, ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ
గైకొన కొకకొంతకాలంబునకుఁ బోయి, పగవారియింటను బలిమిఁ బట్టి
యొకకన్యఁ దేరిపై నునిచి తోడ్తేరంగ, జననాథుఁ గన్యను శైబ్య సూచి
కోపించి మానవకుహక యీపడుచును, దెచ్చి యే నుండెడి తేరిమీఁదఁ

ఆ. బెట్టినాఁడ వనుచు బిఱుసులు [2]వలుకంగ, నతఁడు వలికె నంత నతివతోడ
నాకుఁ గోడ లింత నమ్ము మీలలితాంగి, సవతి గాదు నీకు సత్య మనుచు.

ఎ. అయ్యవసరంబున శైబ్య కొడుకుం గాంచు నని యెఱింగి విశ్వేదేవతలును బితృదేవతలును సంతసించిరి వారలప్రసాదంబున నంత. 709

క. [3]తనసవతి మొఱఁగి పెనిమిటి, తనుఁ బొందిన శైబ్య మఱి విదర్భునిఁ గనియెం
దనయుఁ గని జ్యామఘుండును, దన తెచ్చినకన్యఁ దెచ్చి తనయున కిచ్చెన్.

వ. ఆకన్యకయందు విదర్భునకుఁ గుశుండును గ్రథుండును రోమపాదుండునుం బుట్టి రారోమపాదునకు బభ్రువు బభ్రువునకు విభువు విభువునకుఁ గృతి గృతికి నుశికుం డుశికునకుఁ జేది చేదికిఁ జైద్యాదులు పుట్టిరి క్రథునకుఁ గుంతి గుంతికి ధృష్టి ధృష్టికి నిర్వృతి నిర్వృతికి దశార్హుండు దశార్హునకు వ్యోముండు వ్యోమునకు జీమూతుండు జీమూతునకు వికృతి వికృతిక భీమరథుండు భీమరథునకు నవరథుండు నవరథునకు దశరథుండు దశరథునకు శకుని శకునికిఁ గుంతి గుంతికి దేవరాతుండు దేవరాతునకు దేవక్షత్రుండు దేవక్షత్రునకు మధువు మధువునకుఁ గురువశుండు గురువశునకు నను వనువునకుఁ బురుహోత్రుం డతనికి నంశు వతనికి సాత్వతుండు సాత్వతునకు భజమానుండును భజియును దివ్యుండును వృష్ణియు దేవావృధుండును నందకుండును మహాభోజుండును నన నేడ్గురు పుట్టి రందు భజమానునకుఁ బ్రథమభార్యయందు నిమ్రోచికంకణవృష్ణులు

1 'రంగనలునుం గ్రీడింప మోదించుతత్కుశలుం. 2 వలుకుచు గోడ్డునీఁగఁ గాంతుఁ గోడుకు నాకుఁ గోడలయ్యె నమ్ము మీలలితాంగి, సవతిగాదు వినుము సత్యమనియె. 3 తనచలువలంతిపెనిమిటి.'

మువ్వురును రెండవభార్యయందు శతజిత్తు సహస్రజిత్తు నయుతజిత్తు నన మువ్వు
రును బుట్టి రందు దేవాపృధునికి బభ్రువు వీర లిరువుర ప్రభావంబులఁ బెద్దలు
శ్లోకరూపంబునఁ బఠియింతు రట్టి శ్లోకార్థం బెట్టి దనిన. 711

తే. వినుము దూరంబునం దేమి వినుచు [1]నుండు
మదియ చూతుము డగ్గఱి నరుగుదేర
నరులలో బభ్రుకంటె నున్నతుఁడు లేఁడు
యోజ దేవాపృధున కెన యొరుఁడు గలఁడె. 712

క. పదునాలుగువేవురు నఱు, వదియేవురు నరులు ముక్తి వడసిరి బభ్రుం
డుదితుఁడు దేవాపృధుఁడును, బదపడి యోగంబుఁ దెలియఁ బలికినకతనన్.

వ. మహాభోజుం డతిధార్మికుండు వానివంశంబువారు భోజు లని పలుకంబడిరి
వృష్ణికి సుమిత్త్రుండు యుధాజిత్తును జన్మించి రందు యుధాజిత్తునకు శినియు
ననమిత్త్రుండును జనించి రనమిత్త్రునికి నిమ్నుండు నిమ్నునికి సత్రాజితుండుఁ బ్రసే
నుండు నన నిరువురు పుట్టిరి మఱియు ననమిత్త్రునికి శిని యనునాఁడు వేఱొ
కండు గలఁ డతనిపుత్త్రుండు సత్యకుండును నతనికి యుయుధానుం డనం బరఁగిన
సాత్యకియు నాసాత్యకికి జయుండును జయునకుఁ గుణియు నాకుణికి యుగంధరుం
డునుం బుట్టిరి మఱియు ననమిత్త్రునకుఁ బృశ్ని యనువేఱొకకొడుకు గలఁడు వా
నికి శ్వఫల్కచిత్రకులు గలిగి రందు శ్వఫల్కునకు గాందినియం దక్రూరుండును
నసంగుండును సారమేయుండును మృదుకుండును మృదుపచ్ఛివుండును వర్మ
దృక్కును ధృష్టవర్మ్మండును క్షేత్రోపేక్షుండును నరిమర్దనుండును శత్రుఘ్నుం
డును గంధమాదనుండును బ్రతిబాహువును ననువారు పన్నిద్దఱు గొడుకులును
సుచారు వనుకన్యకయు జనించిరి వారియం దక్రూరునికి దేవలుండు ననుపదేవుం
డునుం బుట్టిరి మఱియుఁ జిత్త్రునకుఁ బృథుండును విదూరథుండును మొదలుగాఁ
గలవారు పెక్కండ్రు వృష్ణివంశజాతు లైరి భజమానుండు కుకురుఁడు శుచి
కంబళబర్హిషుండు నన నలువు రంధకునకుఁ బుట్టిరి కుకురునికి వృష్ణి వృష్ణికి విలో
మతనయుండు విలోమతయునికిఁ గపోతరోముండు గపోతరోమునికిఁ దుంబురుస
ఖుం డైనయనువును ననువునకు దుందుభి దుందుభికి దవిద్యోతుండు దవిద్యోతు
నకుఁ బునర్వసువు నతనికి నాహుకుం డనుకుమారుండు నాహుకికి యనుకన్యయుం
గలిగె నాయాహుకునికి దేవకుం డుగ్రసేనుండు నన నిరువురు జనించి రందు దేవ
కునికి దేవలుం డనుపదేవుండు సుదేవుండు దేవవర్ధనుం డన నలుగురు గలిగిరి
వారలకు ధృతదేవయు శాంతిదేవయు నుపదేవయు శ్రీదేవయు దేవరక్షితయు
సహదేవయు దేవకియు ననఁ బరఁగినకూఁతు లేడ్వురు గలిగిరి వినుము. 714

క. అసదృశలలితాకారలఁ, గిసలయకరతలల దేవకీముఖ్యల నా

1 నుండు నదియ చూచును డగ్గఱి నరుగుదెంచి,

బిసరుహనయనల నందఱ, వసుదేవుఁడు పెండ్లియాడె ♦ వసుధాధీశా. 715

వ. ఉగ్రసేనునకుఁ గంసుండును న్యగ్రోధుండును సునామకుండును గహ్వుండును శంకుండును సుభువును రాష్ట్రపాలుండును విసృష్టుండును దుష్టిమంతుండును నన గలవారు దొమ్మండ్రు కొడుకులును గంసయుఁ గంసవతియు సురాభువును రాష్ట్రపాలికయు ననుకూఁతులుం బుట్టిరి వారు వసుదేవానుజభార్య లైరి భజమానునికి విడూరథుండును విడూరథునికి శినియు నతనికి భోజుండు భోజునికి హృదికుండునుం గలిగి రందు హృదికునికి దేవమీఢుండు శతధనువు కృతవర్మయు ననుకొడుకులు గలిగి రా దేవమీఢుండు శూరుండు నన బడు శూరునికి మారిష యనుభార్యయందు వసుదేవుండును దేవభాగుండును దేవశ్రవుండును నానకుండును సృంజయుండును శ్యామకుండును గంకుండును నసీకుండును వత్సకుండును వృకుండును ననువారు పదుగురు గొడుకులును బృథయు శ్రుతదేవయు శ్రుతకీర్తియు శ్రుతశ్రవసయు రాజాధిదేవియు ననుకూఁతు లేవురును బుట్టి రందు. 716

వసుదేవునివంశక్రమానువర్ణనము.

ఉ. ధీనయశాలి యైనవసు ♦ దేవుఁడు పుట్టినవెంట మింటిపై
నానకదుందుభుల్ మొరసె ♦ నచ్యుతుఁ డీతనికిం దనూజుఁ డై
మానుగఁ బుట్టు నంచు గరి♦మంబున దేవత లుబ్బ రాజపం
చానన తన్నిమిత్తమున ♦ నానకదుందుభి యయ్యె వాఁ డిలన్. 717

క. తనచెలికాఁ డగుకుంతికిఁ, దనయులు లే కున్నఁ గాంచి ♦ తనతనయఁ బృథం
దనయఁగ నిమ్మన శూరుఁడు, దనయందుల మైత్రి నిచ్చె ♦ ధరణీనాథా. 718

వ. అయ్యింతి కుంతిభోజునింటం బెరుఁగు చుండ నొకనాఁడు దుర్వాసుం డరుగుదెంచిన నమ్మహాత్మునకుఁ గొన్నిదినంబులు [1]పరిచర్యలు సేసి వేల్పులం జేరంజీరువిద్యం బడసి యావిద్యలా వెఱుంగ నొక్కనాఁ డేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన నాదేవుండు వచ్చినం జూచి వెఱఁగుపడి యి ట్లనియె. 719

క. మంత్రపరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ ♦ మదనక్రీడా
తంత్రంబుఁ గోరి చీరను, మంత్రించినతప్పు సైఁచి ♦ మరలు దినేశా. 720

వ. అనిన నయ్యువిదకుఁ బద్మినీవల్లభుం డి ట్లనియె. 721

మ. తెఱవా [2]నీపలు కట్ల యౌఁ గ నసదు లే ♦ దేవోత్తమాహ్వానముల్
మొఱఁగం బోలునె వేల్పులం బడయుటల్ ♦ మోఘంబు లే నీకు నీ
తఱి గర్భం బగుఁ బుత్త్రుఁడుం గలుగు నీ♦తారుణ్యముం బూజ్య మౌ
వెఱవం గార్యము లేదు సిగ్గు దగునే ♦ వ్రీడావినమ్రాననా. 722

చ. అని తగ నియ్యకొల్పి లలి♦తాంగికి గర్భము సేసి మింటికిం

---

1 'భక్తింజేసి. 2 నీప్రతిమాగ్రహాటనములే' వ్రా. ప్ర.

జనియె దినేశ్వరుం డపుడు సక్కనిరెండవసూర్యుఁడో యనం
దనరెడుపుత్త్రుఁ గాంచి కృప దప్పి జగజ్జనవాదభీత యై
తనయుని [1]నేటిలో విడిచి తా నరిగెం బృథ దండ్రియింటికిన్. 723

వ. అయ్యువిదను నీప్రపితామహుం డైనపాండురాజు వివాహం బయ్యె నయ్యంగనకుఁ బాండురాజువలన ధర్మజభీమార్జునులు వుట్టి రంత నమ్ముగుదచెల్లె లగుశ్రుతదేవ యనుదానిం గారూషకుం డైనవృద్ధశర్మ పెండ్లియాడె నయ్యిద్దఱకు మునిశాపంబున దంతవక్త్రుఁ డనుదానవుండు జన్మించె దానితోడంబుట్టు వగుశ్రుతకీర్తిని గేకయరా జైనధృష్టకేతుండు వరించె నాదంపతులకుఁ బ్రతర్దనాదు లేవురు వుట్టిరి దానిభగిని యైనరాజాధిదేవిని జయత్సేనుండు పరిణయం బయ్యె నామిథునంబునకు విందానువిందులు సంభవించిరి దానితోఁబుట్టు శ్రుతశ్రవసను జేదిదేశాధిపతి యైనదమఘోషుండు పరిగ్రహించె నాయుగళంబునకు శిశుపాలుం డుదయించె వసుదేవునితమ్ముఁ డైనదేవభాగునికిఁ గంసయందుఁ జిత్రకేతు బృహద్బలు లిరువురు జనించిరి వానిభార్య యగు దేవశ్రవుం డనువానికిఁ గంసవతియందు వీరుండును నిషుమంతుండును నుప్పతిల్లిరి వానిసోదరుం డయినకంకునికిఁ గంక యనుదానికి బకుండు సత్యజిత్తుఁ బురుజిత్తు ననువా రుద్భవిల్లిరి వానిసహజన్ముం డయినసృంజయునికి రాష్ట్రపాలియందు వృషదుర్మర్షణాదు లావిర్భవించిరి వానియనుజాతుం డయినశ్యామకునకు సురభూమియందు హరికేశహిరణ్యాక్షులు ప్రభవించిరి వానితమ్ముం డైనవత్సుండు మిశ్రకేశి యనునప్సరసయందు వృకాదిసుతులం గనియె వానియవరజుం డైనవృకుండు దూర్వాక్షియందుఁ దక్షపుష్కరసాళ్వాదుల నుత్పాదించె వానిజఘన్యజుం డయినయనికుండు సుదామని యనుదానియందు సుమిత్రాసికబాణాదు లయినకొడుకులం బడసె వానియవీయుం డైనయానకుండు కర్ణికయందు ఋతధామజయులం గాంచె వసుదేవునివలన రోహిణియందు బలుండును గదుండును సారణుండును విపులుండును ధ్రువుండును కృతాదులును బౌరవియందు సుభద్రుండును భద్రబాహుండును దుర్మదుండును భద్రుండును భూతాదులుం గూడఁ బన్నిద్దఱును మదిరయందు నందోపనందకృతకశ్రుతశూరాదులును గౌసల్యయందుఁ గేశియు రోచనయందు హస్తహేమాంగాదులును నిళయందు యదుముఖ్యు లయినయురువల్కలాదులును ధృతదేవయందుఁ ద్రిపృష్ఠుండును శాంతిదేవయందుఁ బ్రశ్రమప్రశ్రితాదులును నుపదేవయందుఁ గల్పవృష్ట్యాదులు పదుండ్రును శ్రీదేవయందు వసుహంససుధన్వాదు లార్గురును దేవరక్షితయందు గదాదులు దొమ్మండ్రును సహదేవయందుఁ బురూథశ్రుతముఖ్యాదు లెనమండ్రును దేవకియందుఁ గీర్తిమంతుండును సుషేణుండును భద్రసేనుండును ఋజువును సమదనుండును భద్రుం

1 నీటఁ బో.

డును సంకర్షణుండును ననువారేడ్వురును బుట్టిరి మఱియును. 724

క. దుష్టజననిగ్రహంబును, శిష్టప్రతిపాలనంబు | సేయుటకొఱకు నై
యష్టమగర్భమున గుణో,త్కృష్టుఁడు దేవకికి విష్ణు | దేవుఁడు పుట్టెన్. 725

ఆ. విష్ణుఁ డుదితుఁ డైన | వెనుక నా దేవకి, భద్రమూర్తి యగుసు | భద్రఁ గనియె
నాగుణాఢ్య [1]ముత్త | వగు నీకు నగ్జను, | దయిత యగుటఁ జేసి | ధరణినాథ. 726

క. ఎప్పుడు ధర్మక్షయ మగు, నెప్పుడు పాపంబు వొడము | నీలోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి, దప్పక విభుఁ డయ్యెఁ దన్నుఁ | దా సృజియించున్.

క. తనమాయ లేక పరునకు, ఘనునకు నీశ్వరున కాత్మ | కర్తకు హరికిన్
జననములకుఁ గర్మములకు, మనుజేశ్వర కారణంబు | మఱియును గలదే. 728

క. తలఁపఁగ నెవ్వనిమాయా, విలసనములు జననవృద్ధి | విలయంబులకుం
గలిమి కనుగ్రహమోక్షం, బులకును జీవులకు మూల | ములు నా నెగడున్.

సీ. అట్టిసర్వేశుని | కరయంగ జన్మాది, పరతంత్రభావ మె | వ్వాటఁ గలదు
రాజలాంఛనముల | రాక్షసవల్లభు, లక్షౌహిణీశు లై | యవనిఁ బుట్టి
జనుల బాధింపంగ | శాసించుకొఱకు నై, సంకర్షణునితోడ | జనన మంది
యమరులమనముల | కైన లెక్కింపంగ, రాకుండునట్టిక | ర్మములఁ జేసి

తే. కలియుగంబున జన్మింపఁ | గలుగునరుల, దుఃఖశోకతమంబును | దొలఁగ జడిసి
నేలవ్రేఁ గెల్ల, వారించి | నిఖిలదిశల, విమలకీర్తులు వెదచల్లి | వెలసె శౌరి. 730

సీ. జనకునిగృహమున | జన్మించి మందలోఁ, బెరిఁగి శత్రుల నెల్లఁ | బీఁచ మడఁచి
పెక్కండ్రుభార్యలఁ | బెండ్లియై సుతశతం, బులఁ గాంచి తను నాది | పురుషుఁ గూర్చి
క్రతువులు పెక్కులు | గావించి పాండవ, కౌరవులకు నంతఁ | గలహ మయిన
నందఱ సమయించి | యర్జును గెలిపించి, యుద్ధవునకుఁ దత్త్వ | మొప్పఁ జెప్పి

ఆ. మగధపాండవసృంజయ | మధుదశార్హ, భోజవృష్ణ్యంధకాదిసం | పూజ్యుఁ డగుచు
నుర్వీభరము నివారించి | యుండనొల్ల, కామహామూర్తి నిజమూర్తి | యందుఁ బొం [దె.

క. మంగళహరికీర్తిమహా, గంగామృత మించు కైనఁ | గర్ణాంజలులన్
సంగతము సేసి రేనిఁ గొ, లంగును గర్మంబు [2]లావి | లం బగుచు నృపా. 732

క. వనజాక్షునిమందస్మిత, ఘనకుండలదీప్తిగండ | కలితాననమున్
వనితలుఁ బురుషులుఁ జూచుచు, ననిమిషభావంబు లేమి | కలయుదు రధిపా.

చ. నగుమొగమున్ సుమధ్యమును | నల్లనిదేహము లచ్చి కాటప
ట్టగునురమున్ మహాభుజము | లంచితకుండలకర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృ | పారసదృష్టియుఁ గల్గువెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁ గాతఁ గను | మూసినయప్పుడు విచ్చినప్పుడున్. 734

వ. అని చెప్పి. 735

---

1 ముత్త మగు. 2 ప్రవిమలం బగుచు.

క. జనకసుతాహృచ్చోరా, జనకవచోలబ్ధవిపినశైలవిహారా
జనకామితమందారా, జనకాదిమహీశ్వరాతిశయసంచారా. 736

మాలిని. జగదవనవిహారీ శత్రులోకప్రహారీ
సుగుణవనవిహారీ సుందరీమానహారీ
విగతకలుషపోషీ వీరవిద్యాభిలాషీ
స్వగురుహృదయతోషీ సర్వదాసత్యభాషీ. 737

గద్యము. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రణీతం బయిన శ్రీమహాభాగవతం బనుమహాపురాణంబునందు సూర్యవంశారంభంబును వైవస్వతమనువుజన్మంబును హైమచంద్ర కథనంబును సుద్యుమ్నాదిమనుసూనులచరిత్రంబును మరుత్త తృణబిందు శర్యాతి కకుద్మి సగర నాభాగప్రముఖులచరిత్రంబులును నంబరీషునియందుఁ బ్రయోగింపం బడినదుర్వాసునికృత్య నిరర్థక యగుటయు నిక్ష్వాకు వికుక్షి మాంధాతృ పురుకుత్స హరిశ్చంద్ర సగర భగీరథప్రముఖులచరిత్రంబులును భాగీరథీప్రవాహవర్ణనంబును కల్మాషపాద ఖట్వాంగప్రముఖులవృత్తాంతంబును శ్రీరామచంద్రకథనంబును దదీయవంశపరంపరాగణనంబును నిమికథయును జంద్రవంశారంభంబును బుధపురూరవులకథయును జమదగ్ని పరశురాములవృత్తాంతంబును విశ్వామిత్ర నహుష యయాతి పూరు దుష్యంత భరత రంతిదేవ పాంచాల బృహద్రథ శంతను భీష్మ పాండవ కౌరవప్రముఖులవృత్తాంతంబును ఋశ్యశృంగవ్రతభంగంబును ద్రుహ్యానుతుర్వసులవంశంబును యదు కార్తవీర్య శశిబిందు జామదగ్న్యాదులచరిత్రంబును శ్రీకృష్ణావతారకథాసూచనంబును ననుకథలు గలనవమస్కంధము. 738

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

